ప్రాకృత అకాడెమీ ప్రచురణ : 5

# ప్రాకృత వాఙ్మయంలో రామకథ

డాక్టర్ తిరుమల రామచంద్ర, డి.లిట్.

ప్రాకృత అకాడెమీ
హైదరాబాద్ - 380.

ప్రథమ ముద్రణ : అగస్టు, 1992

ప్రతులు : 1000

ముఖచిత్రం : శ్రీ శ్వేత

ధర : రూ. 30-00

ప్రతులకు :
ప్రాకృత అకాడెమీ,
బరోడా బ్యాంక్ కాలనీ,
న్యూ బాకారం, హైదరాబాదు - 380

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్‌భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్-500 001.

ముద్రణ : లక్ష్మీ గణపతి ప్రింటింగ్ ప్రెస్,
SRT-199, 1-1-379.50/1, జవాహర్‌నగర్,
హైదరాబాద్ - 500 020.

# మనవి మాటలు

ఈ వ్యాస సంకలనంలోని మొదటి వ్యాసం శ్రీ సత్య సాయిబాబాగారు వైట్‌ఫీల్డ్‌లో నిర్వహించిన రామాయణ సదస్సులో చదివింది; తర్వాత భారతిలో ప్రచురితమైనట్టిది. రెండవ వ్యాసం శాంతినికేతనంలో జరిగిన ఓరియంటల్ కాన్ఫరెన్స్‌లో చదివింది; పిదప భారతిలో ప్రచురితమైంది. మూడవ వ్యాసం గుంటూరు అభ్యుదయ రచయితల సంఘం జరిపిన శ్రీ పులపుల శివయ్యగారి స్మారకోత్సవంలో చదివింది; తెలుగు అకాడమీ తెలుగు పత్రికలో ప్రచురితమయింది. నాల్గవ వ్యాసం శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో జరిగిన ద్రావిడ భాషా సభలో చదివింది; కొంత భారతిలోను, కొంత తెలుగు పత్రికలోను ప్రచురితమయింది. ఐదవది అరవై ఏళ్ళ క్రితం వ్రాసింది. ఏడవ ఎనిమిదవవి సరికొత్త వ్యాసాలు. చివరి వ్యాసం ప్రాకృతానికి సంబంధించింది కదా అని సాహితీ సుగతుని స్వాగతం నుంచి వచ్చి చేరింది. ఈ వ్యాసాలను పుస్తకంగా ప్రచురించుకొనడానికి అనుమతించిన ఆయా పత్రికల నిర్వాహకులకు కృతజ్ఞత తెలుపుకొంటున్నాను

ఈ వ్యాసాలతోని నూతన విషయాలు నా ఊహలు. విద్వాంసులు ఆమోదిస్తే సిద్ధాంతాలవుతాయి.

ఈ వ్యాస సంకలనాన్ని అకాల మృత్యువు వాతబడిన నా దౌహిత్రి కడాంబి అపరాజితకు అంకితమిస్తున్నాను. అపరాజిత 1989 జనవరిలో పుట్టి 1990 సెప్టెంబరులో పరమపదించింది. ఆ ఉన్న కొన్ని నెలలూ క్రమశిక్షణతో మెలగుతూ అపూర్వ ప్రతిభ చూపింది; తప్పటడుగులు వేస్తూ జిలిబిలి పలుకులు పలికే కాలానికే ఏవేవో పాటలు పాడుతూ ఆడుకొనేది ఒంటరిగా. ఉదయం ఇంటిముంగిటి మల్లె పందిరికిందరాలిన మల్లెపూవులు ఏరుకొనివచ్చి మెట్లమీద మూలలో పేర్చి ఏవో పాటలు పాడుతూ గొబ్బిళ్ళు తడుతూ తిరిగేది. ఇంటి యజమానులు శ్రీ పేరి ఉమా మహేశ్వరరావుగారికి, వారి సతీమణి శ్రీమతి నాగలక్ష్మిగారికి "తాతా, అమ్మమ్మా! పూజ, పూలు" అంటూ మల్లెపూవులు అందించేది.

ఒక ఉదయం ఏమిటీ పాటలు అనే కుతూహలంతో విన్నాను. ఏవో సంస్కృతపు పాటలులాగ వినిపించాయి. నా అర్ధాంగి సౌభాగ్యవతి అనంత

లక్ష్మీ శ్రీకృష్ణ బ్రహ్మ తంత్ర పరకాల యతీంద్రుల, శ్రీ రాళ్ళపల్లి గోపాల కృష్ణమాచార్య, అనంతకృష్ణ శర్మల సంస్కృత గీతాలు తరచు పాడుతూ ఉంటుంది గనుక ఆ బాణీ పట్టుకొందేమో ఈ పాప అని ఊరుకున్నాను. మరొక మారుకూడ ఆ పాటలు యాదృచ్ఛికంగా విన్నాను. ఈసారి ప్రాకృత గీతాలలాగ వినిపించింది. బాణీ ప్రాకృతాలదే. భాష ప్రాకృత సంస్కృతాప భ్రంశాల కలగలుపుగా ఉంది. ఆశ్చర్యపడి శ్రద్ధగా విన్నాను. పదహైదు నెలల పాప! ఏమిటీ విచిత్రం - అనుకుంటూ దగ్గరికి వెళ్ళాను. పాప కొంచెం సిగ్గుపడి, పాట, పూజతంతు ఆపింది. నేను బతిమాలగా మళ్ళీ ప్రారంభించింది. అదే బాణీ! అదే భాష! దమ్మపదాన్ని, గాథా సప్తశతిని నోరు తిరక్క ఇష్టం వచ్చినట్టు సరళం చేసి పాడుతున్నట్టు అనిపించి, "ఏ భాషమ్మా! పాపా!" అని అడిగాను. "పాళీ" అన్నది. అదిరి పడ్డాను. నేను వింటున్నది నిజమా! కంటున్నది కలగాదు గదా! - అని అనుకుంటూ, మరొకమారు "అప్పా! ఏం భాషమ్మా! ఏం పాటమ్మా?" అని అడిగాను. "పాళీ తాతా!" అని గట్టిగా చెప్పి, ఇక పదేపదే అడుగవద్దు విసిగించకు అన్నట్టు తన పనిలో లీనమైపోయింది.

నేను దాదాపు అరగంట సంభ్రమాశ్చర్యాలతో అట్లే వింటూ ఉన్నాను. మూడు రోజులు నిద్ర పట్టలేదు. ఈ పాప ఏదో కారణజన్మురాలు అనుకొని ఇంట్లో అందరికీ చెప్పాను. వారు నమ్మలేదుగాని, నాపై గౌరవంతో విన్నారు.

కారణ జన్మురాలని నేను భావించిన ఆ పాపకు నెల తిరగకుండానే పుట్టకురుపు (కేన్సర్) రావడం, నాలుగైదు నెలలు బాధపడడం, బొంబాయిలో శస్త్రచికిత్స జరిగిన పిదప ఇక మృత్యువును జయించినట్టేనని ఆశ కల్పించి హఠాత్తుగా మరణించడం ఋణశేషం తీర్చుకోడానికి వచ్చి వెళ్ళిందని అందరం అనుకోడం - వరుసగా జరిగిన విషాద సంఘటనలు.

ముఖచిత్రం రూపొందించిన శ్రీ శ్వేతగారికి, చక్కగా ముద్రించిన లక్ష్మీ గణపతి ప్రింటింగ్ ప్రెస్ వారికి కృతజ్ఞుణ్ణి.

హైదరాబాద్-380
అంగీరస శ్రావణ పూర్ణిమ
12 ఆగస్టు 92

భాషా సేవకుడు
**తిరుమల రామచంద్ర**

# అంకితం



చిరంజీవిని అపరాజితా కడాంబి ప్రతిభా స్మృతికి

# విషయసూచిక

# ప్రాకృత వాఙ్మయంలో రామకథ

ప్రాకృత సాహిత్యంలో రామకథ మూడుపాయలై పారింది. దీనిలో మొదటి పాయ బౌద్ధ సంప్రదాయానుసారి; రెండవది జైన సంప్రదాయానుగామి మూడవది వాల్మీకి సంప్రదాయానువర్తి. ఈ మూడింటినీ సంగ్రహంగా నివేదిస్తున్నాను:[1]

ఏ దైవదుర్విపాకమో, ఏ బుద్ధి జాడ్య జనితోన్మాదమోగాని, బౌద్ధ జైన సాహిత్యాలు వాల్మీకి రామాయణ సుధా స్వాదన వంచితాలయాయనే దుఃఖంతో ఈ వ్యాసం ప్రారంభిస్తున్నందుకు మీ మన్నన వేడుతున్నాను. దైవ దుర్విలసితం కాకపోతే బౌద్ధులు, జైనులు వాల్మీకి రామాయణాన్ని అమూలకంగా, అనపేక్షితంగా మార్చవలసిన అవసరంలేదు. రామకథతో తమ మతంవారు అకృష్టులవుతారనే భయంతో ఈ మార్పులు చేశారా? - అనే సందేహమూ కలుగుతుంది. కాని, రామాయణ భారతాల వంటి మహోన్నత వస్తువులను విడనాడడానికి వారి మనస్సు ఒప్పలేదు; వాటిని స్వాయత్తం చేసుకోవాలనే ఉత్కంఠ మరొకవైపు. కనుకనే దానికి మార్పులు, చేర్పులు కూర్చి స్వాయత్తం చేసుకొన్నారు; కాని తాము వాస్తవ రసా స్వాదన వంచితులయ్యారు; తదనంతర ప్రజలను వంచితులను చేశారు.

## బౌద్ధ రామ కథలు

ప్రాకృత సాహిత్యంలో మనకు లభించే అతి ప్రాచీన రామకథ బుద్ధ జాతక కథలలోనిది. జాతకకథలు బుద్ధ భగవానుని పూర్వజన్మ గాథలు. ఇవి బుద్ధ భగవానుడు ఆయా సందర్భాలలో అనుయాయులకు చేసిన ఉపదేశాలకు ఉదాహరణాలుగా చెప్పినవని బౌద్ధుల సంప్రదాయం. ఈ జాతక కథలు మొత్తం 550. వీటిలో రామకథకు సంబంధించిన మూడు కథలు మనకు

---

1. [సత్యసాయి విద్యాసంస్థ వారు 1977 మే 19 నుంచి 25 వరకు వైట్ ఫీల్డ్‌లోని శ్రీ సత్యసాయి కళాశాలలో ఏర్పాటు చేసిన రామాయణ సుధాలహరి సదస్సులో చదివిన వ్యాసం. తర్వాత భారతి 1978 జూన్ సంచిక నుంచి ప్రచురితం.]

పూర్తిగా లభిస్తున్నవి. మరి కొన్నిటిలో రామకథా ప్రస్తావన కనిపిస్తుంది. జాతక కథల నిర్వహణ పచ్చుప్పన్నవత్థు, అతీతవత్థు, సమోధానం రూపంలో ఉంటుంది. ప్రచ్చుప్పన్నవత్థు ప్రత్యుత్పన్న వస్తువు - వర్తమానకథ. అతీతవత్థు అతీతవస్తువు - అతీతకథ. సమోధానం సమయాధానం - జాతక కథకు వర్తమాన కథతో సామంజస్యం.

## దశరథ జాతకం

పైన పేర్కొన్న మూడు జాతక కథలలో మొదటిది దశరథ జాతకం. ఇది 'జాతకట్ఠ వణ్ణన'లో ఉన్నది. దీని సారాంశం ఇది:

ఈ కథను బుద్ధ భగవానుడు జేతవనంలో విహరిస్తున్నప్పుడు, తండ్రి మరణించిన ఒక గృహస్థును ఉద్దేశించి చెప్పినది. ఈ గృహస్థు పితృశోకంతో వెర్రివాడయి తన పనులన్నిటినీ విడనాడుతాడు. ఈ సంగతి తెలిసి శాస్త్ర ఆ గృహస్థు ఇంటికి వెళ్ళి అతనితో "ఉపాసకా, పౌరాణిక పండితులు-పూర్వం పండితులు తండ్రి మరణించినా దుఃఖించలేదు, లేశమాత్రమయినా" అంటాడు. తర్వాత, ఆ గృహస్థు అనురోధంతో పూర్వజన్మ కథ వివరిస్తాడు భగవానుడు. ఇది వర్తమాన కథ.

## అతీత కథ ఇది:

పూర్వం వారణాసిలో దశరథుడు ధర్మప్రకారం రాజ్యం చేస్తుంటాడు. ఆయనకు 16 వేల మంది భార్యలు. వారిలో పట్టపురాణికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె జన్మించారు. పెద్ద కుమారుని పేరు రామ పండితుడు; రెండవ వాని పేరు లక్ష్మణ కుమారుడు; కుమార్తె పేరు సీతాదేవి. కొంతకాలానికి పట్టపుదేవి కాలధర్మం చెందింది. ఆమె పోయిన తర్వాత రాజు చాలా సేపటి వరకు శోకాభిభూతుడై వుంటాడు. అమాత్యులు బోధించినమీదట రాజు తెలివి తెచ్చుకొని అపరకర్మలు చేయించి, మరొకతెను పట్టపురాణిగా-అగ్గ మహిషిట్ఠాణంలో-చేసుకొంటాడు. ఆమె రాజుకు ఇష్టురాలు, మనోరంజకురాలు అయింది. ఆమెకు ఒక కుమారుడు కలుగుతాడు. అతని పేరు భరతుడు. పుత్రవాత్సల్యంతో రాజు "భద్రే, నీకు ఒక వరమిస్తాను కోరుకో" అంటాడు. ఆమె వరం తీసుకుని, కుమారునికి ఏడు సంవత్సరాలు వచ్చేటప్పటికి రాజసన్నిధికి వచ్చి, తన కుమారునికిచ్చిన వరం జ్ఞాపకపరచి, "పుత్రునికి రాజ్యము దయచేయుము'' అని కోరింది.

రాజుకు చాల కోపం వచ్చింది. "దుర్మార్గురాలా, నీవు నశిస్తావు. నాకుమారులిద్దరు అగ్నిస్కంధాలవలె ప్రకాశిస్తున్నారు. వారిని వదలి నీ కుమారు



నికి రాజ్యం యాచిస్తున్నావా?'' అని బెదరిస్తాడు. రాణి మనసు చెదరి శయనాగారం చేరి తలుపు బిడాయించుకుంటుంది. తర్వాత ఆమె తరచు తన కుమారునికి రాజ్యమిమ్మని రాజును వేధిస్తూనే వుంటుంది.

రాజు ఆమెకు వరమివ్వక "స్త్రీలకు కృతజ్ఞత లేదు. వాళ్ళు ద్రోహం తలపెడుతారు. ఈమె మోసంతో రాజముద్రిక వేసి నా కుమారులిద్దరిని సంహరిస్తుందేమో! అలాటిది జరుగరాదు" అనుకొని, రామపండితుని, లక్ష్మణ కుమారుని పిలిపించి "మీరిక్కడ వుంటే అపాయం సంభవించవచ్చు. కనుక ఏదో సామంత రాజ్యంలోగాని, అడవిలోగాని నివసించండి. నా అనంతరం వంశపరంపరాగత మయిన రాజ్యం గ్రహించండి" అని చెప్పి, జ్యోతిష్కులను పిలిపించి, తన ఆయుః ప్రమాణం గురించి అడుగుతాడు. పన్నెండు సంవత్సరాలని వారు విన్నవిస్తారు. పిదప రాజు "నాయనలారా, మీరు నేటి నుండి పన్నెండు సంవత్సరాలు ఎక్కడయినా వుండి, తర్వాత తిరిగివచ్చి ఛత్రధారణ చేయండి" అని చెప్పుతాడు. అప్పటికే రాముని తల్లి గతించింది.

వారు సరేనని తండ్రికి నమస్కారం చేసి రాజభవనంలోని వారు కన్నీరు కార్చుతుండగా ప్రవాసానికి ఉద్యుక్తులవుతారు. సీతకూడ తండ్రి అనుమతితో వారివెంట బయలుదేరుతుంది. వారు తమ వెంటవచ్చే పరిజనాన్ని వెనక్కు మళ్ళించి హిమాలయాలకు వెళ్ళుతారు. అక్కడ జలాలు, ఫలాలు మొదలయినవి సులభంగా దొరికేచోట వారు ఆశ్రమం నిర్మించుకొని, కందమూల ఫలాలతో జీవనం గడుపుతారు. లక్ష్మణ కుమారుడు, సీతాదేవి రామపండితునితో "నీవు మాకు పితృస్థానీయుడివి. కనుక నీవు ఆశ్రమంలో వుండు. మేము కందమూల ఫలాలు తెచ్చి నిన్ను పోషిస్తాము'' అంటారు. రామపండితుడు ఆశ్రమంలోనే ఉంటాడు. వారిద్దరూ అతనికి సేవచేస్తారు.

అక్కడ వారణాసిలో దశరథుడు పుత్రశోకంతో జ్యోతిష్కులు చెప్పిన పన్నెండేళ్ళు దాటకముందే తొమ్మిదవ ఏటే మరణిస్తాడు. అపరకర్మల పిదప. భరతకుమారుని అభిషేకానికి అమాత్యులు అడ్డంకులు పెడుతారు. "రాజ్యచ్ఛత్రాధిపతి అరణ్యంలో నివసిస్తున్నాడు'' అనీ అంటారు. ఆ మాటలకు భరతుడు "రామపండితుణ్ని వనంనుంచి పిలుచుకొని వచ్చి ఛత్రధారణం చేయిస్తాను'' అని యోచించి, పంచ రాజలాంఛనాలతో, చతురంగ బలంతో బయలు వెడలి, రామపండితుని ఆశ్రమం తెలుసుకొని, దానికి కొంతదూరంలో సైన్య శిబిరం ఏర్పాటు చేసుకొని, లక్ష్మణుడు, సీత కందమూల ఫలాలకోసం వెళ్ళిన సమయంలో రామపండితుని ఆశ్రమం చేరి, సుప్రతిష్ఠితమైన సువర్ణ విగ్రహం

వలె నిశ్చింతగా ఉపవిష్టుడైన రామపండితుని చూచాడు. పిదప అతని సన్నిధి పోయి, ప్రణామంచేసి ఒక ప్రక్కన నిలిచి రాజుమరణవృత్తాంతం తెలిపి అమాత్యులతో సహా రాముని పాదాలకడ వాలి రోదనం చేయసాగినాడు. రామపండితుడు చింతించలేదు, రోదనం చేయలేదు. ఆయన ఆకృతిలో వికారం తోపలేదు. రామపండితో నేవసోచి, నరోది.

సందెవేళకు సీతా లక్ష్మణులు కందమూల ఫలాలతో తిరిగి వస్తారు. రాముడు తనలో "ఇతడు చిన్నవాడు. నాకు ఉన్నంత ప్రధిమ కలవాడు కాడు. తండ్రి మరణవార్త సూటిగా తెలిపితే శోకావేశంతో గుండెలు ఆగి పోవచ్చు. కనుక వీరిని జలాశయానికి పంపి, ఈ వృత్తాంతం తెలుపుతాను" అని భావించి, ఎదుటఉన్న నీటిపట్టు చూపి, "మీరు ఆలస్యంగా వచ్చినారు. నీటిలో దిగి స్నానం చేయండి.

"ఏథ లక్ఖణ సీతాచ ఉభో పి తరధోదకం.
ఏవాయం భరతో ఆహ రాజా దశరథో మతో.

దశరథ మహారాజు మరణించారని భరతుడు చెబుతున్నాడు" అన్నాడు. తండ్రి మరణవార్త విని వారిద్దరూ తెలివి కోల్పోయారు. ఇలా మూడుసార్లు వారు మూర్ఛపోతారు. అమాత్యులు వారిని నీటిలోనుంచి ఇవతలికి తెస్తారు. రాముడు ఏమాత్రమూ శోకించనందుకు భరతునికి ఆశ్చర్యం కలుగుతుంది. ఆయన శోక రహితుడై వుండడానికి కారణమేమిటో అడుగదలచాడు, అడిగాడు. రాముడు అనిత్యతా స్వరూపం వివరించాడు.

కేన రామా పృభావేన సోచితవ్వం స సోచసి,
పితరం కాలకతం సుత్వా న తంపసహతే దుఖం?

అని భరతుడు ప్రశ్నిస్తాడు.

యం న సక్కాపాలేతుం పోగేన లపతం బహుం,
స కిస్స విఞ్ఞా మేధావీ అత్తానం ఉపతాపయే.

దహరాచహి వృద్ధాచ యే బాలా యే చ పండితా,
అడ్ఢా చైవ దవిద్దా చ సచ్చే మచ్చు పరాయనా.

ఫలానమివ పక్కానం నిచ్చం వ పతనా భయం.
ఏవం జాతానం మచ్చానం నిత్యం మరణతో భయం.



సాయమేకే న దిస్సంతి పాతో దిట్ఠా బహూజనా,
పాతో ఏకే న దిస్సంతి సాయం దిట్ఠా బహూజనా

పరిదేవయ మానోచే కంచిదత్థం ఉపబ్బహే
సమ్మూళ్హో హింసమత్తానం క ఇరచేనం విచక్ఖణో.

కిసో వివణ్ణో భవతి హింస మత్తాన మత్తనో,
న తేన పేతా పాలేంతి నిరత్థా పరిదేవనా.

యథా సరణ మాదిత్తం వారినా పరినిబ్బయే
ఏవమపి ధీరో సుతవా మేధావీ పండితో నరో.
ఖిప్పముప్పతితం సోకం వాతోతూలం వ ధంసయే.

ఏకోవ మచ్చో అచ్చేతి ఏకోవ జాయతే కులే,
సంయోగ పరమత్వేవ సంభోగా సబ్బపాణినం.

తస్మా హి ధీరస్స బహుస్సుతస్స
సంపస్సతో లోకమిమం పరంచ,
అఞ్ఞాయధమ్మం హృదయం మనంచ
సోకా మహంతాపి న తాపయంతి,

సోహం దస్సంచ భోక్కంచ
భరిస్సామి తనాతకే.
సేసం సంపాలయిస్సామి
కచ్చమేవం విధానతో.

అర్థాత్ –

ఎంత ఏలపించినగూడ నెవని జీఎ
తమ్ము నిలువదో వానికై తనకుదాను
బుద్ధిమంతుడు పీడలు పొందనేల!
పడుచువారలు వృద్ధులు పండితులును
నిండు మూర్ఖులు, ధనికులు, నిర్ధనులును
అందరును మృత్యువొందుదు రనుట నిజము.
అవనిజమునుండి పడిపోదునను భయంబు
ఫలమునకునుండు నిత్యము: ప్రభవమొందు
మనుజునకు నిత్యముండును మరణభయము.

చాల గనబడుచుండ్రు జనులు
సందెవేళకు నుండరు కొందరందు.
సందెవేళను గనబడు జనమునందు
ఒక్కడుం గూడ గనబడ డుదయవేళ.

మూఢులగువార లేడ్చుచు మొత్తుకొనుచు
కష్టపడ లాభలేశము కలుగునేని
ఉత్తములుగూడ నేడ్చుచు మొత్తుకొండ్రు.

తనకుదా హింసించుకొనుచు నెంతయును
దుఃఖించు నాతండు దుర్వర్ణుడగుచు
పొగులుచు నున్నచో పోషణం బగునె
మృతునకుః ఏడుపు వితథమ్ము సుమ్ము.

ముట్టుకొన్నంతనే గృహమునకు నిప్పు
సలిలముల నార్పివేసెడి చందమునను
దూది పింజను వాయువు తోలునట్లు
తోడనే జ్ఞాని దుఃఖమున్ దోలవలయు.

ప్రాణి ఏకాకిగా ప్రభవించుచుండు
ఒకడు కుటుంబాన నుదయించుచుండు
సంయోగ పరములు సర్వభోగములు.

ఇహపర లోకాల నెవడు ధ్యానించు
అష్ట జగద్ధర్మ మవగత మెవనికి
ఆ బహుశ్రుతు ధీరు నధిక శోకంబు
నైతము బాధింప జాలదు సుమ్ము.

యోగ్యులౌ వారల నొసగుచునుండు
భోగవైభములన్; పోషించుచుండు
బంధువులన్; పేదవారి పాలింతు
కరణీయమిదె బోధ కల్గువారలకు.

(శివశంకరస్వామి అనువాదం)

అని రామపండితుడు అనిత్యతాప్రకాశనం చేసి ధర్మోపదేశం చేస్తారు. అక్కడ ఉన్నవారంతా అది విని శోక విరహితులవుతారు. అప్పుడు భరత కుమారుడు



రామపండితునికి ప్రణామంచేసి, "వారాణసీ రాజ్య పరిపాలనం నిర్వహించండి" అని వేడుకొంటాడు.

రాముడు భరతునితో "లక్ష్మణ కుమారుని, సీతాదేవిని పిలుచుకొని పోయి రాజ్యపాలనం చేయి. పన్నెండు సంవత్సరాల తర్వాత రాజ్యం చేయ వలసిందని నాతో నాయనగారన్నారు. నే నిప్పుడే అక్కడికి వస్తే ఆజ్ఞా పరిపాలనం కాదు. మిగిలిన మూడు సంవత్సరాలూ గడచిన పిదప నేను వస్తాను" అని దృఢంగా చెబుతాడు.

భరతుడు ససేమిరా పరిపాలనకు అంగీకరించడు; బలవంతం చేస్తాడు, రాముణ్ని రమ్మని. అప్పుడు రామపండితుడు "నేను రానంతవరకు ఈ పాదుకలు రాజ్యం నడుపుతాయి" అని తన తృణపాదుకలు తీసి ఇస్తాడు. అప్పుడు భరతుడు, సీత, లక్ష్మణుడు పాదుకలను తీసుకొని రామపండితునికి ప్రణామంచేసి, సపరివారంగా వారాణసి చేరుతారు. మూడు సంవత్సరాలకాలం పాదుకలను ప్రతినిధిగా ఉంచి రాజ్య పరిపాలనం జరుపుతాడు భరతుడు.

అమాత్యులు ఈ తృణ పాదుకలను సింహాసనంపై పెట్టి అభియోగాలకు తీర్పు చెప్పేవారు, తీర్పు సరిగా లేకపోతే పాదుకలు పరస్పరం కొట్టుకుంటాయి (పరిహణంతి); నిర్ణయం సరిగా జరిగితే, ప్రశాంతంగా ఉండేవి.

రామపండితుడు మూడు సంవత్సరాల తర్వాత అరణ్యవాసం చాలించుకొని వారణాసి చేసి ఒక ఉద్యానవనంలో ప్రవేశించాడు. ఆయన రాక తెలుసుకొని భరతుడు అమాత్యులతోపాటు వచ్చి, స్వాగతం చెప్పి రాజ్యం అప్పగిస్తాడు. రాముడు సీతను పట్టపు రాణిని చేసి, పట్టాభిషిక్తుడై, అలంకృతమైన రథమెక్కి నగర ప్రదక్షిణంచేసి, సుచంద్ర ప్రాసాదం పైఅంతస్తుచేరి పదహారు వేల సంవత్సరాల పాటు ధర్మానుసారంగా రాజ్యంచేసి, చివరకు స్వర్గగామి అయినాడు.

దశవస్స సహస్సాని సట్ఠి వస్స సతానిచ
కంబుగీవ మహాబాహు రామో రజ్జమకారయి.

## సమోధానం :

బుద్ధభగవానుడు ఈ ధర్మోపదేశం చేసి జాతకాలు రెండింటినీ— జన్మలు రెండింటిని — సరిపోల్చాడు:— "ఆ కాలంలో మహారాజా శుద్ధోదనుడు దశరథుడు; మాహామాయ రామపండితుని తల్లి; రాహులుని తల్లి సీత; ఆనందుడు భరతుడు, సారి పుత్రుడు లక్ష్మణుడు; పరివారం బుద్ధపరిషత్తు; నేనే రామపండితుడిని" అని.

ఈ కథ విన్న తరువాత గృహస్థు స్రోతాపత్తిఫలం పొంది దుఃఖదూరుడవుతాడు. (461)

ఈ దశరథ జాతకం రామకథా మూలస్వరూపమని పలువురు విద్వాంసులు భావించడంవల్ల, దీనిపై వాద వివాదాలు చాల చెలరేగాయి. ఈ జాతక కథ లిఖిస్తున్న 'జాతకట్ఠ వణ్ణన' అనే గ్రంథం క్రీస్తు శకం 5 వ శతాబ్దపు సింహళీయ గ్రంథానికి పాలీ అనువాదం. ఈ సింహళీయ గ్రంథం ప్రాచీన పాలీ గాథల టీక. పైన పేర్కొన్న రామపండితుని ఉపదేశంలోని గాథల వంటివి భగవద్గీతలో కానవస్తాయి.

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మాదపరిహార్యేర్థే నత్వం శోచితు మర్హసి. (2.27)

ఈ జాతక కథలోని "ఫలానమివ పక్కానం'' అనే గాథ రామాయణంలోని

యథా ఫలానాం పక్వానాం నాన్యత్ర పతనాద్భయం,
ఏవం నరాణాం జాతానాం నాన్యత్ర మరణాద్భయం.
(2.107.17)

శ్లోకంతో పోలుతున్నది. ఈ కథలోని జలక్రియ గాథతో రామాయణంలోని జలక్రియతో సంబంధం ఉన్నదని స్పష్టం. రామాయణంలో రాముడు లక్ష్మణునితో ఇలా అంటాడు:

''భరతో దుఃఖ మాచష్టే స్వర్గతిం పృథివీ పతేః, 15
జలక్రియార్థం తాతస్య గమిష్యామి మహాత్మనః, 20
సీతా పురస్తాత్ వ్రజతు త్వమేనా మభితో వ్రజ,
అహం పశ్చాద్గమిష్యామి గతిర్హ్యేషా సుదారుణా.'' 21

లక్ష్మణా, రాజు మరణించాడనే దుఃఖ వార్తను భరతుడు చెబుతున్నాడు. తండ్రికి నీళ్ళు వదలడానికి వెళ్ళుతాను. సీత మొదట వెళ్ళనీ, నీవు ఆమెకు ముందుగా వెళ్ళు. నేను వెంటవస్తాను - అని.

"యదేకో జాయతే జంతు రేకేనచ వినశ్యతి'' అనే రామాయణ శ్లోకంతో "ఏకోవ మచ్చో అచ్చేతి ఏకోవ జాయతే కులే'' అనే గాథ పూర్తిగా పోలుతున్నది.

ఇక "దసవస్స సహస్సాని'' అనే గాథ రామాయణంలోని

''దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ,
భ్రాతృభి స్సహిత శ్శ్రీమాన్ రామో రాజ్య మకారయత్"
(6.131.106)



రాముడు పదకొండువేల సంవత్సరాలు తన తమ్ములతో పాటు రాజ్యం చేశాడు. అనే శ్లోకంతో పోలుతున్నది. మహాభారతంలోని రామోపాఖ్యానంలోను

దశవర్ష సహస్రాణి దశవర్ష శతాని చ
రాజ్యం కారితవాన్ రామః తతస్తు త్రిదివంగతః. (3.147.38)
శ్యామో యువా లోహితాక్షో మత్తవారణ విక్రమ,
దశవర్ష సహస్రాణి రామో రాజ్య మకారయత్.
(12.29.54)

హరి వంశంలోను

దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ,
అయోధ్యాధిపతి ర్భూత్వా రామో రాజ్య మకారయత్.
(1.41.151)

అనే ప్రమాణాలున్నాయి. ఈ పోలికలను బట్టి వాల్మీకి రామాయణ ప్రభావం దశరథ జాతక కథపై వుందనడం స్పష్టం.

## అనామక జాతకం

రామకథ లభించే రెండవ జాతకం అనామక జాతకం. ఈ జాతక కథను క్రీస్తుశకం మూడవశతాబ్దిలో కాంగ్-సేంగ్-హుఈ అనే చీనా పండితుడు చీన భాషలోనికి అనువదించాడు. దీని మూల భారతీయ పాఠం లభించలేదు. చీన భాష నుంచి మరల ప్రాకృతానికి అనూదితమైంది.

ఈ జాతకకథలో రామాయణ పాత్రల ఉల్లేఖమేమీ లేదు. కాని, సీతారాముల వనవాసం, సీతాపహరణం, జటాయువృత్తాంతం, వాలి సుగ్రీవుల యుద్ధం, సేతుబంధం, సీత అగ్నిపరీక్ష వీటన్నిటి ప్రతికలూ ఉన్నాయి. ఈ కథలోని విశిష్టాంశ మేమిటంటె, రాముని సవతితల్లి వరంపై తండ్రి అరణ్యానికి పంపడు. రాముడు తన మేనమామ దండెత్తి వస్తాడని విని రాజ్యం వదలి అడవికి వెళ్ళుతాడు. రాముని ధనుష్టంకారం విన్నంతనే వాలి భయపడి పరుగెత్తిపోతాడు. బోధిసత్త్వుడు వాలిని వధించాడని చెప్పడం బౌద్ధులకు ఇష్టంలేదు.

ఈ జాతక కథ సారాంశమిది:

ఒక జన్మలో బోధిసత్త్వుడు గొప్పరాజు. అతడు నాలుగు ఉత్తమ గుణాలు - దానం, ప్రియవచనం, న్యాయం, సమదర్శిత కలవాడు. సమస్త జీవులను రక్షించేవాడు. అతని మేనమామ కూడ రాజు. అతడు లజ్జాహీనుడు,

ఈ కథ విన్న తరువాత గృహస్థు స్రోతాపత్తిఫలం పొంది దుఃఖదూరుడవుతాడు. (461)

ఈ దశరథ జాతకం రామకథా మూలస్వరూపమని పలువురు విద్వాంసులు భావించడంవల్ల, దీనిపై వాద వివాదాలు చాల చెలరేగాయి. ఈ జాతక కథ లిఖిస్తున్న 'జాతకట్ఠ వణ్ణన' అనే గ్రంథం క్రీస్తు శకం 5 వ శతాబ్దపు సింహళీయ గ్రంథానికి పాలీ అనువాదం. ఈ సింహళీయ గ్రంథం ప్రాచీన పాలీ గాథల టీక. పైన పేర్కొన్న రామపండితుని ఉపదేశంలోని గాథల వంటివి భగవద్గీతలో కానవస్తాయి.

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మాదపరిహార్యేర్థే నత్వం శోచితు మర్హసి. (2.27)

ఈ జాతక కథలోని "ఫలానమివ పక్కానం" అనే గాథ రామాయణంలోని

యథా ఫలానాం పక్వానాం నాన్యత్ర పతనాద్భయం,
ఏవం నరాణాం జాతానాం నాన్యత్ర మరణాద్భయం.
(2.107.17)

శ్లోకంతో పోలుతున్నది. ఈ కథలోని జలక్రియ గాథతో రామాయణంలోని జలక్రియతో సంబంధం ఉన్నదని స్పష్టం. రామాయణంలో రాముడు లక్ష్మణునితో ఇలా అంటాడు:

''భరతో దుఃఖ మాచష్టే స్వర్గతిం పృథివీ పతేః, 15
జలక్రియార్థం తాతస్య గమిష్యామి మహాత్మనః, 20
సీతా పురస్తాత్ వ్రజతు త్వమేనా మభితో వ్రజ,
అహం పశ్చాద్గమిష్యామి గతిర్హ్యేషా సుదారుణా.'' 21

లక్ష్మణా, రాజు మరణించాడనే దుఃఖ వార్తను భరతుడు చెబుతున్నాడు. తండ్రికి నీళ్ళు వదలడానికి వెళ్ళుతాను. సీత మొదట వెళ్ళనీ, నీవు ఆమెకు ముందుగా వెళ్ళు. నేను వెంటవస్తాను - అని.

"యదేకో జాయతే జంతు రేకేనచ వినశ్యతి'' అనే రామాయణ శ్లోకంతో "ఏకోవ మచ్చో అచ్చేతి ఏకోవ జాయతే కులే'' అనే గాథ పూర్తిగా పోలుతున్నది.

ఇక "దసవస్స సహస్సాని'' అనే గాథ రామాయణంలోని

''దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ,
భ్రాతృభి స్సహిత శ్శ్రీమాన్ రామో రాజ్య మకారయత్"
(6.131.106)



రాముడు పదకొండువేల సంవత్సరాలు తన తమ్ములతో పాటు రాజ్యం చేశాడు. అనే శ్లోకంతో పోలుతున్నది. మహాభారతంలోని రామోపాఖ్యానంలోను

దశవర్ష సహస్రాణి దశవర్ష శతాని చ
రాజ్యం కారితవాన్ రామః తతస్తు త్రిదివంగతః. (3.147.38)
శ్యామో యువా లోహితాక్షో మత్తవారణ విక్రమ,
దశవర్ష సహస్రాణి రామో రాజ్య మకారయత్.
(12.29.54)

హరి వంశంలోను

దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ,
అయోధ్యాధిపతి ర్భూత్వా రామో రాజ్య మకారయత్.
(1.41.151)

అనే ప్రమాణాలున్నాయి. ఈ పోలికలను బట్టి వాల్మీకి రామాయణ ప్రభావం దశరథ జాతక కథపై వుందనడం స్పష్టం.

## అనామక జాతకం

రామకథ లభించే రెండవ జాతకం అనామక జాతకం. ఈ జాతక కథను క్రీస్తుశకం మూడవశతాబ్దిలో కాంగ్-సేంగ్-హుఈ అనే చీనా పండితుడు చీన భాషలోనికి అనువదించాడు. దీని మూల భారతీయ పాఠం లభించలేదు. చీన భాష నుంచి మరల ప్రాకృతానికి అనూదితమైంది.

ఈ జాతకకథలో రామాయణ పాత్రల ఉల్లేఖమేమీ లేదు. కాని, సీతారాముల వనవాసం, సీతాపహరణం, జటాయువృత్తాంతం, వాలి సుగ్రీవుల యుద్ధం, సేతుబంధం, సీత అగ్నిపరీక్ష వీటన్నిటి ప్రతీకలూ ఉన్నాయి. ఈ కథలోని విశిష్టాంశ మేమిటంటె, రాముని సవతితల్లి వరంపై తండ్రి అరణ్యానికి పంపడు. రాముడు తన మేనమామ దండెత్తి వస్తాడని విని రాజ్యం వదలి అడవికి వెళ్ళుతాడు. రాముని ధనుష్టంకారం విన్నంతనే వాలి భయపడి పరుగెత్తిపోతాడు. బోధిసత్త్వుడు వాలిని వధించాడని చెప్పడం బౌద్ధులకు ఇష్టంలేదు.

**ఈ జాతక కథ సారాంశమిది:**

ఒక జన్మలో బోధిసత్త్వుడు గొప్పరాజు. అతడు నాలుగు ఉత్తమ గుణాలు - దానం, ప్రియవచనం, న్యాయం, సమదర్శిత కలవాడు. సమస్త జీవులను రక్షించేవాడు. అతని మేనమామ కూడ రాజు. అతడు లజ్జాహీనుడు,

అవహరించడానికి అతడొక లోభి, నిర్దయి, దుష్టుడు. బోధిసత్త్వుని రాజ్యం అవహరించడానికి అతడొక పెద్ద సైన్యం సిద్ధం చేశాడు.

బోధిసత్త్వుని రాజ్యసంచాలకులు కూడ పెద్ద సైన్యం సిద్ధపరచారు. బోధిసత్త్వుడు ఆ సైన్యాన్ని పరిశీలిస్తూ "కేవలం నాస్వార్థం కోసం ఇంతమంది ప్రాణాల తీయడం ఎందుకు? నేను రాజ్యం వదలి వెళ్ళిపోతే సమస్త దేశమూ రక్షితమవుతుంది" అని వారితో అన్నాడు. పిదప అతడు మంత్రులకు రాజ్యం అప్పగించి, రాణితోపాటు అడవులకు వెళ్ళాడు. అతని మేనమామ బోధిసత్త్వుని రాజ్యంలో ప్రవేశించి, ఆక్రమించుకొన్నాడు. ప్రజలకు చాల కష్టం కలిగింది.

బోధిసత్త్వుడు ఒక కొండమీది వనంలో నివాసం ఏర్పరచుకొన్నాడు. సముద్రంలో దుష్టుడైన నాగరాజు ఉన్నాడు. వాడు ఛద్మ ఋషి వేషం ధరించి, రాజు కందమూల ఫలాల తేవడానికి వెళ్ళినప్పుడు ఆశ్రమానికి వచ్చి రాణిని అవహరిస్తాడు. సముద్రానికి దారి రెండు కనుమల మధ్యన ఇరుకుగా వుంది. కొండమీద ఒక పెద్ద పక్షి వాలివుంది. అది తన రెక్కలు విప్పుకొని నాగరాజు దారిని అడ్డగించింది. నాగరాజు ఆ పక్షి కుడిరెక్కను తెగనరికి దానిని కూలవేస్తాడు. సముద్రంలోని తన ద్వీపానికి వెళ్ళుతాడు. రాణిని చెరలో పెడుతాడు.

కందమూల ఫలాలతో తిరిగివచ్చిన రాజు ఆశ్రమంలో రాణి లేకుండడం చూచి చాల దుఃఖపడుతాడు. ధనుర్బాణాలు ధరించి రాణి అన్వేషణ కోసం పర్వతాలు గాలిస్తాడు. అప్పుడు ఒక నదీ తీరంలో అతనికి ఒక పెద్ద కోతి కనబడుతుంది; అది చాల వ్యాకులంతో ఉన్నది. తానొక రాజునని తన పినతండ్రి రాజ్యం గుంజుకొని తనను తరిమివేశాడని, తనకెవ్వరూ మిత్రులు లేరని, రాజు అడిగినమీదట ఆ కోతి చెబుతుంది. రాజు ఆ కోతికి తన కష్టాలు తెలుపుతాడు. వారిద్దరు పరస్పర సహాయం కోసం వాగ్దానాలు చేసుకుంటారు. తర్వాత రాజు ధనుస్సు అల్లెత్రాడును మీటాడు బాణం సంధించాడు. ఆ టంకారం వినగానే కోతి పినతండ్రి భయకంపితుడై రాజ్యం వదలి పారిపోయాడు.

కోతి రాణిని వెదకడానికి తన స్నేహితులను పంపింది. కోతులు అన్ని దిక్కులకూ వెళ్ళాయి వెదకడానికి. వెదుకుతుండగా; వారికి దెబ్బతిని కూలి పోయిన ఒక పక్షి కనబడుతుంది. ఒక నాగరాజు రాణిని ఎత్తుకొని పోయాడని ఆ పక్షి చెబుతుంది. సముద్రం దాటడం ఎలాగని కపిరాజుకు సందేహం కలిగింది. అప్పుడు ఇంద్రుడు చిన్న కోతిరూపంతో వచ్చి, "ప్రతికోతీ ఒక్కొక్క గుండు మోసుకొని వచ్చి, సముద్రంలో పడవేయాలని ఉత్తర్వు



చేయండి. దానితో సముద్రంలో ఒక దారి ఏర్పడుతుంది. మీరు సుఖంగా నాగరాజు ద్వీపం చేరుకోవచ్చు" అని సలహా చెబుతాడు.

కోతులు ఆ విధగానే వారధి కట్టి, సముద్రం దాటి నాగద్వీపం ముట్టడి ముట్టారు. నాగరాజు విషమయమైన పొగమంచును ఉత్పన్నం చేస్తాడు. దానితో కపులంతా భూమిపై ఒరిగిపోయారు. చిన్న కోతి (ఇంద్రుడు) ఒక దివ్యౌషధిని కోతులకు వాసన చూపాడు. వారు మూర్ఛతేరి ఆరోగ్యవంతులయారు, అప్పుడు నాగరాజు పెద్ద తుఫానును కల్పించి కారుమేఘాలతో సూర్యుణ్ని కప్పివేశాడు. ఉరుములు, మెరుపులు. మెరుస్తున్న మెరుపే నాగరాజని చిన్న కోతి (ఇంద్రుడు) కపిరాజుకు తెలియజేస్తాడు. అప్పుడు రాజు ఒక బాణంలో నాగరాజును చంపివేస్తాడు.

తర్వాత చిన్నకోతి రాణిని చెరనుంచి విడిపిస్తాడు. ఇంతలో రాజు మేనమామ మరణించినట్లు వర్తమానం చేరుతుంది. రాజు స్వరాజ్యానికి తిరిగి వెళ్ళుతాడు. రాణి రాజును వదలి చాలకాలం పరపురుషుని ఇంట్లో వుందని జనం ఆడిపోసుకుంటారు. అది విని రాజు "నీవు పరగృహంలో చాలా కాలం వున్నందున నీ ప్రవర్తన గురించి జనం సందేహ పడుతున్నారు. నిన్ను స్వీక రించడం వంశమర్యాదను, సంప్రదాయాన్ని బట్టి ఎంతవరకు ఉచితం?" అని రాణిని ప్రశ్నిస్తాడు. "నేను ఒక నీచుని ఆధీనంలో ఒక గుహలో వున్నాను. కాని, బురదలో పంకజంలాగ ఉన్నాను. నాలో సతీత్వం వుంటే, భూమి వగిలిపోవుగాక!" అని రాణి అంటుంది. ఆ ప్రకారమే భూమి నెర్రెలు వారింది. ''చూచారా, నా సతీత్వం, ప్రమాణితమైనది" అని రాణి నిరూపిస్తుంది. రాజు, రాణి ధర్మనిష్ఠులు గనుక, రాజ్యంలోని అన్ని వర్గాలు తమ ధర్మాన్ని ఆచరిస్తూ వుండేవి.

ఈ అతీత కథ చెప్పిన పిదప బుద్ధభగవానుడు భిక్షువులతో ఇలా అన్నాడు:—''ఆ రాజును నేనే. రాణి గోప. మేనమామ దేవదత్తుడు. ఇంద్రుడు మైత్రేయుడు. బోధసత్త్వుని ఆచరణ శాంతి పారమిత ఎల్లలు లేనిది.''

ఈ జాతక కథ రామాయణ పాత్రలను చెప్పకపోయినా, పూర్తిగా వాల్మీకి రామాయణ కథకు అనుకరణమేనని వేరుగా చెప్పనక్కరలేదు.

## మూడవది దశరథ కథానకం :

చీన భాషలోని త్రిపిటికాలలో 'త్సా—పౌ—త్సంగ్—కింగ్' పేరుతో 121 అవదానాల సంకలన మొకటి వుంది. ఇది క్రీస్తుశకం 472లో చీన భాషలోకి అనూదితమైంది. దీని పాలీమూలం లభించడంలేదు. ఈ అవదాన

ప్రసక్తి అనేక కథలలో ప్రధానంగా వుండడంవల్ల సంగ్రహంలో కనిష్కుని ఈ అవదాన కథలు క్రీస్తుశకం రెండవ శతాబ్దంలో రచితమై వుంటాయని పండితుల ఊహ. ఈ అవదానాలలో 'దశరథ కథానకం' ఒక్కటి. ఈ కథలో సీతగాని, మరే రాజకుమారిగాని లేకపోవడం విశిష్టత. కథావస్తువు ఇది:—

పూర్వం ఒకప్పుడు మానవుల ఆయుస్సు పదివేలేండ్లు ఉండేది. ఆ కాలంలో జంబూద్వీపంలో దశరథుడనే రాజు రాజ్యం చేసేవాడు. ఆయన పట్టమహిషికి రాముడనే పుత్రుడు కలిగాడు. రెండవభార్యకు ఒక కుమారుడు. అతనిపేరు రామణుడు (లోమన–లక్ష్మణ). రామునిలో నారాయణ శక్తి వుండేది. మూడవరాణికి భరతుడు, నాల్గవరాణికి శత్రుఘ్నుడు పుట్టారు.

మూడవ రాణిమీద రాజుకు చాల ప్రేమ వుండేది. ఒకనాడు రాజు ఆమెతో "నీవు ఏమైనా కోరుకో. నేను నా సంపద, పూర్తి బొక్కసం ఇవ్వ డానికి సిద్ధంగా వున్నాను'' అన్నాడు. రాణి తనకేమి అవసరంలేదని అప్పుడు అన్నది. రాజు రోగగ్రస్తుడయాడు. తాను బ్రతకనని నిశ్చయించుకొని రాజు రామునికి పట్టంకట్టాడు. రాముడు సింహాసనంపై ఆసీనుడు కావడం చిన్న రాణికి కన్ను కుట్టింది. ''రాజా, నీవు నాకు పూర్వం ఇచ్చినవరం ఇప్పుడివ్వండి. రాముణ్ని గద్దెనుంచి దింపి, నా కుమారుడైన భరతునికి పట్టాభిషేకంచేయండి. ఇది నా కోరిక'' అని రాజుతో అన్నది. ఇది విని రాజు చాల దుఃఖపడ్డాడు. రాజు ధర్మానుసారం అతడు తన మాట తప్పదలచలేదు. అప్పుడు రామణుడు (లక్ష్మణుడు) రామునితో తన నారాయణశక్తిని చూపమని, సవతితల్లికి విశ్వాసం కలుగుతుందని ప్రార్థిస్తాడు. "తన తండ్రి ఆజ్ఞకు భంగం కలిగించే పుత్రుడు పితృభక్తుడనిపించుకోడు" అని రాముడు సమాధానమిచ్చి మిన్నకుంటాడు.

తన వరానికి కట్టుబడిన దశరథుడు తన కుమారులిద్దరికీ పన్నెండు సంవత్సరాల వనవాసం విధించి, తర్వాత స్వదేశానికి రమ్మంటాడు. అప్పుడు భరతుడు విదేశాలలో వున్నాడు. దశరథుని మరణానంతరం భరతుడు స్వదేశానికి మరలి వస్తాడు; తల్లి చేసిన పనికి కటకట పడతాడు. సేనతోపాటు రామ లక్ష్మణులున్న పర్వతానికి తరలివెళ్ళి, రాజధానికి మరలివచ్చి, రాజ్యపరిపాలన కొనసాగించ వలసిందని రాముణ్ని ప్రార్థిస్తారు. "వనవాసంకోసం తండ్రి ఆజ్ఞాపించారు. దానికి భంగం కలిగిస్తే నేను పితృాజ్ఞా పరిపాలకుడని అనిపించుకోను" అని రాముడు సమాధానం చెప్పి తిరిగి వెళ్ళటానికి నిరాకరిస్తాడు.

అప్పుడు భరతుడు రాముని చర్మపాదుకలు (చమ్మపాదుక) కోరుతాడు. వాటిని తీసుకొని అయోధ్యకు తిరిగి వస్తాడు. పిదప చర్మపాదుకలను



సింహాసనంమీద పెట్టి రాజ్యకార్యం నిర్వహిస్తాడు. ప్రతిదినం ఉదయ సాయం కాలాలలో పాదుకలకు పూజచేసి, వాని నుంచి అజ్ఞ తీసుకునేవాడు.

క్రమంగా రాముని వనవాసం గడువు పూర్తయింది. రాముడు వనవాసం ముగించుకొని స్వదేశానికి తిరిగి వస్తాడు. భరతుడు రాజ్యభారం స్వీకరించ వలసిందిగా రాముని ప్రార్థిస్తాడు. రాముడు మొదట నిరాకరించాడు, కాని, భరతుడు తీవ్రంగా అనురోధం చేయడం వలన స్వీకరించాడు. రాముని రాజ్యంలో అందరూ తమ తమ ధర్మాలు పాలించేవారు. శాంతి, సమృద్ధులు విరాజిల్లాయి.

దశరథ జాతకాన్ని, తక్కిన రెండిటిని అనామకాన్ని, దశరథ కథానకంను — పరిశీలించగా, పీటిలోని రామకథ వాల్మీకి రామాయణంతో చాల వరకు పోలుతున్నది. 'దశరథ జాతకం'లో రామ వనవాసానికి, సీతానుగమనానికి తగిన ఆధారాలు లభించవు. వాల్మీకి రామాయణ కథలో సీత భర్త వెంట వెళ్ళడం ఉచితమయినట్టు 'దశరథ జాతకం'లో చెల్లెలయిన సీత రామ లక్ష్మణులవెంట వెళ్ళడం ఉచితంగా తోచదు. చెల్లెలిని వివాహ మాడడం కూడ విడ్డూరంగా ఉంది. ఇంతకుముందు పేర్కొన్న గాథలకు రామాయణంతో పోలికలను బట్టి కూడ ఈ జాతక కథలన్నీ వాల్మీకీయ రామకథకు వికృత రూపంగా కనిపిస్తున్నాయి.

## పిటకాలలో

ఈ జాతక కథలు గాక పాళీత్రిపిటకాలలో రామ కథకు సంబంధించిన కొంత సామగ్రి — గాథలు ఉన్నాయి. వాటిని ఉల్లేఖిస్తాను. పీటిలో సీతా రాముల ప్రస్తావం ఉన్నందున త్రిపిటిక సంకలన కర్తలు వాల్మీకీయ రామ కథతో బాగా పరిచయమున్న వారనే స్పష్టమవుతుంది.

## జయద్దిస జాతకం

ఇది పాలీ జాతకద్ది వణ్ణనలో 513 వ జాతకం. దీనిలో 17 వ గాథను బట్టి రాముని వనవాసం హిమాలయాలలో గాక, దండకారణ్యంలో జరిగినట్టు వర్ణితమయింది. ఒక తల్లి తన కుమారునితో ఇలా అంటుంది:—

"యం దండకారణ్ణ గతస్స మాతా
రామస్స కా సోత్థానం సుగత్తా
తంతే అహం సోత్థానం కరోమి"

"దండకారణ్యవాసి అయిన రామునికి సుగాత్రి (సుందరి) అయిన తల్లి ఎలాటి స్వస్త్యయన మంగళం చేసిందో నేనూ నీకు అలాటి స్వస్త్యయనమే

చేస్తున్నాను." దశరథ జాతకం ప్రకారం రాముని వనవాస కాలానికి అతని తప్పి లేదు. అక్కడ వనవాసం హిమాలయంలో.

## వేస్సంతర జాతకం

ఇది 537 వ జాతకం. వేసంతరుని భార్య మద్దీ తన భర్తతో ఇలా అంటుంది :

"అవరుద్ధస్స హం భరియా రాజపుత్రస్స సిరీమతో,
తం చాహం నాతిమఞ్ఞామి రామం సీతా మనుబ్బతా."

(గాథ 541)

నేను శ్రీమంతుడైన, నిర్వాసితుడైన రాజపుత్రుని భార్యను. రాముణ్ని అనుసరించిన సీత ఏ విధంగా తన భర్తను ఆదరించిందో నేనూ అ విధంగానే ఆదరిస్తాను. దీనినిబట్టి అరణ్యవాసంతో సీతారాముల సంబంధం సతిపత్నీ సంబంధమే కాని సోదరీ సోదర సంబంధం కాదని ధ్వనిస్తుంది.

ఈ ప్రాసంగిక గాథలేకాక రామాయణ ఉపకథల పోలికలున్న జాతకాలు కూడా ఉన్నవి.

## సామ జాతకం

ఇది 540 వ జాతకకథ. ఇది రామాయణంలోని అంధమునిసుతుడు శ్రవణ కుమారుని దశరథుడు శబ్దవేధి బాణంతో చంపిన కథకు రూపాంతరం. ఈ జాతక కథ అమరావతీ సాంచీ స్తూపాలలో గండరించబడడాన్నిబట్టి దీని జన ప్రియత తెలుస్తుంది. సామజాతక కథ సారాంశమిది :

నిషాదకులంలో పుట్టిన దుకూలకుడు, సారిక హిమాలయంలో ఒక ఆశ్రమంలో ఋషి జీవితం గడుపుతూ వుంటారు. వారికి బోధిసత్త్వుడు అలౌకిక రీతిలో పుత్రుడౌతాడు. వాని పేరు సాముడు. సామునికి 16 సంవత్సరాల వయస్సు వచ్చేవేళకు ఒక పాము కాటుతో తలిదండ్రులు అంధులై పోతారు. అప్పటినుండి సాముడు తలిదండ్రులకు సేవచేస్తూ వుంటాడు.

ఒకనాడు సాముడు నీళ్ళకోసం ఏటికి పోతాడు. అక్కడ కాశీరాజు బలియకుడు వదలిన విషదిగ్ధమయిన బాణం తగిలి మరణిస్తాడు. రాజు వెదుక్కుంటూ వచ్చి, జరిగిన సంగతి సాముని తలిదండ్రులకు తెలుపుతాడు. సాముడు మరణ సమయంలో తన బాధకన్నా, తలిదండ్రుల దయనీయస్థితిని గురించి విలపిస్తాడు. తలిదండ్రుల కోరికపై వారిని సాముని కళేబరం వద్దకు రాజు చేర్చుతాడు. అప్పుడు సారిక "నా పుత్రుడు తలిదండ్రులకు నిజమైన భక్తుడయితే, విషం లుప్తమవుతుంది" అని శపథం - సచ్ఛ్రక్రియ చేస్తుంది.



దుకూలకుడూ అలాటి సచ్ఛ్రక్రియ చేస్తాడు. వనదేవతకూడా శపథం చేస్తుంది. సాముడు నిద్రనుంచి లేచి కూర్చునట్లు లేచి కూర్చుంటాడు. రాజుకు స్వాగతం చెప్పి, "నాకు మూర్ఛ వచ్చింది. తలిదండ్రుల సేవచేసేవారు ఉభయలోకాలలోను సుఖపడతారు" అని అంటాడు. పిదప బలియక మహారాజుకు రాజధర్మం ఉపదేశిస్తాడు.

రామాయణంలోని మునికుమారుని తలిదండ్రులు, మునికుమారుడు చాల ఉత్తేజితులవుతారు. చివరకు మునికుమారుడు పునరుజ్జీవితుడు కాడు. కాని ఈ రెండు కథలలోను పోలిక మాత్రమేకాక గాథలలోను, రామాయణ శ్లోకాలలోను శబ్దసామ్యం కూడ కనిపిస్తుంది.

అయం ఏకపదీ రాజా (గాథ 19)
ఇయమేకపదీ రాజన్ (రామా 2.63.64)
అదూసక పితాపుత్తా తయో పితుసు నాహతా (గాథ 39)
వృద్ధౌచ మాతాపితరౌ అహంచే కేషుణా హతః

(రామా 2.63.32)

వృద్ధపిత దుకూలకుని విలాపంలోని ఒక గాథ రామాయణంలోని ఒక శ్లోకంతో పూర్తిగా పోలుతుంది.

కో దాని భుంజఇస్ససి వనమూల ఫలానిచ,
సామో అయం కాలకతో అంధానం పరిచారక. (గాథ 85)
కందమూల ఫలం హృత్వా యో మాం ప్రియమివా తిథిమ్,
భోజయిష్యత్యకర్మణ్యం అప్రగ్రహమనాయకమ్.

(రామా 1.64.34)

ఈ రెండింటికీ మూలం ఒక్కటే ఏమో! రామాయణమే ఈ సామజాతకానికి మూలమని నా అభిప్రాయం.

వేస్సంతర జాతకంలో పెక్కుచోట్ల రామాయణంతో పోలికలు కనిపిస్తాయి.

వేస్సంతరుడు దానవీరుడు. అడిగినంత ఇవ్వడం అతని ప్రతిజ్ఞ. అతడొకమారు దేశక్షేమం గుర్తించక దివ్యహస్తిని దానమిస్తాడు. దీనికోసం అతనికి రాజు వనవాస శిక్ష విధిస్తాడు. అతడు తన సాధ్విఅయిన మద్ది, ఇద్దరు కుమారులు వెంటరాగా అడవులకు, నాలుగు గుర్రాలు కట్టిన రథంలో బయలుదేరుతాడు. దారిలో ఒక బ్రాహ్మణుడు రథం కోరగా ఇచ్చివేస్తాడు. అడవిలో వారు నలుగురు ఒక కుటీరంలో నివసిస్తారు. అప్పుడు శక్రుడు (సక్క) కురూప

బ్రాహ్మణ వేషంతోవచ్చి, వేస్సంతరుని ఇద్దరు కుమారులను, భార్యను దాన మిమ్మని కోరి, పొందుతాడు. తర్వాత ఆ బ్రాహ్మణుడు నిజస్వరూపం తెలిపి వేస్సంతరుని దానశీలాన్ని ప్రశంసిస్తాడు. కథ సుఖాంతమవుతుంది.

ఈ జాతక కథలో వేస్సంతరుని వన వాసం, వనవాసానికి ముందు దానమివ్వడం, కౌశల్యలాగ వేస్సంతరుని తల్లి రోదించడం, కుటీర వర్ణనం, మద్ది సీత వలె వనగమనానికి పట్టుదల చూపడం మొదలయిన పోలికలు సామాన్య దృష్టికే కనిపిస్తాయి. సీత అడవికి పిలుచుకొని పోకపోతే నీళ్ళల్లోనో, నిప్పులోనో పడి, విషం పుచ్చుకొని మరణిస్తానంటుంది. మద్దీ కూడ అలాగే అంటుంది.

అగ్గిం నిజ్జాలయిత్వాన ఏక జాల సమాహితమ్,
తత్థమే మరణం సేయ్యో యంచే జీవేత యంవినా.

(గాథ 73)

యది మాం దుఃఖితా మేవం వనం నేతుం నచేచ్ఛసి,
విషమగ్నిం జలం వాహం ఆస్థాస్యే మృత్యు కారణాత్.

(రామా 2-29-21)

దీనిని బట్టి వేస్సంతర జాతక రచయితకు రామాయణం బాగా తెలుసు నన డానికి సందేహం లేదు.

## సంబులా జాతకం

ఇది 519వ జాతకకథ. దీనిలో పతి భక్తురాలయిన సంబుల వృత్తాంతం వుంది. ఈమె భర్త రాజకుమార సోత్థిసేనుడు; కుష్ఠరోగి. ఈమె అతనితో పాటు వనంలో నివసిస్తూ, అతనికి సేవచేస్తూ జీవితం గడుపుతుంది. ఒకనాడు ఒక దానవుడు సంబులను చూచి భార్యగా చేసుకొనడానికి బలవంత పరుస్తాడు. కాని, సంబుల అంగీకరించదు. సక్కుడు (శక్రుడు) ఆమెను దానవుని బారి నుండి రక్షిస్తాడు. సోత్థిసేనుడు తన పత్ని సతీత్వాన్ని శంకిస్తాడు. ఆమె ఒక సచ్చకిరియం - సచ్చక్రియ - చేసి, శపథం చేసి - తన భర్త కుష్ఠరోగాన్ని పోగొడుతుంది - నేను నా భర్తను తప్ప పరపురుషుణ్ణి చూడనట్టయితే భర్త వ్యాధి శమించనీ - అనేది సచ్చక్రియ.

తర్వాత ఇద్దరూ రాజధానికి తిరిగి వస్తారు. కృతఘ్నుడైన సోత్థిసేనుడు అన్య స్త్రీలను మరిగి సంబులకు కష్టం కలిగిస్తాడు, కాని, చివరకు తండ్రి మాటవిని సంబులను క్షమాపణ కోరుతాడు. పిదప ఇద్దరి జీవితం సుఖ మయంగా నడుస్తుంది.



సంబుల సీతలాగే పతి సపర్య చేస్తుంది. ఆమె సచ్చక్రియ సీత అగ్ని పరీక్ష శపథం లాంటిది. దానవుడు రావణుడు మాటలలోను సమానులు. నీవు నా మహిషి కావడానికి ఇష్టపడకపోతే, నిన్ను నేను నా ప్రాతఃకాలాహారంలో తినేస్తాను అని దానవుడు రావణుడు సీతను బెదరించినట్టే బెదరిస్తాడు :

నోచే తువం మాహేసేయ్యం సంబులే కారయిస్ససి,
అలం త్వం పాతరాసాయ మఞ్ఞె భక్ఖా భవిస్ససి,

(గాథ – 10)

ద్వాభ్యా మూర్ధ్వంతు మాసాభ్యాం భర్తారం మా మనిచ్ఛతీం,
మమ త్వాం ప్రాతరాశార్థే సూదాశ్ఛేస్యంతి ఖండశః.

(రామా 5–22–9)

## మహా సుతసోమ జాతకం

ఇది 537 వ జాతకం. దీనిలో మహాసుతుడు (బోధి సత్త్వుడు) ఒక పోరిసాదుణ్ణి (పురుషాదుని) నిందించే గాథ వుంది. ఇది రామాయణం కిష్కింధా కాండలోని ఒక శ్లోకాన్ని పోలివుంది. రామాయణంలో ఈ శ్లోకం వాలివధ ఘట్టంలో వుంది. వాలి రామునితో "రామా నీవు నన్ను చంపడం అన్యాయం. నేను తినదగిన వాడినికాను. క్షత్రియులు ఐదు పంచనఖ జంతువు లనే తినవచ్చు" అంటాడు.

పంచ పంచనఖా భక్ష్యా బ్రహ్మ క్షత్రేణ రాఘవ

(రామా 4–17–39, మనుస్మృతి 5–17)

మహా సుతసోమ జాతకంలోని ఈ కింది గాథ రామాయణ శ్లోకానికి అనుకరణలాగ కనపిస్తుంది.

పంచ పంచనఖా భక్ఖా ఖత్తియేన పజానతా
అభక్ఖం రాజా భక్ఖేసి తస్మా అధమ్మికో తువ.

(గాథ –58)

## ఆదిచ్చు పట్టాణ జాతకం

ఆదిచ్చు పట్టాణ జాతకంలో (175) ఒక వానరుని ప్రస్తావన వుంది. కానీ దీని రూపాంతరం మహాభారత రామాయణాలలో లభించదు. ఈ గాథ రామ కథకు సంబంధించింది అవునో కాదో చెప్పలేము

వబ్బేసు కిర భూతేసు సంతి సీల సమాహితా,
పస్స సాఖామగం జమ్మం ఆదిచ్చం ఉపతిట్ఠతి.

మహా భాష్యంలో ఈ గాథకు సంస్కృత రూపాంతరం ఉపామంత్ర కరణే (1–3–25) సూత్ర చర్చలో కనిపిస్తుంది. ఉప అనే ఉపసర్గ చేరిన స్థాధాతువు ఉభయ పదములలోను వున్నదనడానికి ఉదాహరణంగా ఈ గాథ రూపాంతరంగా కనిపిస్తుంది.

బహూనా మప్యచిత్తానా మేకో భవతి చిత్తవాన్
పశ్య వానర సైన్యేస్మిన్ యదర్క ముపతిష్ఠతే.
మైవం మంస్థాః సచిత్తోయ మేషోపి హి యథా వయం,
ఏతదప్యస్య కాపేయం యదర్క ముపతిష్ఠతి.

జాతక కథలోని సామగ్రితో వాల్మీకి తన రామాయణ మహాకావ్యం రచించి వుండవచ్చునని శ్రీ దినేశ్ చంద్ర సేన్ మున్నగు విద్వాంసులు అనుమానిస్తున్నారు గాని, దానిలోని అత్యల్ప సామగ్రి ఆధారంగా జాతక కథలలో రామాయణానికి మొదళ్ళు వెదకడం వ్యర్థమని నా అభిప్రాయం.

త్రిపిటకాలు క్రీస్తు పూర్వం నాలుగవ శతాబ్దంలో సంగ్రథితాలు. వానిలో రామాయణ గాథకు సంబంధించిన సామగ్రి చాల తక్కువ కనిపిస్తున్నది. అంతేకాక, త్రిపిటికాలలోని 547 గాథలలో యక్ష, దానవ, నాగ, రక్కస, వానర – ఆది అసంఖ్యాక పశు పక్షులకు సంబంధించిన కథలు ఉన్నాయికాని, రావణుని, హనుమంతుని, తదితర కపుల ప్రస్తావన రాలేదు గనుక వాల్మీకి రామాయణం అప్పటికి ప్రచారం పొందినట్టు లేదని బహుశా వాల్మీకీయం రచితం కాలేదేమోనని కొందరి అభిప్రాయం.

కాని, రామాయణం బౌద్ధుల పిటక కాలానికే ప్రచారంలో వుందని, బౌద్ధులు రామాయణ భారతాలు విని వాటి ప్రభావానికి లోనవుతారని భయపడిన బౌద్ధాచార్యులు అలాటి ఆఖ్యానకాలను వినడం నిషేధించారని, అందువల్ల అగతికంగా తప్ప రామాయణం భారతాల ప్రసక్తి జాతక కథలలో రాలేదని, అది వచ్చినా వికృత రూపంలో వర్ణితమయిందని చెప్పడానికి ఆధారాలున్నాయి.

బుద్ధ ఘోషుడు – భారత యుద్ధ సీతాహరణాదులు నిరర్థక కథలని, వాటిని వినగూడదని దీర్ఘ నికాయం వ్యాఖ్యలో హెచ్చరించాడు : అక్ఖానంతి భారత రామాయణాది కథా. తం యస్మిం ఠానే కథయంతి తత్థ గంతుం న వట్టతి. (దీ. ని. అ. 1–84) "భారత యుద్ధ సీతాహరణాది నిరర్థకకథా." (దీ. ని. అ. 1–86).

బౌద్ధులలాగ జైనులు కూడ రామకథను తమ మతానుసారంగా మత



ప్రచారంకోసం వినియోగించుకున్నారు. రామకథ జైన సాహిత్యంలో అతివిస్తారంగా లభిస్తున్నది. బౌద్ధులు రాముణ్ని బుద్ధుని పూర్వావతారంగా భావించారు. జైనులు రామకథలోని పాత్రలకు తమ మతంలో అత్యంత ప్రాముఖ్యంగల స్థానమిచ్చారు. జైనుల ప్రకారం రామలక్ష్మణ రావణులు జైనధర్మానుయాయులే కాక త్రిషష్టి శలాకా పురుషులు కూడ. త్రిషష్టి శలాకా పురుషులంటే 63 మంది యుగపురుషులన్న మాట. వీరిలో 24 మంది తీర్థంకరులు (జైనధర్మోపదేశకులు), 12 మంది చక్రవర్తులు (భారతదేశపు ఆరుఖండాల సార్వభౌములు), తొమ్మండుగురు బలదేవులు, తొమ్మండుగురు వాసుదేవులు, తొమ్మండుగురు ప్రతి వాసుదేవులు వున్నారు. ఈ శలాకా పురుషుల జీవితాలు జైన పురాణాలయాయి, రామాయణ భారతాల లాగ.

## జైన రామకథలు

ప్రతికల్పంలోను ఈ త్రిషష్టి శలాకా పురుషులలో తొమ్మండుగురు బలదేవులు, తొమ్మండుగురు వాసుదేవులు, తొమ్మండుగురు ప్రతి వాసుదేవులూ అవతరిస్తుంటారు. రామలక్ష్మణ రావణులు క్రమంగా ఎనిమిదవ బలదేవ, వాసుదేవ, ప్రతి వాసుదేవులు. బలదేవుణ్ని బలభద్రుడని, వాసుదేవుణ్ని నారాయణుడని కూడ అంటారు. బలదేవ వాసుదేవ ప్రతివాసుదేవులు ఎప్పుడూ సమకాలికులుగానే వుంటారు. బలదేవ వాసుదేవులు ఏరాజుకో ఏకోదరులు కాని భ్రాతలుగా పుడుతారు. వాసుదేవుడు బలదేవుని తోడ్పాటుతో ప్రతివాసుదేవునితో యుద్ధంచేసి, అతనిని వధించి, దిగ్విజయంచేసి భారతదేశంలోని ఆరు ఖండాలలో మూడు ఖండాలపై అధికారం పొంది, అర్ధచక్రవర్తి అవుతాడు. ప్రతి వాసుదేవుణ్ని వధించడం కారణంగా మరణానంతరం నరకానికి వెళ్ళవలసి వుంటుంది. తొమ్మండుగురు వాసుదేవులలో ఎనిమిదవ వారయిన లక్ష్మణుడు, కృష్ణుడు ప్రత్యేకంగా చెప్పవలసినవారు. బలదేవుడు తన భ్రాత మరణానికి శోకాకులుడై జైనదీక్ష గ్రహించి మోక్షం పొందుతాడు (రామ బలరాములలాగు). ప్రతివాసుదేవులు సదా సర్వకాలం వాసుదేవులతో విరోధం పెట్టుకొని, వాసుదేవుని చక్రానికి బలి అవుతారు (రావణ జరాసంధుల లాగ).

జైన రామకథలలో మరొక విశేషం వానరులు, రాక్షసులు విద్యాధర వంశ్యులు. జైన ధర్మ సంస్థాపకుడైన ఋషభుడు తన నూరుగురు పుత్రులలో భరతునికి రాజ్యం అప్పగించి, తపోదీక్ష స్వీకరిస్తాడు. తరువాత నమి, వినమి అనే పుత్రులు వచ్చి తండ్రిని తమకు రాజ్యమిమ్మంటారు. వీద్దరూ సకల విద్యలూ సంపాదించి వైతాఢ్య (వింధ్య) పర్వత ప్రాంతంలో రాజ్యం స్థాపించు

కొన్నారు. వీరు విద్యాధరుల జాతికి మూలపురుషులు (పవుమ 3వ పర్వం). జైనుల ప్రకారం విద్యాధరులు కామరూప ఆకాశ గమనాది అనేక విద్యలు సిద్ధించుకొన్న మానవులే. ఈ విద్యలు ధరించడంవల్ల వీరికి విద్యాధరులనే పేరు వచ్చింది. తమ భవనాలమీద వానర చిహ్నాలు వుంచుకోవడంవల్ల వారికి వానరులని పేరు వచ్చింది.

రక్ఖంతి రక్ఖసా ఖలు
దీవా పుణ్ణేణ రక్ఖియా జేణ,
తేణం చియ ఖయరాణం
రక్ఖసనామం కయంలోఏ. (ప 5-257)

రాక్షసులు పుణ్యంతో ద్వీపాలను రక్షిస్తారు గనుక ఖేచరులైన ఆ విద్యాధర జాతికి రాక్షసులనే పేరు వచ్చింది.

వాణరచింధేణ ఇమే
ఛత్తాయనివేసియా కఈ జేణ,
విజ్జాధరాజణేణం
వుచ్చంతిహు వాణరా తేణం. (ప-6-89)

జైన రామాయణములో మూడు పరంపరలున్నాయి. 1) విమలసూరి పరంపర, 2) సంఘదాసుని పరంపర, 3) గుణభద్రుని పరంపర. వీటిలో విమలసూరి పరంపరే ఎక్కువ వ్యాప్తిలోకి వచ్చింది. లోకప్రియమైన రామకథను జైనధర్మపుమూసలోపోయడానికి తొలిసారిగా ప్రయత్నించినవాడు విమలసూరి. ఇతనిని ప్రాకృత సంస్కృతకవులు అనుసరించారు. మన వివక్ష ఇప్పుడు ప్రాకృత రామాయణాలే గనుక వాటిని గురించి మాత్రమే చెబుతాను. (1) శీలాచార్యుడు రచించిన చాఉపన్నమహాపురిసచరియలో అంతర్భాగమయినది రామలక్ష్మణ చరియం. దీనికాలం క్రీస్తుశకం 868. (2) భద్రేశ్వరుడు రచించిన కహావళిలోని రామాయణం. దీనికాలం 11వ శతాబ్ది. (3) భువనతుంగసూరి రచించిన సీయాచరియ, రామలక్ష్మణచరియ. (4) హరిభద్రుడు రచించిన పఉమచరిత. 8వ శతాబ్ది (6వ).

సంఘదాసు రచించిన వానుదేవ హిండి. ఇది తొమ్మండుగురు వాసుదేవుల చరిత్ర. దీనిలో రామాయణం ప్రసక్తమవుతుంది. ఇతడు విమల సూరిని అనుసరించినా, హెచ్చుగా వాల్మీకినే అనుసరించాడనవచ్చు.

మూడవ సంప్రదాయ ప్రవర్తకుడయిన గుణభద్రుడు రచించిన ఉత్తర



పురాణంలో రామకథ ఉన్నది. దీనిలో విశేషం సీత రావణ మండోదరుల కుమార్తె కావడం. వాసుదేవ హిండిలోను ఈ సూచన వుంది.

రవిషేణుడు పఉమచరితాన్ని పద్మ పురాణమనే పేర సంస్కృతీకరించాడు.

ప్రాకృత రామకథా కావ్యాలలో విమలసూరి పఉమచరియం మొట్ట మొదటిది గనుక దీనిని గురించి కొంత తెలుసుకొందాము. ఇతనికాలం క్రీస్తుశకం 72. కాని భాషనుబట్టి 3వ శతాబ్దమని పండితులు భావిస్తున్నారు. విమల సూరి దీనిని జైనమత ప్రచారం కోసమే రచించాడు. హరివంశమనే మరొక మహాకావ్యాన్ని కూడ ఈయన రచించాడు. కాని అది యిప్పుడు లభించడం లేదు. కొందరు అసంబద్ధమయిన వ్రాతలతో రావణాదులను గురించి లేని పోని కట్టుకథలు ప్రచారం చేశారు గనుక, వాటిని తొలగించి విమల ధర్మం ప్రచారం చేయడానికి తాను ఈ చరిత్ర వ్రాస్తున్నానని విమల సూరి చెప్పుకున్నాడు.

అవియంవి సవ్వమేయం
ఉవవత్తి విరుద్ధ పచ్చయ గుణేహిం,
నయ సద్ధహంతి పురిసా
హవంతి తేజే పండియా లోఏ. 2-117.

రామునికే మరొక పేరు పద్ముడు పఉముడు అని. రాముడు వికసించిన పద్మం వంటి ముఖం కలవాడు, పద్మసదృశ కాంతివాడు కావడంవల్ల అతనికి తండ్రి దశరథుడు పఉమ-పద్మ అని పేరు పెట్టాడట. కనుక దీనిని పద్మచరితం అన్నారు.

అవరా ఇయా కయా ఈ
గురుఖారా సోహణే తిథి ముహూర్తే,
పుత్తం చేవ పసూయా
విర అనియ వరపఉమ సరిసముహం.
జమ్మూసవో మహంతో
తస్సకట దసరహేణ తుట్ఠేణం,
నామంచ విరఇయంతే
పఉమో స పఉముప్పల దళచ్చో. 25-7.8.

పఉమచరియం 158 పర్వాల గ్రంథం. మొదట్లో పర్వాలను ఉద్దేశాలని సముద్దేశాలని కూడా కవి అన్నాడు. ఇది పురాణమయి నప్పటికీ మహాకావ్య

సర్వం కలవనే చెప్పాలి. నగరార్ణవ శైలార్క కుమారోదయాది లక్షణాలు చాల కలవనే చెప్పాలి. నగరార్ణవ శైలార్క- కుమారోదయాది వర్ణనలు చాల ఉన్నవి. దాదాపు నవరసాలను పోషించాడు. కాని కవితాదృష్టి, మత ప్రచారదృష్టిలో మరుగయిపోయిందనే చెప్పాలి. రచన సాధారణంగా గాథ, ఆర్యలోనే సాగుతుంది. పర్వాంతాలకు వివిధ వృత్తాలు వాడాడు. భాష సరళమైంది. అర్థాంతర న్యాసాలు, రూపకాది అలంకారాలు ప్రయోగించాడు. పూర్వగ్రంథాల్లో ఉన్నదీ, ఆచార్యపరంపరగా వచ్చినదీ అయిన పద్మ చరితాన్ని అనుపూర్విగా చెబుతాను సంగ్రహంగా — అని విమల సూరి అభిదేయమనే అవతారికలో చెప్పాడు.

నామావలియనిబద్ధం
ఆయరియ పరంపరాగయం సవ్వం.
వోచ్ఛామి పఉమచరియం
అహానుపువ్వం సమాసేణ. 1_

సర్వజ్ఞభాసితమైన విషయాన్ని కవులు తమ తమ శాస్త్రాభ్యాసాది గుణాలతో విపులంగా చెబుతారు. వజ్రసూచితో రంధ్రం చేసిన రత్నంలో దారం దూరదా?— అని ప్రశ్నిస్తాడు విమలసూరి.

సవ్వన్ను భాసియత్థం
భణంతి కఇణో జహాగమ గుణేణం.
కిం వజ్జసూఇ భిన్నే
సరియఇ తంతు మహారయణే! 2_13

ఈ ఆర్య కాళిదాసు చెప్పిన

అథవా కృతవాగ్ద్వారే వంశేస్మిన్ పూర్వ సూరిభిః,
మణౌ వజ్ర సముత్కీర్ణే సూత్రస్యే వాస్తి మే గతిః.

అనే మాటను జ్ఞప్తికి తెస్తుంది. జైనులు, బౌద్ధులు వాల్మీకీయ మయిన రామ కథను, ఇష్టం వచ్చినట్టు తమ తమ మతాలకు అనుగుణంగా మలచుకోవడం చూచి భిన్నులయిన భాస కాళిదాస ప్రవరసేనులు రఘువంశ సేతుబంధకావ్యాలు రచించారని నేననుకుంటాను. పఉమచరియం కథను సంగ్రహంగా చెబుతాను. ఆ కథ మనకు పరిచితమైన వాల్మీకి రామాయణానికి ఎంత దూరంగా ఉందో స్పష్టమవుతుంది. విమలసూరి రామాయణాన్ని ఆరుభాగాలుగా మనం వింగడించుకోవచ్చు: (1) రావణచరితం, (2) సీతారాముల వన వివాహాదులు



(3) వన భ్రమణం. (4) సీతాపహరణం. సీతాన్వేషణం, (5) యుద్ధం. (6) ఉత్తర చరిత్ర.

మగధ రాజయిన సేణియుడు (శ్రేణికుడు) మహావీరుని ప్రధాన శిష్యుడైన గోయణ్ని (గౌతముణ్ని) రామకథ యథార్థ స్వరూపం తెలుపవలసిందని కోరుతాడు. ఆ కోరికపై గౌతముడు పఉమచరియం వినిపిస్తాడు. ప్రారంభంలో విద్యాధరలోక, రాక్షస వంశ, వానర వంశాలను వివరిస్తాడు. ఈ రావణుని చరిత్రకు, వాల్మీకి రామాయణం ఉత్తరకాండ చరిత్రకు దగ్గర సంబంధం వుంది.

రాక్షస రాజయిన రత్నశ్రవునికి, రాణి కేకసికి పుట్టిన సంతానం దశముఖుడు (రావణుడు), భానుకర్ణుడు (కుంభకర్ణుడు), చంద్రనఖ (శూర్పణఖ), విభీషణుడు. దశముఖుడంటే పదిముఖాలు కలవాడని కాదు. రావణుడు పుట్టినప్పుడు పురిటింట్లో తల్లి రాక్షసపతి పూర్వం మేఘవాహనునికి ఇచ్చిన గొప్ప నవరత్న హారాన్ని తన శిశువుకు వేసింది. అప్పుడు రత్నశ్రవుడు శిశువును చూడడానికి వచ్చాడు. రత్నహారం వ్రేళ్ళతో గట్టిగా పట్టుకొని వెలిగిపోతున్న శిశువును చూచాడు. ఆ రత్నాలలో శిశువు ముఖాలు ప్రతిబింబిచాయి, స్పష్టంగా. అందువల్ల అతనికి దశముఖాలు ఉన్నట్టనిపించగా దశముఖుడు అని పేరు పెట్టారు.

రయణ కిరణేసు ఏత్తో
ముహాఇ నవ నియయవయణ సరిసాఇం
హారే దిట్టాఇ ఘదం
తేణ కయం దసముహో ణామ. 7_96

రావణుడు తన మాతృష్వసేయుడయిన వైశ్రవణుని ఐశ్వర్యం చూచి, తన సోదరులతోపాటు తపస్సుచేసి వివిధ విద్యలు సంపాదిస్తాడు తర్వాత మండోదరిని, మరి 6000 మంది విద్యాధర కన్యలను పాణిగ్రహణం చేసుకొంటాడు. పిదప రావణుడు వైశ్రవణుని, యముని జయించి పుష్పక విమానం లాక్కుని లంకానగరంలో ప్రవేశిస్తాడు.

రావణునికి వాలికి కలిగిన స్పర్ధలకు కారణం రావణుడు ఒక దూతను వాలివద్దకు పంపి, అతడు తనవద్దకు వచ్చి ప్రణమిల్లి తన చెల్లెలు శ్రీప్రభను ఇచ్చి వివాహం చేయవలసిందని ఉత్తర్వులు చేయడం. వాలి జినవరేంద్రునికి తప్ప మరొకరికి తలవంచనని చెబుతాడు. తన సోదరుడైన సుగ్రీవునికి రాజ్యం

అప్పగించి, జైన దీక్ష స్వీకరిస్తాడు. సుగ్రీవుడు రావణునికి లొంగిపోతాడు. శ్రీప్రభతో రావణునికి వివాహం జరుగుతుంది.

కాని, వాలి రావణుని గర్వాన్ని అణచడం ఇక్కడ మరొక విధంగా చిత్రించబడింది. వాల్మీకి రామాయణంలో రావణుడు కైలాస పర్వతాన్ని ఎత్తడానికి ప్రయత్నించడం, శివుడు పాదాంగుష్ఠంతో నొక్కగా రావణుని చేతులు ఇరుక్కోడం ఉండగా, ఇక్కడ వాలి తపస్సు చేస్తున్నప్పుడు రావణుడు పర్వతాన్ని గర్వంతో ఎత్తడం, వాలి బొటనవ్రేలితో నొక్కడం వుంది.

రావణుడు తర్వాత సహస్రకిరణ, నలకూబర వరుణేంద్రాదులను గెలుస్తాడు. వీరందరూ దేవతలు కారు; రాజులు. ఖరదూషణుడు ఒక విద్యాధర రాజకుమారుడు. రావణుని చెల్లెలు చంద్రనఖను పెళ్ళాడుతాడు.

దీనిలో రావణుని పాత్ర చిత్రణం, వాల్మీకి రామాయణానికి పూర్తిగా భిన్నం. రావణుడు ధర్మభీరువయిన జైనుడు. జినమందిరాలను పునరుద్ధరిస్తాడు. పశువిశసనం జరిగే యజ్ఞాలకు అడ్డుతలుగులుతాడు. నలకూబరుని భార్య ఉపరంగ వలచివస్తే నిరాకరిస్తాడు. జైనాచార్యుడు అనంతవీర్యుని ధర్మోపదేశంతో తనను కోరని పరనారీ విముఖవ్రతం స్వీకరిస్తాడు.

నచ రక్కోత్తి భణ్ణఇ
దసాణణో ణేయ అమిసాహారో,
అలియం వి సవ్వమేమం
భణంతి జం కుకఇణో మూఢా. (13_15)

దశాననుడు రాక్షసుడు కాడు. మాంసభక్షి కాడు. మూఢులైన కుకవులు వట్టి అబద్ధాలు చెప్పారు.

దీనిలో హనుమచ్చరితం విస్తారంగా వర్ణితం. ఇతడు పవంజయ, అంజనాదేవుల పుత్రుడు, రావణుడు వరుణునితోపాటు పోరాడినప్పుడు సహాయం చేస్తాడు. రావణుని చెల్లెలు చంద్రప్రభ కుమార్తె అనంగకుసుమను వివాహ మాడుతాడు. ఇదికాక ఇతనికి మరొక వందమంది భార్యలుంటారు.

తర్వాత రామాయణం అధికారిక కథ 21 వ పర్వం నుంచి ప్రారంభమవుతుంది జనకుని, దశరథుని వంశావళితో. దశరథుడు అపరాజితను, సుమిత్రను పెళ్ళాడుతాడు. ఒకనాడు నారదుడు దశరథునివద్దకు వచ్చి "నీ కుమారుడు జనకుని కుమార్తె కారణంగా సముద్రమార్గాన లంకానగరానికి వచ్చి



రావణునితో యుద్ధం చేస్తాడని జ్యోతిష్కులు తెలిపారు. అందువల్ల విభీషణుడు నిన్ను, జనకమహారాజును చంపదలచుకొన్నాడు" అని హెచ్చరిస్తాడు. జనకునికి కూడ నారదుడు ఈ హెచ్చరికే చేస్తాడు. ఆ హెచ్చరికతో వారిద్దరూ తమ రాజ్యం వదలి భూభ్రమణానికి పూనుకుంటారు. వారి మంత్రులు తమ రాజుల ప్రతిరూపాలు చేయించి, నగళ్ళలో పెడుతారు. విభీషణుడు నారదుడు చెప్పినట్లే వచ్చి, దశరథుని ప్రతిరూపం శిరస్సును ఖండిస్తారు.

భూభ్రమణం చేస్తున్న జనక దశరథులు కైకేయి స్వయంవరానికి వెళ్ళుతారు. కైకేయి దశరథుని మెడలో స్వయంవరమాల వేస్తుంది. దీనివల్ల దశరథుడు తక్కిన రాజులతో యుద్ధం చేయవలసి వస్తుంది. ఆ యుద్ధంలో కైకేయి చాల నైపుణ్యంతో దశరథుని రథాన్ని తోలుతుంది. వివాహానంతరం జనక దశరథులు తమ తమ రాజధానులకు తిరిగి వస్తారు. దశరథుడు కైకేయికి ఒక వరమిస్తాడు. "అవసరం వచ్చినప్పుడు అడుగుతాను, ఇప్పుడు వద్దు" అని కైకేయి వరం స్వీకరించదు.

దీనిలో రాముడు _ పద్మడు _ అపరాజితాదేవి కుమారుడు. సుమిత్ర కుమారుడు లక్ష్మణుడు. కైకేయి కుమారులు భరత శత్రుఘ్నులు.

జనకునికి విదేహ అనే రాణికి సీత, భామండలుడనే ఇద్దరు పుడుతారు. రాముడు జనకునికి మ్లేచ్ఛులతో జరిగిన యుద్ధంలో సహాయం చేస్తాడు. దానివల్ల జనకుడు సీతను రామునికిచ్చి వివాహం చేయడానికి నిశ్చితార్థం జరుగుతుంది. తర్వాత సీతా స్వయంవరంలో రాముడు విల్లు ఎక్కుపెట్టి సీతను పెళ్ళాడుతాడు. ఈ ధనుస్సు శివధనుస్సు కాదు. వజ్రావర్తమనే ధనుస్సు. విద్యాధర రాజు చంద్రగతి ఇచ్చినది.

కొంత కాలానికి దశరథునికి వైరాగ్యం కలిగింది. ప్రవ్రజ్య స్వీకరిస్తాడు. అప్పుడు కైకేయి పూర్వవరం జ్ఞాపకపరచి, భరతునికి పట్టాభిషేకం చేయమంటుంది. ఇది విని రామలక్ష్మణులు సీతతోపాటు దక్షిణాపథంవైపు బయలుదేరుతారు. కైకేయి పశ్చాత్తప్తురాలవుతుంది. ఆమె అనురోధంపై భరతుడు అడవికి వెళ్ళి అయోధ్యకు తిరిగి రమ్మని రాముణ్ని బ్రతిమాలుతాడు; రాముడు నిరాకరించడంవల్ల గత్యంతరంలేక తిరిగి వచ్చి రాజ్యభారం వహిస్తాడు, రాముడు తిరిగి వచ్చిన పిదప జైనదీక్ష వహిస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు.

రామలక్ష్మణుల వనవాసం విచిత్రంగానే వుంటుంది. వారు మొదట చిత్రకూట పర్వతానికి వెళ్ళుతారు. వివిధ రాజ్యాలలో ప్రవేశించినమీదట లక్ష్మణుడు వజ్రకర్ణ విరోధి అయిన సింహోదరుని, మ్లేచ్ఛరాజును, భరతుని శత్రు

వయిన అతివీర్యుణ్ని జయిస్తాడు. పలువురు రాజులు రామలక్ష్మణులకు తమ కన్యలను సమర్పిస్తారు. ఈవిధంగా రామునికి 6000 మంది, లక్ష్మణునికి 16000 మంది భార్యలు. (రావణునికి 8000 మంది.) తర్వాత వారు దండకారణ్యం ప్రవేశిస్తారు.

రావణుడు సీతను హరించడానికి విమలసూరి చెప్పిన కారణాలు వేరు. చంద్రనఖ కుమారుడైన శంబూకుడు సూర్యహాసమనే గొప్ప కత్తిని పొందడానికి 12 సంవత్సరాలు సాధన చేస్తాడు. సాధన సఫలమై సూర్యహాసం ప్రత్యక్షమయింది. ఆ సమయంలో లక్ష్మణుడు ఆ ప్రాంతానికి వెళ్ళడం తటస్థిస్తుంది. ఆ ఖడ్గాన్ని అందుకొని పక్కన వున్న వెదురు గుబురును నరుకుతాడు. దానితోపాటు, అక్కడ తపస్సు చేస్తున్న శంబూకుని తలకూడ తెగిపోతుంది. కుమారుడు మరణించినందుకు చంద్రనఖ దుఃఖిస్తూ అరణ్యమంతా తిరుగుతూ, రామలక్ష్మణుల వద్దకు వచ్చి, తనను పెళ్ళాడమంటుంది. వారు నిరాకరించడంతో తనభర్త ఖరదూషణుని వద్దకు వెళ్ళి పుత్రమరణవార్తను తెలిపి, రావణునికి కూడ ఈ సంగతి సూచిస్తుంది. ఇంతలో ఖరదూషణుడు సైన్యంతో వస్తాడు. లక్ష్మణుడు ఒంటిగా ఆ సైన్యాన్ని ఆపుతాడు. ఇంతలో రావణుడు అక్కడికిచేరి, సీతను చూచి మోహం చెందుతాడు. లక్ష్మణుడు ఎక్కడికయినా వెళ్ళితే రాముణ్ని పిలవడానికి సింహనాదం చేయడం సంకేతంగా పెట్టుకొన్నట్టు అవలోకనీ విద్యతో రావణుడు తెలుసుకొని సింహనాదం చేస్తాడు. సింహనాదం విని రాముడు లక్ష్మణునికి ఏదో ఆపద వచ్చిందని భావించి వెళ్ళుతాడు. జటాయువు ఆమెకు రక్షగా వుంటాడు. రాముడు వెళ్ళిపోగానే రావణుడు ఆకాశం నుంచి కిందికి దిగి మదించిన ఏనుగు కమలినిని ఎత్తుకున్నట్టు అనాయాసంగా ఆమెను ఎత్తుకొని పుష్పక విమానంలో కూర్చోబెట్టుకొని వెళ్ళుతాడు. అడ్డుతగిలిన జటాయువును ముక్కలు ముక్కలుగా నరుకుతాడు. సీత విలపిస్తుంది. "అప్రసన్నురాలయిన పరస్త్రీని పొందనని పూర్వం అభిగ్రహం (వ్రతం) స్వీకరించాను. సంసార సాగరాన్ని తరింపజేసే ఆ వ్రతాన్ని పాలిస్తాను. కొంతకాలం తర్వాత ఈమె నన్ను ఒప్పుకోవచ్చు" అని రావణుడు అనుకుంటాడు.

ఎత్థంతరమ్మి సహసా
అవయరి ఊణం నహాఊ దహవయణో,
హక్ఖుణవణ జణయతణయాం
భుయాసుణవి విశివ్వ మత్తగట (44-39)



.................................

హోఠి వసన్నహియయా
ఇమాని మహ దీహకాలేణం. (44-46)

సీతాపహరణానంతరం రామసుగ్రీవుల వర్ణనం వుంది. సుగ్రీవునికి కలిగిన ఆపద వాల్మీకి రామాయణంలోని దానికన్నా భిన్నం. సాహసగతి అనే విద్యాధరుడు సుగ్రీవునిరూపం ధరించి సుగ్రీవుని పత్నిని, రాజ్యాన్ని హరిస్తాడు. రాముడు సాహసగతిని వధించి, సుగ్రీవునికి భార్యను, రాజ్యాన్ని ఇప్పిస్తాడు. సుగ్రీవుడు రాముని వినోదార్థం తన 13 కన్యలను సమర్పిస్తాడు. కాని, సీతావియోగ దుఃఖితుడయిన రామునికి వారి సంగతి సుఖం కలుగలేదు.

పిదప సుగ్రీవుని ఆజ్ఞతో విద్యాధరులు సీతాన్వేషణకు బయలుదేరారు. రత్నజటినుంచి రావణుడు సీతను అపహరించునట్టు సుగ్రీవునికి తెలిసింది. అప్పుడు రావణునికి భయపడి యుద్ధం చేయడానికి నిరాకరిస్తారు. కోటిశిలను ఎత్తేవాడు రావణుని చంపగలడని పూర్వం అనంతవీర్యుడనే విద్యాధరుడు చెప్పినదానిని స్మరించి, సుగ్రీవుడు విమానంలో కోటిశిలవద్దకు వెళ్లతాడు. అక్కడ లక్ష్మణుడు కోటిశిలను అవలీలగా ఎత్తుతాడు. అయినా విద్యాధరులు భయపడి, మొదట హనుమంతుని విభీషణునివద్దకు రాయబారంపంపి, రావణునికి నచ్చజెప్పవలసిందని సుగ్రీవుని కోరుతారు. హనుమంతుడు ఆ విధంగానే, తన మాతామహుడైన మహేంద్రుని జయిస్తాడు. దీనికి కారణం మహేంద్రుడు తన తల్లి అయిన అంజనను ఏదో అపవాదంతో ఇంటినుంచి వెళ్ళగొడుతాడు. దాని కసి తీర్చుకుంటాడు హనుమంతుడు.

లంక చేరిన తర్వాత హనుమంతుడు విభీషణుడు నిర్మించిన ప్రాకారం దాటి మొదట వజ్రముఖుని వధించి, తర్వాత అతని కుమార్తె లంకా సుందరిని ఓడించి రాత్రి ఆమెతో క్రీడిస్తాడు. పిదప లంకలో ప్రవేశించి, విభీషణుని కలుసుకొని, సీతను దర్శిస్తాడు. తర్వాత లంకలోని ఉద్యానాలను, ప్రాసాదాలను ధ్వంసం చేస్తాడు. ఇంద్రజిత్తు అతనిని బంధించి రావణుని ఎదుట నిలబెడుతాడు. హనుమ రావణుని బెదిరించి, తన బంధనాలు త్రెంచుకొని రావణుని అంతఃపురాన్ని ధ్వంసం చేస్తాడు. సీతా సందేశంతో రాముని వద్దకు బయలుదేరుతాడు. రాముని అంగుళీయం సీతకిచ్చి, సీత చూడామణిని గ్రహిస్తాడు; రామునికి అందజేస్తాడు తర్వాత. "కర్బరవాతీరంతో మధ్యాహ్న సమయాన మేమిద్దరం సాధువులకు దానమిచ్చాము. అహోదానం! – అని దేవతలు ఘోషించారు. సకాంచన రత్నవృష్టి కురిసింది. అప్పుడే తేజస్సుతో ప్రజ్వలిస్తున్న

ఈ చూడామణి లభించింది. ఓ కపిధ్వజీ, ఈ అభిజ్ఞానాన్ని నా ప్రియునికి చేర్చు'' అని సీత అందజేస్తుంది.

తే ఏణ పజ్జలంతీ
త జయా చూడామణీ ఇమా లద్ధా,
ఏయం నేహి కఇద్దయ
సాహిన్నాణం మహ పియస్స. (53–72)

యుద్ధకాండ కథకూడా వాల్మీకీయం కన్నా భిన్నంగా వుంటుంది. దానిలోని ప్రధాన భేదాలను క్రోడీకరిస్తాను:

దీనిలో సేతుబంధం ప్రసక్తిలేదు. సముద్రుడనే రాజు వానరసేనను అడ్డగిస్తాడు. నలునితో పరాజయం పొంది, లక్ష్మణునికి తన నలుగురు కుమార్తెలను సమర్పిస్తాడు.

విభీషణుడు సీతను అప్పగించివేయమని రావణునికి సలహా ఇస్తాడు. రావణుడు కోపగించి, అతనిని నగరం నుంచి వెళ్ళగొట్టండని ఆజ్ఞాపిస్తాడు. విభీషణుడు తన సేనతో రాముడు సపరివారంగా విడిసిన హంస ద్వీపానికి వెళ్ళి రాముని శరణు వేడుతాడు. అప్పుడు సీతాదేవి సోదరుడు భామండలుడు కూడ రామపక్షంలో యుద్ధం చేయడానికి వస్తాడు.

ఇంద్రజిత్తు నాగపాశాలతో రామలక్ష్మణులను కట్టివేయడానికి మారు సుగ్రీవ భామండులను కట్టివేస్తాడు. వారు గరుడకేతువయిన లక్ష్మణుని ద్వారా నాగపాశ ముక్తులవుతారు.

రావణలక్ష్మణులు తలపడుతారు. రావణుని శక్త్యాయుధంతో లక్ష్మణుడు మూర్ఛితుడవుతాడు. ద్రోణమేఘముని కుమార్తె విశల్య లక్ష్మణునికి చికిత్స చేసింది. లక్ష్మణుడు మూర్ఛ తేరుతాడు. తర్వాత లక్ష్మణుడు విశల్యను పెండ్లాడుతాడు. వారి పూర్వజన్మ గాథ కూడ వర్ణితమయింది. పూర్వజన్మలో లక్ష్మణుడు పునర్వసువు. విశల్య అనంగశర.

రావణుడు సామంతుదనే దూతను పంపి రామునితో సంధి చేసుకొనడానికి ప్రస్తావించాడు. రాజ్యంలో ఒక భాగం, 3000 కన్యలను ఇచ్చేషరతుపై సంధి కోరుతాడు. కాని, సీతను వదులకోవాలి, బందీలుగా పట్టుకున్న కుంభకర్ణ, మేఘనాద, ఇంద్రజిత్తులను వదలిపెట్టాలి.

సంధి కుదరలేదు. రావణుడు బహురూప అనే విద్య సిద్ధికోసం శాంతినాథుని మందిరంలో సాధన చేస్తాడు. ఈ సంగతి తెలిసి వానరులు సాధనకు



భంగం చేయడానికి ప్రయత్నించి నిష్ఫలు అవుతారు. రావణుడు సిద్ధి పొందుతాడు.

బహురూప విద్య సిద్ధించిన పిదప రావణుడు మరల సీతవద్దకు వెళ్ళి "ఇప్పుడు రాముని సంహరించి నిన్ను పెళ్ళి చేసుకుంటాడు." అని బెదిరిస్తాడు. "నా జీవితం రాముని జీవితంపై ఆధారపడి వుంది" అంటూ సీత మూర్ఛతో భూమిపై పడిపోతుంది. రాముని ఎడల సీతకు గల అచంచల ప్రేమను చూచి రావణుడు పశ్చాత్తప్తుడవుతాడు. కాని, యుద్ధంలో రామలక్ష్మణులను జయించి, సీతను వారికి అప్పగించాలని నిశ్చయించుకొంటాడు.

మరల రావణ లక్ష్మణ యుద్ధం జరుగుతుంది. నారాయణుడైన లక్ష్మణుడు ప్రతినారాయణుడైన రావణుని వధిస్తాడు.

రావణుని వధానంతరం బందీలయిన కుంభకర్ణ, ఇంద్రజిత్తు, మేఘవాహనులు విడుదలయ్యారు. వారంతా విరక్తులై తపస్సు చేయడానికి వెళ్ళిపోతారు. మండోదరి, చంద్రనఖ మొదలైన 7000 మంది యువతులు కూడ అంతఃపురం వదలి సాధకురాండ్రవుతారు.

రాముడు లంకలో ప్రవేశించిన వెంటనే సీతను చూడడానికి వెళ్ళుతాడు. వారిద్దరి సమాగమ సమయంలో దేవతలు పుష్పవృష్టి కురిపించి, సీతాదేవి నిర్మల చరిత్రకు సాక్ష్యమిస్తారు. రామునికి సీత చరిత్ర విషయంలో ఎంతమాత్రమూ సందేహం కలుగదు; సీత అగ్నిప్రవేశం గురించిన ఊసయినా దీనిలో లేదు.

రామలక్ష్మణులు రావణుని నగరులో కొంతకాలం వుంటారు. తమతో నిశ్చితార్థమయిన కన్యలను పిలిపిస్తారు. లంకలోనే వారందరితోనూ వివాహం జరుగుతుంది. లంకలో రామలక్ష్మణులు ఆరేళ్ళుంటారు.

నారదుడు లంకకు వచ్చి తల్లి అపరాజిత పుత్రవియోగంతో దుఃఖిస్తున్నదని తెలుపగా రామలక్ష్మణులు సాకేతానికి తిరిగి వెళ్ళడానికి నిశ్చయిస్తారు. వారు తిరిగి రాగానే భరతునికి వైరాగ్యం కలిగింది. దానితో జినదీక్ష స్వీకరించి నిర్వాణం పొందుతాడు.

సీతా త్యాగ కథ వాల్మీకి రామాయణానికి చాల దగ్గరగావుంది. సీత కుమారుల పేరు లవణుడు లేక అనంగుడు, అంకుశుడు లేక మదనాంకుశుడు. నారదుడు రెచ్చగొట్టడం వల్ల వీరిద్దరూ అయోధ్యపై దండెత్తి లక్ష్మణునితో యుద్ధం చేస్తారు. సీతా పరిత్యాగం కథ ఇది. — గర్భవతి అయిన సీతకు రాముడు విభిన్న జైనచైత్యాలయాలను చూపుతుండగా పాపమోహిత్యమతి,

పరదోషగ్గహణరఊ, గుహవవకో శ్రిసతసిలో ప్రజలు — నాగరికులు సీతపై నిందలు వేస్తున్నారని జనపదాల పెద్దలు చెబుతారు. ఈ మాటలు విని రాముడు లక్ష్మణునితో సీతాత్యాగం విషయం చెప్పగా లక్ష్మణుడు ఒప్పుకోడు. అప్పుడు రాముడు సేనాపతి కృతాంత వదనుని పిలిచి సీతను గంగకు అవల నిమానుష అరణ్యంలో వదలిపెట్టమంటాడు. కాకతాళీయంగా పుండరీకపుర రాజు వజ్ర జంఘుడనే రాజు ఆ వనంలో సీతావిలాపం విని తన నగరుకు పిలుతుకొని వస్తాడు. అక్కడ ఆమె ఇద్దరు పుత్రులను కంటుంది. లవణాంకుశులు పగ తీర్చుకొనడానికి రామలక్ష్మణులతో యుద్ధం చేస్తారు. ఈ యుద్ధానంతరం అందరి అనురోధంతో రాముడు సీతను అయోధ్యకు పిలిపిస్తాడు. అగ్నిపరీక్షలో ఆమె తన సతీత్వం నిరూపించుకుంటుంది. రాముడు ఆమెను అయోధ్యలోనే వుండ మని బ్రతిమాలుతాడు. కాని, సీత నిరాకరించి, తల వెంట్రుకలు పీక్కుని జైన దీక్ష స్వీకరించడానికి నిర్ణయిస్తుంది. రాముడు మూర్ఛపోతాడు. సీత సర్వ గుప్తుడనే మునిని ఆశ్రయించి, జైనదీక్ష స్వీకరిస్తుంది. రాముడు స్మృతి వచ్చిన తర్వాత సీతాన్వేషణకు బయలుదేరుతారు. కాని, సకలభువనముని అతనిని ఊరడిస్తాడు.

పఉమ చరియంలో రామకథా సమాప్తి ఈ విధంగా ఉన్నది.

రత్నచూల, మణిచూలులనే ఇద్దరు దేవతలు రామలక్ష్మణుల సౌభ్రాత్ర పరీక్ష చేయదలచి రాముడు మరణించాడనే మిథ్యా వార్తను చెబుతారు. ఆమాట విన్నవెంటనే లక్ష్మణుడు శోకాకులుడై మరణిస్తాడు. నరకానికి వెళ్ళుతాడు. లక్ష్మణుని అంత్యేష్టి తర్వాత రాముడుకూడ విరక్తుడవుతాడు: లవణాంకుశులు కూడా విరక్తులవుతారు. రాముడు లవణుని పుత్రుడైన అంగరాహునికి పట్టం కట్టి 17 వేల సంవత్సరాలు వారితపస్విగా దేశం తిరుగుతూ కోటిశిల చేరి, అక్కడ సీతామోహాన్నివదలి, కేవలజ్ఞానం పొందాడు. చివరకు నిర్వాణం పొందాడు. చివరకు లక్ష్మణుడు, రావణుడు, సీత పెక్కుసార్లు జన్మలెత్తి ముక్తి పొందుతారు.

మహావీరుడు చెప్పిన రామచరితాన్ని విమలుడు గాథానిబద్ధం చేశాడు అని కవి ఒక శార్దూలంలో ఈ కావ్యం ముగిస్తాడు.

ఏయం వీర జిణేణ రామ చరియం
సిద్ధిం మహోత్థం పురా
పచ్చా ఐఐ ఖండల భూరిణాఉ కహియా
సీసాణధమ్మాసయం,



భూఓ సాహువరంపరాఏ సయలం
లోఏడియం పాయడం
ఏత్తేహిం విమలేన సూత్త సహితం
గాహానిబద్ధం కయం. (118 — 102)

విమలసూరి తన ఉద్దేశం జైన మత ప్రచారమే గనుక కావ్యదృష్టికి అంతగా ప్రాధాన్యమివ్వలేదు. అంతమాత్రాన కావ్య కామనీయకం లేదనికాదు. ఇతిహాస దృష్టితో వ్రాసినా, నగరార్ణవ శైలాది వర్ణనలతో ఇంపు చేకూర్చినాడు. ప్రతి పర్వాన్ని విమలాంకంగా చేశాడు. చివరి వృత్తంలో 'విమల' పదం పొందు పరచాడు. ఇతని వర్ణనలను ఒకటి రెండు ఉదాహరిస్తాను. ప్రావృట్కాల వర్ణనం—

నవగయ సిసిర నిదాహే,
గంగాతీరట్ఠియస్స రమణిజ్జే,
గజ్జంత మేహముఖలో
సంపత్తో పావుసో కాలో. 11.111

ధవల బలాయాధయవడ
విజ్జులయా కణయ బంధకచ్ఛాయ,
ఇందాఉహ కయ భూసా
ఝురంత నవసలిల దాణోహా. 12

అంజణ గిరి సచ్ఛాయా
ఘణహత్థీ పావుడంవ సురవఇణా,
సంపేసియా పభూయా
రక్ఖసనాహస్స అఇ గురుయా. 13

అంధారియం సమత్థం
గయణం రవియర పణట్ఠ గహ చక్కం,
తడయడ సముట్ఠియరవం
ధారాసరభిన్న భువణయలం. 14

ధారాసరభిన్నంగో
కంతా సరిఊణముచ్ఛిఓ పహిఓ,
పుణరవి ఆససిఓ చ్ఛియ
తీఏ సుహసంగమాసాఏ. 15

అహిణవ కయంబ గంధం
అగ్ఘావి ఊణ మూఢ మణహియయా,
జే అముణియ పరమత్థా
భమంతి తత్థేవ పహియ గణా. 16

దద్దుర మఊర జలహర
సద్దో తప్పిహయాణ ఏ యత్థం,
పారద్ధం పిన తాలం
వారణ లీలా సహావేణం. 17

సుట్ఠువి ఉక్కంఠులయా
పహియా జలఫలిహరుద్ధ వయమగ్గా,
కంతా సమాగమ మణా
సంఖా రహియా విసూరేంతి. 18

హరియ తణ సామలంగీ
మహివిలయా సలిలవత్థ పరిహాణీ,
వరకుడయ కుసుమదంతీ
హసఇవ్వ దసాణణాగమణే. 19

రావణుడు గంగాతీరంలో ఉండగా చలికాలం, ఎండకాలం గడిచాయి. గర్జించే మేఘాలతో ముఖరితమయిన వర్షాకాలం వచ్చింది. కొంగలనే తెల్లటి పతాకాలతో, మెరుపులనే బంగారు కటిబంధంతో, ఇంద్రధనస్సనే నగలతో, క్రొత్త నీరనే స్రవించే మదజలంతో కాటుక కొండవంటి కాంతితో ఒప్పారే మేఘాలనే పెద్ద పెద్ద ఏనుగులను ఇంద్రుడు రాక్షసనాథుని వద్దకు పంపినట్టు కనిపించింది. గగనతలంలో చీకట్లు కమ్ముతున్నాయి; సూర్యకాంతి, గ్రహాలు మరుగయిపోయాయి. ఉరుము మెరుపుల గోల ఎక్కువయింది. జడివాన అనే బాణాలతో భువనతలం ఛిన్నాభిన్నమయింది. విరహులయిన పాంథులు తమ కాంతలు తలపురాగా మూర్ఛపోయారు. మరల సుఖ సమాగమం సంభవిస్తుం దనే ఆశతో ఊరటచెందారు. క్రొత్తగా పూచిన కలుగొట్టు పూవుల వాసనకు దిమ్మెత్తిపోయిన పాంథులు తాము ఏమిచేయాలో పరమార్థమేమిటో తోచక ఆ కడిమిచెట్ల చుట్టూ తిరుగుతున్నారు. మట్టిదెబ్బల మీద ఉన్న కప్పల బెకబెకలు, నెమళ్ళ కేకలు, మేఘాల ఉరుములు మేఘ మహాగజం వప్రక్రీడకు తాళమా అన్నట్టు ఉన్నాయి. పథికులకు తమ ప్రియురాండ్లను కలుసుకోవాలని తొందర. కాని నీటి వరదలు అగడ్తలలాగ ఎదుట కనిపిస్తున్నాయి. వాటిని దాటలేక



రెక్కలు లేకపోయాయే అని విచారపడుతున్నారు. పచ్చనిగడ్డితో శ్యామలాంగి అయిన భూమి అనే మహిళ సీరనే వస్త్రం ధరించి, అడవి మొల్లలనే తెల్లని పలువరుసతో రావణుని రాకకు సంతోషం పట్టలేక నవ్వినట్టుంది.

ధన మాహాత్మ్యాన్ని విమలసూరి చాల చక్కగా వివరించాడు.

జస్సఅత్థో తస్స సుహం
జస్సఅత్థో పండిఓ యసో లోఏ,
జస్సఅత్థో సో గురుఓ
అత్థవిహీణో య లహుఓ ఉ. 35_16

తస్స మహత్థో య జసో
ధమ్మో వి య తస్స హోఇ సాహీణో,
ధమ్మోవి సో సమత్థో
జస్స అహింసా సముద్దిట్ఠా. 35_17

ధనమున్నవానికే సుఖం. ధనమున్నవాడే పండితుడు. ధనమున్నవాడే గొప్పవాడు. ధనహీనుడు తేలికయిపోతాడు. ధనమున్న వానికే కీర్తి. ధర్మం ధనమున్నవానికే స్వాధీనం, అహింసోపదేశం చేసే ధర్మాన్ని ధనవంతుడే చేయగలుగుతాడు.

విమలసూరి అర్థాంతర వ్యాసాలు కొన్ని చక్కగా ఉన్నాయి. వాటిని తర్వాతి కవులు, అన్యధర్మానుసారి కావడంవల్ల అతనిని స్మరించక అనుకరించారనవచ్చు.

(1) కిం వజ్జసూఇ భిన్నేసరియఇ తంతూ మహారయణే. 1_13
దీనిని కాళిదాసుదాసు అనుకరించాడని ఇదివరకే చెప్పాను.

(2) నక్ఖేణ జం విరుప్పఇ తత్థయ పరసూఇ కిం కజ్జం? 12_101
గోటితో పోయేదానికి గొడ్డలి ఎందుకు?

(3) నట్ఠం హి యం చ భద్దే
స సోయియవ్వం బుహజణేణ. 30_35
ఓ మంచిదానా బుద్ధిమంతులు గడచిపోయినదానికి విచార పడగూడదు.

(4) తుల్లావత్థాణ జఏ
హోఇ సణేహో నరాణ నియయం వి. 47_5
సమానావస్థలో వున్నవారికి స్నేహం కుదురుతుందనడం లోకనియమం.

సమాన శీల వ్యసనేషు సఖ్యం అనే సూక్తి, సర్వస్సగందేషు విశ్వసితి అనే కాళిదాసుమాట దీనివంటివే.

(5) పత్తే విణాసకాలే
నాసఇ బుద్ధీ నరాణ నిక్కుత్తం. 53_138
వినాశకాలం వచ్చినప్పుడు మానవులబుద్ధి నశిస్తుందనడం నిశ్చయం. వినాశకాలే విపరీతబుద్ధి.

(6) కిం దిణయరస్స దీవో
విజ్జఇ విహుమగ్గణట్ఠాఏ. (70_27)
దినకరుడు దారి తప్పుతాడని దీపం చూపుతామా?

(7) కిం రాసహస్స సోహఇ
దేహే రఇయా విజయఘంటా. 71_54
గాడిదకు విజయ ఘంట కడితే ఏం బాగుంటుంది?

(8) మరణంతాఇం హవంతి వేరాణి. 75_1
మరణాంతాని వైరాణి — యుద్ధకాండ. రామా.

(9) సగ్గసరిసోవి దేసో
పియ విరహే రణ్ణ సన్నిహో హోఇ. 78_42
స్వర్గ సదృశ్యమైన దేశం కూడా ఇష్టులయిన వారు దగ్గర లేనప్పుడు అరణ్య సమానం.

(10) భిచ్చస్స జీవియావో
కుక్కుర బీయం వరం హూఇ.
భిచ్చగాని జీవితంకన్నా కుక్క బ్రతుకు మేలు.

(11) సవ్వస్సవి కోడియం సరిసం. 100_54

(12) జహ రాయా తహ పయా సవ్వా. 105_106
యథారాజా తథాప్రజాః.

(13) జాఅస్స ధువం మరణం. 106_26
జాతస్య హి ధ్రువో మృత్యుః (భగవద్గీత - 2_27)

విమలసూరి మతాచార్యుడు, లోక వృత్తజ్ఞుడు గనుక మంచి మంచి ఆభాణకాలు ప్రయోగించాడు.

(1) నయ గేహమ్మిపలిత్తే
కూవో ఖిమ్మఇ సుతూరమాణేహిం,



దాహోలివి ణ దమ్మఇ
ఆసోచ్చియ తక్కణం చేవ. 5_239

ఇంటికి నిప్పంటుకున్నప్పుడు తొందరగా బావి తవ్వడం సాధ్యమా? పరిగెత్తే గుర్రాన్ని వెంటనే అదుపులోకి తేవడం సాధ్యం కాదు.

తక్ర. వైరా. 75

(2) ...................
వెజ్జ నరిందాణ మిత్తపురిసాణం,
అహోణఓఅ లోఏ
ఏయాణ పుడం కహేయవ్వం. 12_17
జనంలో ఆభాణకం ఏమిటంటే, వైద్యుని వద్ద, రాజు వద్ద, మిత్రుని వద్ద మరుగుచేయరాదు; స్పష్టంగా చెప్పివేయాలి.

(3) కింవా తుసేసు కీరఇ
తందుల సారమ్మి సంగహివ. 12_138
బియ్యం తీసుకున్న తర్వాత ఊకతో ఏమి చేస్తాం?

(4) దుసహం హవఇ సమక్కం
దుక్కం చియ ఉబ్భవే జణ వయస్స,
గయవేయణం తు పచ్చా
జణమ్మి ఏసా సుకఈ భోమఇ. 26_97
ఉత్పత్తి సమయంలో దుఃఖం కళ్ళఎదుటే ఉంటుంది; జనం దానిని సహించలేరు. కాని, కొంత కాలం తర్వాత ఆ దుఃఖం పోతుంది. ఇది లోకంలో వ్యాపించిన మాట.

(5) కో సయల జణస్స ఇహం
కరేఇ ముఖ బంధణం పురిసో? 94_70
ఎవడు లోకులందరి నోళ్ళు మూయించగలడు?

(6) వీర పురుసాణ భోజ్జా
వసుధా, కిం ఏత్థ విద్దేహిం. 98_22
వీరభోజ్యా వసుంధరా. చరువులో అదసరం ఏమిటి?

(7) రయణం తు పుహఇ మోల్లం
దిస్సంచియ సాగరస్సముట్టీ ఏ. 103_110

(8) అసమిక్కియకారీణం
పురిసాణం ఏత్థ పావహియయాణం,
సయమేవ కయం కమ్మం
పరితావయఇం హవఇ పచ్ఛా. 110_11

అనాలోచితంగా పనిచేసే పాప హృదయులకు వారుచేసిన పనే తర్వాత పరితాప కరమవుతుంది.

అతిరభస కృతానాం కర్మణా మావిపత్తేః
భవతి హృదయదాహీ శల్యతుల్యో విపాకః. భర్తృ. నీతి. 95

(9) సలిలే మంథిజ్జంతే
సుట్ఠువి నయ హోఇ నవణీయం.
సికయావి పీలియావి
కత్థొచ్చియ జాయఏ తేల్లం. 113_33

నీటిని ఎంత బాగా చిలికినా వెన్నరాదు. ఇసుకను ఎంత పిండినా నూనె రాదు.

(10) వాలగ్గకోడి మేత్తం
దోసం పేచ్ఛసి పరస్స అతి సిగ్ఘం,
మందర మేత్తం పి తుమం
న య పేచ్ఛసి అత్తణో దోసో. 113_40

ఎదుటి వానిలోని లోపం వెంట్రుక కొసంత ఉన్నా త్వరగా కంటపడుతుంది. తన దోషం మందర పర్వతమంత ఉన్నా కనిపించదు.

ఖలః సర్షప మాత్రాణి
పరచ్ఛిద్రాణి పశ్యతి,
ఆత్మనో బిల్వ మాత్రాణి
పశ్యన్నపి న పశ్యతి. భారతం_1_3069

ఉపమా రూపకోత్ప్రేక్షాతిశయోక్తులు, యమకాలు చాల ఉన్నవి. దీనిలోని ప్రధాన పాత్రలన్నీ ప్రాపంచిక సుఖాలు వదలి జైన ధర్మం స్వీకరించేవి గనుక, ప్రధాన రసం—శాంతం—వైరాగ్యమే అయినా, శృంగార వీర కరుణాది రసాలను కూడా కవి ఆయా స్థలాలలో పోషించాడు. శైలి సరళం, భాష చెప్పినట్టు వినే కింకరి.

దీనిలో 118 ఉద్దేశాలు: 8651 శ్లోకాలు ఉన్నవి.



## గుణభద్రుని సంప్రదాయం:-

రెండవది గుణభద్రుని సంప్రదాయం. గుణభద్రుడు కర్ణాటక ప్రాంతంవాడు, జినసేనుని శిష్యుడు. గురువు రచించిన అసమగ్ర మయిన ఆదిపురాణాన్ని పూర్తిచేయడమేకాక, ఉత్తర పురాణ అనే పేర త్రిషష్టి శలాకా పురుష చరిత్ర ద్వితీయభాగం సంస్కృతంలో రచించాడు. ఇతడు 9వ శతాబ్దివాడు. ఉత్తర పురాణంలోని 68,69 పర్వాలలో 1117 శ్లోకాలలో అష్టమ బలదేవ నారాయణ, ప్రతి నాయకుల—రామ లక్ష్మణ రావణుల—చరిత్ర ఉన్నది. ఈ రామచరితం వాల్మీకి కథకు, విమలసూరి కథకు భిన్నం. దీనిలో ముఖ్య విషయం సీత రావణ మండోదరుల కుమార్తె.

గుణభద్రునికథకు ఆధారమేమిటో తెలియదు. కాని, ఇతనికి విమలసూరి సంప్రదాయం, సంఘదాసుని సంప్రదాయం బాగా తెలుసునని తోస్తుంది. జినసేనుడు తన ఆదిపురాణానికి పరమేశ్వర కవి వచన కథ మూలమన్నాడు. గుణభద్రుడు కూడ పరమేశ్వరుని గద్య రచనను అనుసరించాడేమో: కాని, పరమేశ్వర కవి రచన లభించడంలేదు. కాని, టిబెట్టు రామాయణంలోను, ఇతర గ్రంథాలలోను సీత రావణమండోదరుల పుత్రి అని ఉన్నది. బహుశా ఇది లోకంలో ప్రచారంలో వుండి వుండవచ్చు. దానినే పరమేశ్వర కవి, గుణభద్రుడు జైన సంప్రదాయానుగుణంగా మలచుకొని వుంటారు. గుణభద్రుని సంప్రదాయానుసారంగా మరికొన్ని సంస్కృత కన్నడ ప్రాకృత రచనలు వెలువడ్డాయి. వాటిలో ప్రాకృతంలోనిది పుష్పదంతుడనే కవి తిసట్ఠి మహా పురిస గుణాలంకారం. దీనికి మహా పురాణమనీ నామాంతరం వుంది. ఇతడు క్రీస్తుశకం 965 ప్రాంతంవాడు. ఈ ప్రాకృతాన్ని అపభ్రంశమని కొందరన్నారు. పుష్పదంతుని రచనలోని గుణభద్ర సంప్రదాయపు రామ కథను ఈ విధంగా క్రోడీకరించవచ్చు.

వారాణసి రాజయిన దశరథునికి నలుగురు పుత్రులు పుట్టారు. రాముని తల్లిపేరు సుబాల. లక్ష్మణుని తల్లిపేరు కైకేయి. దశరథుడు తన రాజధానిని సాకేతపురానికి మార్చిన తర్వాత మరొక రాణికి భరత శత్రుఘ్నులు పుట్టారు.

దశాననుడు వినమి అనే విద్యాధరవంశంలోని పులస్త్యుని కుమారుడు. ఒకరోజు అతడు అమితవేగుడనే వాని కుమార్తె మణిమతి తపస్సు చేస్తుండడం చూస్తాడు. ఆమెపై మరులుగొని ఆమె తపస్సుకు విఘ్నం చేయడానికి ప్రయత్నిస్తాడు; మణిమతి "నేను దశాననునికి పుత్రిగా జన్మించి, అతనిని

చంపుతాను" అని ప్రతిజ్ఞ చేస్తుంది. తర్వాత దేహత్యాగంచేసి, మండోదరి గర్భంలో ప్రవేశిస్తుంది. ఆమె మండోదరి కుమార్తెగా జన్మించగానే, "ఈ శిశువు మిమ్మ నాశనం చేస్తుంది" అని కార్తాంతికులు రావణునికి చెబుతారు. రావణుడు భయపడి, ఆ శిశువును ఎక్కడయినా వదిలిపెట్టి రమ్మని మారీచిని ఆజ్ఞాపిస్తాడు. మారీచి ఆ శిశువును ఒక పెట్టెలో పెట్టి మిథిలా దేశంలో ఒకచోట పూడ్చి పెడుతాడు. ఎవరో కృషీవలులు భూమిని దున్నుతుండగా, నాగిలిక్రరుకు ఆ పెట్టె తగులుకొని పైకిరాగా, కృషీవలులు ఆ పెట్టెను జనకమహారాజు వద్దకు తీసుకొని వస్తారు. జనకుడు ఆ పెట్టెను తెరచి చూడగా ముద్దులు మూటగట్టే పాప. ఆమెకు సీత అని పేరుపెట్టి, పెంచి పెద్దచేస్తాడు. చాలాకాలం తర్వాత జనకుడు తన యజ్ఞ సంరక్షణార్థం రామలక్ష్మణులను ఆహ్వానిస్తాడు. యజ్ఞం సమాప్తమయిన తర్వాత సీతారాములకు వివాహమవుతుంది. తర్వాత రాముడు మరి ఏడుగురు కన్యలను పెళ్ళాడుతాడు. లక్ష్మణుడు పృథ్వీదేవి మొదలైన పదహారుగురు రాజకన్యలను వివాహమాడతాడు. వారిద్దరూ దశరథుని అనుమతితో వారాణసిలో నివసిస్తారు.

కొంత కాలానికి నారదుడు రావణుని వద్దకు వెళ్ళి సీత సౌందర్యాన్ని వర్ణిస్తాడు. అది విని రావణునికి సీతను అపహరించుకొని వద్దామనే బుద్ధి కలుగుతుంది; సీత మనసును తెలుసుకొనడానికి శూర్పణఖను పంపుతాడు, కాని, సీత పాతివ్రత్యం చూచి, శూర్పణఖ రావణుని వద్దకు తిరిగి వచ్చి, సీత మనస్సు దృఢమయిందని, దానిని కదిలించడం సంభవం కాదని రావణునికి స్పష్టపరుస్తుంది.

రాముడు, సీత ఒకమారు వారాణసి సమీపంలోని చిత్రకూట వాటికలో విహరిస్తుండగా, మారీచి స్వర్ణ మృగరూపంతో రాముణ్ని దూరప్రాంతానికి లాక్కుపోతాడు. ఇంతలో రావణుడు రామ వేషంతో సీత వద్దకు వచ్చి "నేను బంగారు జింకను అంతఃపురానికి పంపాను. నీవు పల్లకి ఎక్కి బయలుదేరు" అని చెబుతాడు. ఈ పల్లకి నిజానికి పుష్పక విమానం. సీతను అది లంకకు తీసుకువెళ్ళుతుంది. రావణుడు సీతను స్పృశించడు. ఎందుకంటే, పతివ్రత స్పర్శతో అతని ఆకాశగమన-కామచార- విద్య నశించిపోతుంది.

ఇంతలో దశరథునికి ఒక కల వస్తుంది. రావణుడు సీతను అపహరించుకొని వెళ్ళాడని ఆ కలలో చూస్తాడు. ఈ సమాచారాన్ని అతడు రామునికి వార్తాహరుల ద్వారా తెలియపరుస్తాడు. ఇంతలో సుగ్రీవుడు, హనుమంతునితో పాటు వాలివధార్థం రాముని సహాయం కోరడానికి వస్తాడు. హనుమంతుడు



లంకకు వెళ్ళి సీతను సాంత్వనపరచి తిరిగి వస్తాడు. తర్వాత లక్ష్మణుడు వాలిని వధిస్తాడు. పిదప సుగ్రీవుడు తన రాజ్యం సంపాదించుకుంటాడు.

సముద్రంపై సేతువుకట్టే ప్రసక్తే ఈ కథలో లేదు. వానరులు, రాముని సేన విమానాలలో లంక చేరుతారు. ఘోరయుద్ధానంతరం లక్ష్మణుడు చక్రంతో రావణుని శిరస్సు ఛేదిస్తాడు. రాముడు ఎలాటి పరీక్ష లేక సీతను స్వీకరిస్తాడు. తర్వాత లక్ష్మణుడు రామునితో పాటు 42 సంవత్సరాల వరకు దిగ్విజయ యాత్రచేసి అర్ధ చక్రవర్తి అయి, అయోధ్యకు తిరిగి వస్తాడు. తర్వాత ఇద్దరికీ ఒకేమారు అభిషేకం అవుతుంది.

లక్ష్మణునికి 16 వేల మంది, రాముడికి ఎనిమిదివేల మంది రాణులు ఉంటారు. కొన్ని సంవత్సరాల తర్వాత రామలక్ష్మణులు భరత శత్రుఘ్నులకు రాజ్యం అప్పగించి, వారాణసి చేరుకుంటారు. సీతకు విజయరాముడు మొదలైన ఎనిమిదిమంది కుమారులు కలుగుతారు. సీతా త్యాగకథ దీనిలో లేదు. లక్ష్మణుడు ఒక అసాధ్యమైన వ్యాధితో మరణించి, రావణుని చంపిన పాపానికి నరకానికి వెళ్ళుతాడు. రాముడు లక్ష్మణ పుత్రుడైన పృథివీచంద్రుని రాజ్యంలో ప్రతిష్ఠించి, సీత కనిష్ఠపుత్రుడు అజితంజయుని యువరాజుచేసి, సుగ్రీవుడు, అణుమంతుడు, విభీషణుడు మొదలైన ఐదు వందల మంది రాజులు, 180 మంది పుత్రులు వెంటరాగా తపస్సాధన కోసం బయలుదేరుతాడు; 395 సంవత్సరాలు గడచిన తర్వాత రామునికి కేవలజ్ఞానం కలుగుతుంది. సీత కూడ తక్కిన పెక్కుమంది రాణులతో పాటు దీక్ష స్వీకరిస్తుంది. రాముడు అణువంతుడు మోక్షం పొందుతారు. సీత స్వర్గానికి వెళ్ళుతుంది. లక్ష్మణుడు నరకం అనుభవించిన తర్వాత సంయమ నియమాలతో మోక్షం పొందుతాడు.

## వాల్మీకి మతానుసారి రామకథ:-

మూడవ పాయ వాల్మీకి రామాయణానుసారి అని మొదట్లోనే అన్నాను. వాల్మీకి రామకథను జైనబౌద్ధ మతానుయాయులు ఎంత వికృతం చేసినా, అది నిత్యకల్యాణంగా ఉండినదని అనటానికి గాథా సప్తశతిలోని రెండు గాథలు తార్కాణం.

## గాథా సప్తశతి:-

కొత్తకాపురం. పెద్దకొంప. మర్యాదగల దొడ్డ ఇంటితనం. ఇంట్లో పెద్దలు ఎవరికివారు పనిలో వుంటారు. భర్త ఇంటి పెద్ద కొడుకు కాబోలు! కార్యాంతర నిమగ్నుడయి వుంటాడు. ఇదే సందుకదా అని అశుద్ధ మనస్కుడయిన మరది

తన వెంటబడుతాడు. పెద్దలకు తెలుపుదామా అంటే. ఇల్లు భగ్నమవుతుందన్న భయం. చెప్పకపోయామా, మానమే పోతుంది. కనుక కులవధువు— దొడ్డ మనసుగల కోడలు-వివేకవంతురాలు కావడంవల్ల మరదికి అతని మనసు మారడానికి గోడమీద వ్రాసిన రామానుగతుడయిన సౌమిత్రి కథను- రాముని వెంట వెళ్ళుతున్న లక్ష్మణుని కథను-చూపుతుంది-మరదీ నీవు వైరివేషాలు వేయక అన్న విషయంలో న్యాయంగా వుండమని సూచిస్తూ ప్రతి రోజూ చెబుతుంది.

దిఅరస్స అసుద్ధ మణస్స
కులవహూ ణిఅఅకుడ్డలిహిఅఇం,
దిఅహం కహేఇ రామా
ణులగ్గ సోమి త్తిచరిఅఇం. 1.35

ఇది హాల సాతవాహనుని గాథ.

లంకా వాసులు రాక్షసులని, వారికి జనం భయపడుతారని జనంలో బాగా వ్యాపించిన ప్రవాదానికి మరొక గాథ వుంది. వసంతకాలంలో బాగా విరిసి ఎర్రటి పూతలతో భయం గొలిపె మోదుగ చెట్లను, రాక్షసులకు శ్లేష కల్పించి చెప్పిన గాథ ఇది.

లంకాలయాణం పుత్తఅ
వసంత మాసేక్కలద్ధ పసరాణం,
ఆపీఅ రోహియాణం
సహేఇ, జణో పలాసాణం. 4–11 (అణురాయస్స)

బౌద్ధులు జైనులు రామాయణాన్ని వికృతం చేస్తున్నందుకు విరుగుడుగానా అన్నట్టు భాస కాళిదాస ప్రవర సేనులు ప్రతిమాభిషేక నాటిక రఘువంశ సేతుబంధ కావ్యాలు రచించారా అని నా ఊహ.

## సేతుబంధం :

వాల్మీకి సంప్రదాయంలో రచించిన ప్రాకృత రామకథ సేతుబంధం. ప్రాకృత కావ్యసందోహంలో ఉత్తమమైనది సేతుబంధం. సంస్కృత మహాకావ్య సంప్రదాయ బద్ధాలయిన అష్టాదశ వర్ణనలు దీనిలో లేకపోయినా, యుద్ధనీతి సేతునిర్మాణం మొదలైన యుద్ధకాండ ప్రధాన ఘట్టాలపై ఆధారపడిన మహా కావ్యమిది. రాముడు సముద్రతీరం చేరి యుద్ధం చేసి, అయోధ్యకు బయలుదేరే వరకు వున్నకథ దీని వస్తువు.

వాకాటక రాజయిన ప్రవరసేనుడు ఈ కావ్యకర్త. ఇతడు యుద్ధాలు నడిపినవాడు. దండయాత్రలలో వంతెనలు నిర్మించి వుంటాడు. సేనలను



ప్రబోధించి వుంటాడు. సామాన్య కవికి అందుబాటులో లేని యుద్ధాది విషయాలలో ఈయన నైపుణ్యం స్పష్టంగా తెలుస్తున్నది; ఈ కావ్యంలో. 15 ఆశ్వాసాల మహాకావ్యమిది. ఆర్యాభేదమయిన స్కంధకమాత్రాచ్ఛందస్సులో కావ్యమంతా సాగుతుంది. చతుర్మాత్రాకాలయిన ఎనిమిదేసి గణాలు పూర్వోత్తరార్థాలలో వుంటాయి.

చఉమత్తా అట్ఠగణా
పువ్వద్ధే ఉత్తరద్ధ హోఇ సారూఅ,
సోఖందఅ వి అణహు
పింగల పఅణేఇ ముద్దిబాహు సంభేఅ.

ప్రవరసేనుడీ కావ్యాన్ని – సీతాదుఃఖక్షయమైన దశముఖ వధమనే ఈ కావ్యాన్ని – అనురాగ చిహ్నాంకితంగా తీర్చిదిద్దాడు.

తం తిదస బందమోక్షం
సమత్థ తేల్లోక్క హిఅఅసల్లుద్ధరణమ్,
సుణహూ అణురాఅ ఇణ్హామ్
సీఅదుక్ఖక్ఖఅం దహముహస్సవహమ్. 1–12

సీతాదుఃఖక్షయమైన దశముఖ వధమనే ఈ అనురాగ చిహ్నితమైన కావ్యం వినండి - అనికావ్యం ప్రారంభిస్తాడు కవి. ప్రతి ఆశ్వాసాంతమూ అనురాగ చిహ్నితమే.

సముద్రాన్ని చూచి భయపడి వెనుదిరిగే వానర భటులను సుగ్రీవుడు ఉత్తేజ పరచే ఘట్టంలో ప్రవరసేనుడు సేనాపతిగా, మనకు దర్శనమిస్తాడు "మీ బలం మీకు తెలీదు. మీకు ఈ సముద్రం ఏమిలెక్క? సముద్ర తీరంలోని పొగడ పూవుల సుగంధంతో గుమగుమలాడే సముద్రాన్ని పళ్ళరసం దోసిలతో తాగివేసినట్టు తాగివేయగలరు" అన్న సుగ్రీవుని ఉపన్యాసం చాలా గొప్పది.

తరిఉం ణహు ణవర ఇమం
వేలావణ బఉల కుసుమ వాసిఅసురహిమ్,
హత్థ ఉడేహి సమత్థా
తుమ్హే సాఉంపి ఫలరసంవ సముద్దమ్ 3–7

ఇతడు సేతువును నలపథమన్నాడు. ఈ నలపథ నిర్మాణంలో నలుడు వేసిన తొలిరాయి సముద్రం నీటిపై తేలగా, అది మంగళ కలశంవలె ఉన్నదని వర్ణించారు.

పఢమం ఇలేణ ఙిమిఓ
మంగలకలసోన్వ జలణిహిమ్మి మహిహరో. 8_29

సేతునిర్మాణంలో వానరులు రాళ్ళు తేవడం. అందివ్వడం: ఇద్దరిద్దరు చేరి చేతులు: చేతులు పట్టుకారలులాగ కలిసి పెద్ద పెద్ద రాళ్ళను తేవడం, నలుడు ఆ రాళ్ళను మెడతిప్పి చేతులు చాచి అందుకొని, సేతువులోవేసి సర్దడం మొదలయినవాటి వర్ణనలు చూస్తే ప్రవరసేనుడు చెరువు కట్టలు, సేతువులు మొదలయిన పెద్ద పెద్ద పనులు చేయించి వుంటాడని స్పష్టమవుతుంది. 8_87, 88. ఈ సేతువు రాముని శాశ్వతయశో లాంఛనం.

అథత్తావిరవణం
సాసఅ రామజసలంచణం సేఉవహమ్ 7_1

వాల్మీకి రామాయణంలో లంకనుంచి తిరిగి వచ్చిన హనుమంతుడు "దృష్టా సీతా" అని తన కథనాన్ని ప్రారంభించగా దానినే ప్రవరసేనుడు మరింత సుందరంగా చిత్రీకరించాడు. సీతను చూచానని హనుమ అంటే రామునికి నమ్మకం కలగలేదు. చాలా చిక్కిపోయింది అంటే, నిట్టూర్చాడు. తనను గూర్చి విచారిస్తున్నదని చెప్పగా, రాముడు విలపించడం మొదలు పెట్టాడు. దుఃఖించకండి, ఆమె సజీవ అని హనుమంతుడు అనగానే రాముడు లేచివచ్చి హనుమంతుని అక్కున చేర్చుకున్నాడు.

డిట్ఠత్తి న సద్దహిఅం
ఝీణ త్తి సబాహమంథరం ణీససిఅం
సోఆఇ తుమంతి రుణ్ణం
పహుణా జిఅఇ త్తి మారుఈ ఉపడూఢో.

మారుతి అలంఘనీయమైన ఉదధిని లంఘించి తిరిగి వచ్చాడు. అతనిని చూచి వానరులు ఆశ్చర్యంతో నిశ్చలులై పోయారు. వారు సహజంగా చంచలులు గదా చిత్రంలోని దీపాలవలె కదలక మెదలక ఉన్నారు, సహజ చాంచల్యం వదిలి.

ఆలేఖ్ఖ పఈవాణ పణి అఅం
పఇఇ చడుల త్తణం వి విఅవిఅమ్. 3_45

రాముడు రావణుని యుద్ధంలో జయించి, హుతవహ శుద్ధ అయిన సీతను, హుతవహశుద్ధ అయిన బంగారుకడ్డీ - కాంచనయష్టి - లాగ గ్రహించి భరతుని అనురాగాన్ని సఫలం చేయడానికి అయోధ్యానగరానికి తిరిగి వచ్చాడట.



పేత్తూణ జణఅ తణఅం
కంచణ లట్ఠింవ హుఅవహమ్మి విసుద్ధమ్,
పత్తో పురిం రఘువఈ
కాఉం భరత స్స సవ్ఫలం అణురాఅమ్. (15.94)

## ఈ వ్యాసానికి ఉపయోగించిన గ్రంథాలు. వ్యాసాలు


1 నాథూరామ్ ప్రేమీ- జైన సాహిత్య ఔర్ ఇతిహాస.

2 **Harisatya Bhattacharya:-**
Naravanas, Pratinarayans and **Balabhadras.**
The Jain Antiquity **Vol** 8.

3 **Burlingame, E.W. Buddhist Legends. Harward**
Oriental Services, Vol 28-30.

4 Chakravarti, A. Buddhist and Jain versions of the story of Rama. The Jain Gazettee **Vol** 22.

5 Chakravarti Chittaharan.
Treditions about Vanaras and Rakshasas.
Indian Historical quarterly Vol.1.

6 Fausboll, V.-The Jatak, vol 1-VII, London.

7 Kulkarni, V.-M.-The Ramayana Version of Sanghadasa as found in Vasudeva Hindi, Journal of Oriental Institute, Baroda. Vol-2.

8 Kulkarni, V.M. The Ramayana of Bhadreswara as found in Kahavalee, (Cen) JOI, Baroda, Vol 2.

9 Narasimhachar D.L. The Jaina Ramayanas, Indian Historical quarterly Vol 15.

10 Norman, H.C.-Commentary on Dharmapada, Vol-5, Pali Text book Society London.

11 Rhys Davids, W.-Buddhist India.

12 Suzuki, D.T.-Studies in Lankavatara Sutta, London.

13 Utgikar N.B.-The story of Dasaratha Jataka and Ramayana.
J R A S cent Supplint 1914.

14 Vyas, S.N.-The Civiligation of Rakshasas in Ramayana.
15 Watanabe, K.-The oldest record of Ramayana in a Chinees Buddhist writing J R A S 1907.
16 Winterntz, M.-Jataka Gathas and Jataka Commentry IHQ Vol 4.
17 Jacobi, H.-Encyclo- of Religion and Ethics Vol 2 & 7.
18 Keith, A.B.-History of Sanskrit Literature
19 Kern, H.-Manual of Buddism, Strosburg-1896.
20 Vaidya, C.V.-The Riddle of Ramayana, Bombay.
21 Weber, A.- Ueberdas - Ramayana, Berlin, 1870 English translation.D.C Boyd, Bombay 1873
22 Smith, H.-Suttanipata Commentary Paramaththa Jotika by Buddha Ghosha. Pali Text book society, London.
23 Sen, D.C.-Bengali Ramayana, Calcutta. History of Bengali Literature, Calcutta.
24 Wheeler, J. T.-History of India, Vol II London.
25 పఉపచరియం- విమలసూరి, మునిశ్రీ పుణ్య విజయ సంపాదితం. హిందీ అనువాదం-శాంతిలాల్ ఎ.హోరా,పీఠిక-వి.ఎం.కుల్కర్ణీ Prakrit Text Society, Varanası-5
26 రామాయణం
27 సేతుబంధం-
28 గాథా సప్తశతి-నిర్ణయ సాగర ప్రెస్, బొంబాయి.
29 'భారతి' సంపుటాలు మద్రాసు, విజయవాడ.
30 రామకథా-రెవరెండ్ ఫాదర్ కామిల్ బుల్కే, ఎస్.జె., ఎం.ఎ, డి.ఫిల్; డి.లిట్. అధ్యక్ష హిందీ విభాగ్, సంత్ జేవియార్ కాలేజ్, రాంచి, హిందీ పరిషత్ ప్రకాశన్, ప్రయాగ విశ్వవిద్యాలయ, ప్రయాగ.
31 జాతక కథలు (తెలుగు అనువాదం) శ్రీ శివశంకరస్వామి.

# వజ్జా లగ్గంలో తెలుగు పదాలు

వజ్జా లగ్గం హాలుని గాథాసప్తశతి వంటి ప్రాకృతగాథా సంకలనం. హాలుని గాథలు ముక్తకాలు; వజ్జాలగ్గం భర్తృహరి సుభాషితాల వలె వివిధ విషయ గుచ్ఛాల సంకలనం. "ఒక ప్రస్తావానికి సంబంధించిన అనేక గాథలు వజ్జ, అలాటివాటి సంకలనం—లగ్గం—వజ్జా లగ్గం. వజ్జా అంటే పద్ధతి"[1] అని వజ్జాలగ్గ రచయితే ఉపక్రమణికలో చెప్పుకున్నాడు. దీని రచయిత శ్వేతాంబర జైన సంప్రదాయానుయాయి అయిన జయవల్లభుడు. వజ్జాలగ్గానికి అతడు జయ వల్లభం[2] అనే పేరు పెట్టాడు. కాని వజ్జాలగ్గమనే ప్రఖ్యాతి చెందింది. జయ వల్లభుని కాలంపై చర్చలు చాల జరిగాయి. ఆచార్య మాధవ వాసుదేవ పట్వర్ధన్ క్రీస్తుశకం 750–1337 మధ్య వుంటుందన్నారు.[3]

ప్రాకృత సాహిత్యం ప్రధానంగా జానపద సాహిత్యం గనుక, దానికి ముగ్ధులైన సహృదయ కవులు జనపద వ్యవహృతమైన దేశీ పదాలను కూడ గ్రహించారు. ఈవిధంగా హాలుని గాథాసప్తశతిలోనే ఎన్నో దేశీ పదాలు చేరినప్పుడు, వజ్జా లగ్గంలో చేరడంతో ఆశ్చర్యం ఏమీలేదు. ప్రాకృత సాహిత్యంలో చేరిన దేశీ పదాలను ఆచార్య హేమచంద్రుడు దేశీ నామమాలలో పొందుపరచాడు. గాథా సప్తశతిలోని తెలుగు పదాలను, దేశీ నామమాలలోని మరికొన్ని తెలుగు పదాలను (శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామిగారు చెప్పగా మిగిలినవి) తెలుగు పాఠకులకు ఇదివరకే మనవి చేశాను. ఇప్పుడు వజ్జాలగ్గం లోని తెలుగు పదాలను పరిచయం చేస్తున్నాను.

తెలుగు పదాలు అనగానే ఆప్పుడు వ్యవహారంలో ఉన్న పదాలేనని భ్రాంతి పడరాదు. ఇప్పటి పదాల మూలరూపమని గుర్తుంచుకోవాలి. అన్యభాషా పదాలు నేడు తెలుగు ప్రత్యయాలతో తెలుగులో చేరి వివిధ వికారాలు పొంది నట్టు తెలుగు పదాలూ ప్రాకృతవేషంతో విచిత్రంగా కనిపిస్తాయి. మొదట వింతగా మారిన 'వింతర' పదంతోనే ప్రారంభిస్తాను.

## (1) వింతర:

అసమత్థ మంత తంతాణ
కుల విముక్కాణ భోగహీణాణం,

దిట్ఠాణ కో న వీహఇ
వింతర సప్పాణ వ ఖలాణం. (58)

(అసమర్థ మంత్ర తంత్రేభ్యః
కుల విముక్తేభ్యః భోగహీనేభ్యః,
దృష్టేభ్యః కో న బిభేతి
వ్యంతర సర్పేభ్య ఇవ ఖలేభ్యః.)

ఖలులు సర్పాలకన్నా విచిత్రమైనవారని కవి చెప్పదలచాడు. పాములు మంత్ర తంత్రాలకు కట్టుబడుతాయి? ఖలులు కట్టుబడరు; వారిని కట్టివేసే మంత్రాలేమీ లేవు. పాములకు కులాలు, తెగలు ఉన్నాయి;[4] ఖలులకు లేవు మంచి కులాలవారుకారు. పాములకు భోగాలు—పడగలు ఉన్నాయి; ఖలులక లేవు, కనుక ఖలులు వింత పాములు. అలాటి వారినిచూచి ఎవరు భయపడరు పాము భయంకన్నా ఖలుని భయం ఎక్కువ.

ఈ గాథ చివరి పాదంలోని వింతర పదానికి వ్యాఖ్యాతలు వ్యంతర అని ఛాయ చెప్పారుగాని అర్థం సరిగా చెప్పలేదు. ఆచార్య మాధవ వాసుదేవ పట్వర్ధన్ కూడ ఈ గాథను సరిగా చూడలేదు. దానికి కారణం వింతర అనేది వ్యంతర అనేదాని వికారమని భావించడమే. ఈ గాథలోని విశేషణాలన్నీ ఖలులకు, వాటి విపరీతార్థం సర్పాలకు. ఇది గ్రహించలేక శ్లేషవుందనే భ్రాంతి పడ్డారు ఆచార్య పట్వర్ధన్.[5]

ఈ వింతర పూర్తిగా తెలుగుపదమని చదవగానే స్ఫురిస్తుంది. వింత అంటే విచిత్రం. తెలుగు తోబుట్టువులైన తమిళ కన్నడ మలయాళాలలోను ఈ పదం వుంది—విందై, వింతె. తెలుగులో వింత పేద, బీద, దాసు వంటి పదాలకు స్త్రీ ప్రత్యయం చేరినప్పుడు ర మధ్య వస్తుంది—వింతరాలు, పేదరాలు బీదరాలు, దాసురాలు. కాని, రాలు ప్రత్యయం కాదని ప్రకృతి ప్రత్యయాల అనుచిత విభాంగవల్ల కలిగిందని భాషా తత్త్వవేత్తల వాదం. ప్రాతిపదిక పేదర, బీదర, దాసుర. వాటికి ఆలుచేరి పేదరాలు మున్నగు రూపాలు అయాయి, అట్లే వింతర కూడ వింతయిన వారు అనే అర్థంలో వుండి వుంటుం దేమో! అది ఆ విధంగానే ప్రాకృతంలో చేరి వుంటుంది—వింతర సప్పాణ అని. అన్యభాషా పదాల కృదంతాల బహువచన రూపాలు తెలుగులో ప్రాతిపదిక లవుతాయి. బలవంతః - బలవంతుడు, గుణవంతః - గుణవంతుడు, దాసర్—దాసరి.



కనుక వింతర అనేది తెలుగు పదమని మనం నిర్ణయించుకో వచ్చు. దానివల్ల అర్థం కూడ సరిపోతుంది.

**(2) ఆవట్టఏ :**

మోత్తం పయ తోయ సమం
సారిచ్ఛం జం న హూఇ కిం తేణ,
అహియాఏఇ మిలంతం
ఆవఇ **ఆవట్టఏ** పఢమం. (67)
(మైత్రం పయస్తోయ సమం
సదృశం యత్ న భవతి కిం తేన,
అధికాయతే మిలత్
ఆపద్యావర్తతే ప్రథమమ్.)

ఇది భర్తృహరి నీతి శతకంలో మైత్రిని వర్ణించిన పద్యం వంటిది. మైత్రి — పాలు నీరు కలయిక వంటిది కాకపోతే మరెందుకు? పాలు, నీరు చెరితే పరిమాణం ఎక్కువవుతుంది. అపద వచ్చినప్పుడు - వేడి కలిగినప్పుడు వట్టిపోతుంది - కలిసి కాగి తగ్గిపోతుంది.

ఈ గాథలోని అపట్టఏ అనే పదాన్ని వ్యాఖ్యాతలు అవర్తే ప్రథమం ఆయాతి తోయం అని వ్యాఖ్యచేశారు. కాని అర్థం స్పష్టంగాలేదు. ఆచార్య పట్వర్ధన్ దీనిని "ఆటణే, అటూణజాణే in the sense of evaporated" అని అర్థం చెబితే బాగంటుందని" సూచించారు. పెక్కు క్రియలుకూడ దేశీపి, ప్రాకృతంలో చేరాయని ఆచార్య హేమచంద్రుడు చెప్పాడు గనుక, ఈ అవట్టఏ కూడ వట్టు, వట్టిపోవు అనే తెలుగు ధాతువు కావచ్చునని తోస్తుంది. పాలు, నీళ్ల కలిసినప్పుడు ఎక్కువవుతాయి. నిప్పు తగిలినప్పుడు, కష్టాలు కలిగినప్పుడు, కాగికాగి వట్టిపోతాయి.

కనుక ఆవట్టేఇ అనేది అవర్తతే అనేదికాక, అఙ్ ఉపసర్గ పూర్వక మయిన పట్టు ధాతువేనని తోస్తుంది. అర్థం కూడా కుదురుతుంది.

**(3) ఓ :**

ఓ ఛిప్పఇ మండల మా
రుఏణ గేహంగణాఉ వాహీఏ,
సోహగ్గ ధయవడాఇ
వ్వ ధణురఓ రుంప రించోళీ. (207)

(అహో ? క్షిప్యతే మండల
మారుతేన గేహాంగణాత్ వ్యాధ వధ్వాః,
సౌభాగ్య ధ్వజ పటానీవ
ధనూరజస్త్వక్‌పఙ్క్తిః)

కొత్త కాపురం. వీరవ్యాధ కుమారుడు కొత్త మోజులో ఉన్నాడు. కనుక, నవవధువును విడనాడలేకపోతున్నాడు. దానివల్ల చిక్కిపోయాడు. మునుపటి ధనువును ఎత్తలేకపోయాడు. కనుక ధనువును చెక్కసాగింది బోయత. చెక్కిన ధూళి ఇంటిపైకి ఎగిసి, ఆమె సౌభాగ్య విజయధ్వజ పటం వలె కనిపిస్తున్నదట.

ఈ గాథ మొదటి చరణంలోని ఓ మన వివఏ. ఈ పదం ఆశ్చర్య సూచక అవ్యయంగా ప్రయుక్తం. ఇది 265, 324, 415, 442 గాథలలోను ప్రయుక్తమైంది.

ఓ అహో! అనే సంస్కృతావ్యయానికి నిపాత మన్నారు ప్రాకృత వేత్తలు. తెలుగులో ఓ అనే మాటకు పెక్కు అర్థాలున్నవి. వాటిలో ఆశ్చర్యార్థము కూడ ఒకటి. ప్రాకృతంలో నిపాతంగా గ్రహించారు గనుక, ఇది తెలుగుపదమని మనం గట్టిగానే చెప్పవచ్చు.

రుంప పదానికి రంపపు పొట్టు అనే అర్థం ఇదివరకే చెప్పాను.[7]

## (4) కసరక్కా :

తే గిరి సిహరా తే పీలు
పల్లవా తే కరీర కసరక్కా,
లబ్భంతి కరహ మరువిల
సియాఇ కత్తో వణేత్థమ్మి. (221)

(తే గిరిశిఖరాః తే
పీలుపల్లవాస్తే కరీర కుడ్మలాః,
లభ్యంతే కరభ మరువిల
సితాని కుతో వనేత్ర.)

ఇదొక అన్యాపదేశం. ఓ లొట్టిపిట్టా! నీవు ఎడారిజంతువు. ఎడారిలోని గుట్టలు, గొలుగుచెట్టుచిగుళ్లు, వెణుతురు మొగ్గలు ఎక్కడ వుంటాయి ఇక్కడ ? ఇది వనం! ఎడారి విలాసాలు ఉండవు గదా !



ఈ గాథ రెండవ పాదంలోని కసరక్కా విచిత్రంగా వినిపిస్తున్నది. కసరక్కా అనే దానికి కుడ్మల అని వ్యాఖ్య. కుడ్మల మంటే మొగ్గ. దీనికి చర్వణాశబ్దః - నెమరువేసేప్పటి ధ్వని అని, తినేప్పుడు కలిగే శబ్దమని కూడ హేమచంద్రుడు తెలిపాడు.[8] అనుకరణ ధ్వని కావచ్చు. కాని, కసుగాయలు అంటే మరికొంత ఉచితంగా వుంటుంది.

తెలుగులో కసుడు, కసురు, కసు, కసరు అనే పదాలు లేత అనే అర్థంలో ఉన్నాయి. కసుగాయ గరచిచూచిన - అని సుమతి శతకం. వెణుతురు కసుగాయలు ఇక్కడ ఎక్కడున్నాయి - అంటే అర్థానికి భంగం వుండదు. కన్నడంలోను కాయ గసురు, కసుగాయి అనే పదాలున్నవి. కసి, కహి అంటే చేదు, ఒగరు. పండనికాయలు ఒగరొగరుగా, చేదుచేదుగా ఉంటాయి. కసి - కహి నుంచి కసు, కసురు రూపొంది వుంటాయి.

అందువల్ల కసరక్కా, కసురుగాయలనే తెలుగు మాటకు వికృతి కావచ్చును.

## (5) తలినేహిం :

మదహల్లియాఇ కిం తుహ
ఇమాఇ కిం వా దలేహి తలినేహిం,
అమోఏ మహుయర మా
లఈఇ జాణిహిసి మాహప్పం. (231)

(లఘుతయా కిం తవైతస్యాః
కిం పత్రైః తలినైః,
ఆమోదే మధుకర
మాలత్యా జ్ఞాస్యసి మాహాత్మ్యమ్.)

ఆకారంకన్నా యోగ్యతకే ప్రాధాన్యమని కవి హృదయం.

ఓ! మధుకరమా మాలతి చిన్నగా ఉందని అనుకోకు. ఆకులు, చిగుళ్లు ఎలావుంటె ఏమి? గుబాళింపులో గదా గొప్పదనం తెలుస్తుంది.

ఈ గాథ రెండవ పాదంలోని తలినేహిం అనే పదం మనకు చర్చనీయం. దీనికి వ్యాఖ్యాతలు విరళైః స్తోకైః (దట్టంగా లేనివి లేక చిన్నవి) అని అర్థం చెప్పారు. అనగా చిన్నవి. మాలతి చిన్నగా వుంటే ఏమి? అనడంలో చిన్నదనే భావం మొదట ఉంది. మరల పత్రైఃతలినైః — చిన్న ఆకులు అని చెప్ప

నక్కరలేదు. దాని ఆకులు ఎలా వుంటే ఏమి? దాని చిగుళ్ళు ఎలా వుంటే ఏమి? — అనడం బాగుంటుంది. చిగుళ్ళు చిన్నవి గనుక, చిన్న అనే అర్థం ఈ పదానికి తర్వాత వచ్చి వుంటుంది.

మొదట్లో చెప్పినట్టు ఒ మదురకరమా, మాలతి ఆకారం చిన్నగా వుంటే ఏమి? దాని ఆకులు ఎట్లుంటే ఏమి? చిగుళ్ళు ఎట్లుంటే ఏమి? సుగంధం కదా మనకు కావలసింది! అని తలిన శబ్దానికి చిగుళ్ళు అని అర్థం చెబితే బాగుంటుంది.

తెలుగులోను, తెనుగు తోబుట్టువులలోను తలిర్, తలిరు, తళిర్ అనే పదాలు చిగురుటాకు అనే అర్థంలో వున్నాయి. ఈ తలిరు — తళిరే తలినగా ప్రాకృతంలో ప్రవేశించి వుంటుందని భావిస్తున్నాను.

## (5) విసూరణం :

జత్థ న ఉజ్జాగరఓ
జత్థ న ఈసా విసూరణం మాణం,
సబ్భావచాడుఅం జత్థ
నత్థి నేహో తహం నత్థి. (333)

(యత్ర నోజ్జాగరకో
యత్ర నేర్ష్యా ఖేదో మానః,
సద్భావ చాటుకం యత్ర
నాస్తి స్నేహః తత్ర నాస్తి.)

ఎక్కడయితే మేల్కొని కాచుకూర్చోడాలు, అసూయ, రుసరుసలు, బింకాలు, మంచి మనస్సుతో ముచ్చట్లు ఉండవో, అక్కడ స్నేహం ఉండదు— అంటాడు మనస్తత్వవేత్త అయిన కవి. స్నేహ మున్నప్పుడే మేల్కొవడాలు, మూతి విరుపులు, రుసరుసలు, మూతి బిగింపులు, మురిపాలు, ముచ్చట్లు వుంటాయి.

ఈ గాథ రెండో పాదంలోని విసూరణం అనే పదం చూద్దాము. దీనికి ఖేదః అని వ్యాఖ్యాతలు అర్థం చెప్పారు. ఖిద్ ధాతువుకు జూర, విసూర అనేవి ఆదేశాలు అవుతాయని — హేమచంద్రు డన్నాడు.[9] ఆదేశం అనడాన్నిబట్టి ఇది అన్యభాషా పదమని మనం అనుమానించవచ్చు. తెలుగులో ఉస్సు, ఉస్సురు, ఉసురు, ఉసూరు, ఉసురుసురు, ఉస్సురుస్సురు అనే పదాలు తాప సూచకాలు చాల వున్నాయి. ఇవి నిట్టూర్పుల ధ్వన్యనుకరణ వాచకాలూ కావచ్చు. తెలుగువారి నిత్యవ్యవహారంలో ఇది వుంది గనుక, విసూరణం తెలుగు అనే అందాము.



## (7) దే :

## (8) నడిజ్జసు :

అగ్ఘాహి మహుం దే గేణ్హ
చందణం అసుణి సుణసు మహ వయణం,
మాణేణ మా నడిజ్జసు
మాణంసిణి గలఇ ఛణరాఈ. (351)

(అజిఘ్ర మధు హే గృహాణ
చన్దన మనాశ్రవే శృణు మమ వచనమ్,
మానేన మా నట్యస్వ
మనస్విని గలతి క్షణరాత్రిః.)

ఇదిగో! ఎవరిమాటా వినని అమ్మాయీ? నామాట విను. మధువు వాసన చూడు (ఆస్వాదించు). చందనం అలదుకో. నీవు మనస్వినివి — అభిమానినివి. ఉత్సవరాత్రి గడిచిపోతున్నది. బింకంతో నలియకు — బాధపడకు — అని ఒక సఖి బింకం చూపుతున్న తన నెచ్చెలికి హితవు చెబుతున్నది.

ఈ గాథ మొదటి పాదంలోని దే అనే పదం, మూడవ పాదంలోని నడిజ్జను అనే పదం పరిశీలిద్దాము. (సంఖడిఓ — సన్నటితః — 342).

'దే' అనే దానికి వ్యాఖ్యాత అర్థం చెబుతూ, "దే ఇతి ప్రార్థనాయాం. నిపాతః" అన్నాడు. దే అనేది ఆమంత్రణ, సమ్ముఖీకరణాలలో నిపాతమని హేమచంద్రుడన్నాడు.[10] నిపాతమనడంవల్ల సంస్కృతంలో అకరం లభించ లేదనే కదా!

తెలుగులో సమ్ముఖీకరణ ఆమంత్రణాలలో ఇదా, ఇందా, ఇదో, ఇదిగో అనే మాటలు ఉన్నాయి; తెలుగు తోబుట్టువు లన్నిటిలోను ఉన్నాయి. ఈ ఇదా, ఇందాయే ప్రాకృత సహజమైన ఏఓలతో దే అని రూఢముయిందేమో నని అనుమానిస్తున్నాను.

నడిజ్జసు అనే పదానికి నట్యస్వ అని వ్యాఖ్య. కాని అర్థం స్పష్టం కాలేదు. నటించవద్దు. వగలు పడవద్దు అని భావమేమో! వగలు పడవద్దు అనేది దూరార్థం. హేమచంద్రుడు నడ అనేది గుప్ ధాతువుకు ఆదేశంగా చెప్పాడు;[11] కలతపడు, చీకాకుపడు అనే అర్థాలు చెప్పాడు. దేశీనామమాలలో వఞ్చిత, ఖేదిత అనే అర్థాలు ఇచ్చాడు.[12] నిపాతమనడాన్నిబట్టి, దేశీనామమాల గ్రహించడాన్నిబట్టి ఇది తెలుగు పదమని భావిస్తున్నారు.

తెలుగులో నలియు, నలి అనే పదాలు ఉన్నాయి. నలి—రోగం, పాకి, చిన్నది, నలిగినది, సన్నని అనే అర్థాలున్నాయి. నలియు—నలగు; బాధపడు.

తెలుగు నలి ప్రాకృతంలో చేరి వుంటుంది. దానిని హేమచంద్రుడు కొన్ని ధాతువులకు ఆదేశంగా గ్రహించాడు. ఎందుకు నలిగిపోతావు? బాధ పడుతావు. నా మాటవిను—అని అర్థం.

## (9) సాహేఇ:

ముహరా ఓచ్చియ పయడఇ
జో జస్స పిఓ కిమేత్థ భణిఏణ?
సాహేఇ అంగణం చియ
ఘరస్స అబ్బంతరే లచ్ఛిం. (403)

(ముఖరాగ ఏవ ప్రకటయతి
యో యస్య ప్రియః కి మత్ర భణితేన?
కథయ త్యంగణ మేవ
గృహస్యా భ్యన్తరే లక్ష్మీమ్.)

మాట లెందుకు? ఎవరు ఎవరికి ప్రియుడో ముఖం రంగులే తెలుపుతాయి; ఇంటి సంపదను ముంగిలే చాటుతుంది గదా!

ఈ గాథ మూడవపాదంలోని సాహేఇ అనే మాటకు కథయతి అని వ్యాఖ్య. సాధయతి దీనికి మూలమయితే అర్థమే వేరవుతుంది.

తెలుగులో చాటు అనే ధాతువు వుంది. కన్నడంలో సారు. పటహాది వాద్య ధ్వనితోపాటు ప్రచారం చేయడం. తెలుగు చాటు- చాట్టు-సాహు అయి వుంటుందని ఊహిస్తున్నాను.

## (10) సుణహిల్లియా:

అచ్ఛఉ తావ సవిబ్భమ
కడక్ఖ విక్ఖేవ జంపిరీ దూఈ,
తగ్గామ కుడిల సుణహి
ల్లియా వి దిట్ఠా సుహావేఇ. (420)

(ఆస్తాం తావత్సవిభ్రమ
కటాక్ష విక్షేప జల్పనశీలా దూతీ,
తద్గ్రామ కుటిల శునక్యపి
దృష్టా సుఖయతి.)



ఒక రసికునికి తన ప్రియురాలున్న ఊరంటేనే ఆనందం. అక్కడి వారంతా రంభలే. కనుకనే తన నెచ్చెలితో అంటాడు: కడగంటి చూపులు విసురుతూ నోరంతా మాట్లాడే ఈ దూతి సంగతి ఉండనీవోయ్! ఆ వూరి వికారమైన ఆడకుక్క కూడ చూస్తే హాయి కలిగిస్తుంది.

ఈ గాథలోని మూడు నాలుగు పాదాలలోని సుణహిల్లియా అనే పదానికి శునకి అని అర్థం చెప్పారు. శునక+ఇల్ల+యా=స్వార్థంలో ఇల్ల,యా అనే ప్రత్యయాలు చేరి శుణహిల్లియా అయిందని ఆచార్య పట్వర్ధన్ వ్యాఖ్యానించారు.[13] హేమచంద్రుడు స్వార్థే కశ్చవా (చకారాత్ డిల్లడుల్లే)[14] అని ప్రత్యయాలు విధించాడు. దీనితో శుణఇల్లియా అయి, ఇకారం ఒత్తి పలకడంలో హి అయి శుణహిల్లియా అయిందన్నాడు.

పరిశీలించిచూస్తే సంస్కృత పదంతో తెలుగుపదం చేరిందని, తెలుగు పదమేమిటో వింగడించుకోలేని ప్రాకృతజ్ఞులు దానిని ప్రత్యయంగా భావిండా రేమో నని అనిపిస్తుంది. శుణహిల్లియా-అనే పదం శుణ+పిల్లియా అనే మిశ్రమ సమాసమనుకుంటాను. పిల్ల, పిల్లె, పిళ్లె అనేవి తెలుగు, తెలుగు తోబుట్టువులలో చిన్నపిల్లలకు వాడే మాటలు. పిల్ల-పిల్లె పదం ప్రాకృతంలో చేరిపోయింది. దానిమూలం తెలియక ప్రత్యయంగా విధించుకున్నాడు హేమచంద్రుడు అనిపిస్తుంది. ఆ వూరి వంకర టింకర కుక్కపిల్ల కూడ బాగుంటుందోయ్!- అందే అర్థం మరింత రంజకంగాను వుంటుంది.

కనుక శుణహిల్లియా-కుక్కపిల్ల అని భావిస్తున్నాను. పకారం హ కావడం పలు భాషలలో వుంది.

## (11) చంపిఉఊణ :

తహ చంపిఉఊణ భరియా
విహిణా లావణ్ణఏణ తణుయంగీ,
జహ సే చిఉర తరంగా
అంగుళి మగ్గవ్వ దీసంతి. (314)

(తథా నిపీడ్య భృతా
విధినా లావణ్యేన తన్వంగీ,
యథా అస్యాః చికుర తరఙ్గాః
అఙ్గుళి మార్గా ఇవ దృశ్యంతే.)

ఇదొక గొప్ప గాథ. మనం సంచులలోగాని, కుండలలో గాని వస్తువు

లను అదిమి అదిమి పెట్టేటప్పుడు పైన మన వ్రేళ్ళ గుర్తులు కానవస్తాయి. దీనిని కవి ఒక ఉత్ప్రేక్షలో గొప్పగా ఇమిడ్చాడు.

ఆమె లావణ్యమయి. బ్రహ్మ ఆమెలో లావణ్యాన్ని కూరి కూరి, అదిమి అదిమి పెట్టాడు. అదిమిన వ్రేళ్ళ గుర్తులే తలమీది కుటిల కుంతలాలు.

ఈ గాథ మొదటి పాదంలోని చంపిడీణ అనే పదం చర్చనీయం. దీనికి వ్యాఖ్యాత న్యఙ్క్రృత్య అని అర్థం వ్రాశాడు. నిపీడ్య-పీడించి అని వివరణ. చంప అనేది పీడ ధాతువుకు ఆదేశమని హేమ చంద్రుడన్నాడు.[16] ఆదేశం అనడాన్నిబట్టే ఇది అన్యభాషాపదమని, అకరం తెలియనందున ఆదేశంగా పరిగణితమని స్పష్టం.

తెలుగులో చొనుపు అనే ధాతువు వుంది. దీనికి చొప్పు, చొప్పించు, జొనుపు రూపాలున్నవి. దీని అర్థం బలవంతంగా దోపడం. ఈ చొనుపే-చొంపు, చంపగా ప్రాకృతంలో చేరి ధాత్వాదేశమయిందని ఊహించవచ్చు.

చంపణ మరొగాథ లోను (431) ప్రయుక్త మయింది. కరిచలణ చంపణుచ్చలియ-కరిచరణ పీడనోచ్చలిత. ఇక్కడ చంపణ పదానికి ఆక్రమణం-అని వ్యాఖ్యానం.

## (12) ధుక్కోడియా:

దఇయా దంసణ తిణ్హా
లుయస్స పహియస్స చిరణియ త్తస్స,
నయరాసణ్ణే ధుక్కోడియావి
హిఅఏ న మాయంతి. (445)

(దయితా దర్శన తృష్ణాలోః
పథికస్య చిరనివృత్తస్య,
నగరాసన్నే సంశయా అపి
హృదయే న మాంతి.)

ప్రవాసితుడు చాలకాలం తర్వాత ఊరికి తిరిగి వస్తున్నాడు. భార్యను చూద్దామనే ఆత్రం విపరీతంగా ఉంది. ఊరు దగ్గరయిన కొద్దీ అతని గుండె ధుకధుకలాడుతున్నది-ధుకధుకలు అణగడంలేదు.

ఈ గాథ మూడోపాదంలోని ధుక్కోడియా అనే పదానికి ధుగధుగితాని సంశయాః అని వ్యాఖ్య. ఈ మాటను దేశీనామమాల గాని, పాఇఅలచ్ఛీ నామమాల గాని గ్రహించలేదు. గుండెదడకు అనుకరణమని వదలి వేశాయేమో!



తెలుగులో ధుగధుగలాడు, తుకతుకలాడు అనే మాట లున్నాయి. ఇవి సంశయాన్ని తెలిపేవి. తుకతుక, ధుకధుక ధుక్కోడియాకు మూలం కావచ్చును. గాథాసప్తశతిలో ధుక్కాదుక్కఇ గుండె దడదడలాడుతున్నది అనే అర్థంలో ఉంది.[16]

## (13) గర్గర:

తే ధణ్ణా గురుణియం
బబింబ భారాలసాహి తరుణీహిం,
ఫురియాహర దర గగ్గర
గిరాహి జే సంభరిజ్జంతి. (446)

(తే ధన్యా గురునితంబ
బింబ భారాలసాభిః తరుణీభిః,
స్ఫురితాధర దర గద్గద
గీర్భిః యే సంస్మర్యంతే.)

పెద్ద పిరుదులతో నెమ్మదిగా నడుస్తూన్న అందమైన స్త్రీలు పెదవులు కదలిస్తూ కొద్దిగా గరగరలాడే గొంతులోనే స్మరించే పురుషులు ధన్యులు.

ఈ గాథలోని మూడవ పాదంలోని గర్గర శబ్దానికి గద్గద అని వ్యాఖ్య. గద్గదలోని దకారాలకు రేఫ వచ్చిందని హేమచంద్రుడు అన్నాడు. దానివల్ల గర్గర అయిందట.[17]

ఇది గరగర అనే తెలుగు పదమని భావిస్తున్నాను. గొంతు గరగర లాడుతున్నది అని ప్రయోగం. ఈ గరగరే గగ్గరగా ప్రాకృతంలో ప్రవేశించి వుంటుంది. గగ్గర పదస్వరూపంలోని వ్యాకరణ కార్యం కూడ తెలుగుదే - చెర+చెర=చెచ్చెర లాగ, గర+గర గగ్గర.

## (14) తవణిం:

తుచ్ఛం తవణిం వి ఘరే
ఘరిణీ తహ కహ వి నేఇ విత్థారం,
జహ తే పి బంధవా జల
ణిహివ్వ ధాహం న యాణంతి. (456)

(తుచ్ఛం భక్ష్యకణమపి గృహే
గృహిణీ తథా కథమపి నయతి విస్తారం,

యథా తేపి బాంధవాః
జలనిధేరివ తలం న జానంతి.)

పాపం! ఆ ఇల్లాలు చాల సమర్థురాలు. చిన్న తినుబండారం ముక్కనైనా అందరికీ అందేట్టు చేస్తుంది. సముద్రం లోతు తెలీనట్టుగా, బంధువులకు ఆ ఇంటిగుట్టే తెలీదంలేదు.

ఈ గాథ ప్రథమ పాదంలోని తవణిం అనే మాటను భక్ష్య కణం అని వాఖ్యానించారు వ్యాఖ్యాతలు. హేమచంద్రుడు తవణిం, తవణి అనే రెండు పదాలను స్వీకరించి, భక్షణయోగ్య కణాది అని అర్థమిచ్చాడు.[18]

దేశీనామమాలలో హేమచంద్రుడు దీనిని గ్రహించడంవల్ల ఇది సంస్కృత ప్రాకృతేతరమనేది రూఢం. కనుక ఇది తరవాణి మెతుకు అనే సమాస పదంలోని పూర్వభాగ మనుకుంటాను. తరవాణి పద్ధతి, పులిసీళ్ళ పద్ధతి తెలుగు తమిళ దేశాలలో సహస్రాబ్దాలుగా వున్న పద్ధతి. చిన్న మెతుకును గూడ అందరికీ అందేట్టు చేస్తుంది ఇల్లాలు అని అర్థంకూడ గృహిణి సమర్థతకు తార్కాణ మవుతుంది.

## (15) విలయా:

## (16) ఉబ్బేఉ:

**ఉబ్బేఉ** అంగులిం సా
**విలయా** జా మహ వఇం న కామేఇ?
సో కో వి జంవఉ జువా
జస్స మవే పేసియా దిట్ఠీ? (463)

(ఊర్ధ్వీ కరోత్వంగుళిం సా
వనితా యా మమ పతిం న కామయతే,
స కోపి కథయతు యువా
యస్య మయా ప్రేషితా దృష్టిః.)

నా మగనిని కామించని ఆడదెవరో వేలు పైకెత్తనీ! నేనెవరినైనా ఒక్కసారి కన్నెత్తి చూచానేమో ఏ యువకుడైనా చెప్పనీ! – అంటుందొక గరిత.

ఈ గాథ రెండవ పాదంలోని విలయా అనే పదానికి వనితా అని వ్యాఖ్య. హేమచంద్రుడు వనితా పదానికి విలయా నిపాత మన్నాడు.[19] నిపాతం



కావడాన్ని బట్టే ఇది దేశిపదమని స్పష్టం. వ్యాఖ్యాత కూడా "వనితాయాః విలయా ఇతి ప్రాకృత సూత్రేణ నిపాతః" అన్నాడు.

ఇది తెలుగు వెలయాలు పద వికారమేమోనని అనుమానిస్తున్నాను. వెలయాలు వేశ్య, లంజ. నా మగనిని కామించని వెలయాలు – లంజ ఎవ్వతో వేలెత్తనీ! అని అంటే మరింత సహజంగా వుంటుంది.

ఈ గాథ మొదటి పాదంలోని ఉబ్బేఉ అనే పదానికి ఊర్ధ్వీకరోతు అని వ్యాఖ్య. అనగా ఎత్తనీ అని అర్థం. ఊర్ధ్వకు ఉబ్బ ఆదేశంగా హేమ చంద్రుడు చెప్పాడు.[20] ఉద్ధ, ఉద్ధ అనే రూపాలూ చెప్పాడు.

ఇది తెలుగు పదమని తోస్తుంది. తెలుగులో ఎక్కువగు అనే అర్థంలో ఉబ్బు, ఉబుకు, ఉప్పు, ఉప్పొంగు, ఉప్పెన మున్నగు పదాలున్నవి. ఈ ఉప్పు, ఉబ్బే ప్రాకృత ధాతువు ఉబ్బ అయివుంటుంది. ఊర్ధ్వనుంచి ఊర్బ—ఉబ్బ దూరప్రయాణం.

## (17) కాణా :

పేక్ఖహ మహాణు చోజ్జం
కాణా ఘరిణీఇ జం కయం కజ్జం,
చుంబేవి నలఘు నయణం
ఝుడిత్తి నీసారిఓ జారో. (475)

(ప్రేక్షధ్వం మహాశ్చర్యం
కాణ గృహిణ్యా యత్కృతం కార్యం,
చుంబిత్వా నలఘు నయనం
ఝుడితి నిస్సారితో జారః.)

చూచారా? ఆ ఒంటికంటివాడి భార్య ఎంత పనిచేసిందో! మగని బాగున్న కంటిని గట్టిగా ముద్దు పెట్టుకుంది; వెంటనే జారుణ్ని ఇంటినుంచి వెళ్ళిపోమంది.

కాణ శబ్దం పూర్తిగా సంస్కృత ప్రాకృతేతరం. తెలుగులో కానని వాడు, తమిళంలో కాణాన్. ఈ కాన– కాణ శబ్దం ప్రాకృతంలో చేరి అక్కడి నుంచి సంస్కృతంలో ప్రవేశించి వుంటుంది. కాణ శబ్ద వ్యుత్పత్తి చింత్యం – Etimology doubtful – అని మోనియర్ విల్లియమ్స్ డిక్షనరీ చెబుతున్నది. కడారాది గణంలోని పదమని కూడా ఆ శబ్దకోశమే చెబుతున్నది.[21]

## (18) బోలఓ :

కిం విహిణా సురలోఏ
ఎక్కా వి న పుంసలిత్తి నిమ్మవియా,

సాహిణో జేణ ససీ
న బోలిఓ నీలరంగమ్మి. (486)

(కిం విధినా సురలోకే
ఏకాపి పుంశ్చలీతి నిర్మాపితా,
స్వాధీనో యేన శశీ
న నిమజ్జితో నీలరంగే.)

బ్రహ్మ స్వర్గలోకంలో ఒక్క చెడిపెను సృష్టించినా, అది చంద్రుణ్ని కూడ నీలిరంగులో ముంచెత్తి వుండేది అని ఈ గాథ అర్థం.

ఈ గాథ నాల్గవ పాదంలోని బోలిఓ అనే పదానికి నిమజ్జితః అని వ్యాఖ్య. ముంచివేయబడిన అని అర్థం. పాఇఅ సద్ద మహాణ్ణవో (ప్రాకృతశబ్ద మహార్ణవః) బోలిఓ – వోలిఓ పదం బ్రుడ్ ధాతువునుంచి వచ్చినట్టు చెబుతున్నది. హేమచంద్రుడు మస్జ్ (టుమస్జో శుద్ధౌ) ధాతువుకు బుడ్డ ఆదేశమని నాడు.[22] ఆదేశ మనగానే ఆలోచించవలసిందేగదా!

తెలుగులో మునుగు, మునుంగు, బ్రుంగు, బ్రుంగుడు అనే పదాలు మజ్జనార్థకంలో ఉన్నవి. ఇవి మునిగేప్పుడు కలిగిన ధ్వనికి అనుకరణ శబ్దాలు కావచ్చు. ఈ బ్రుంగ్, బ్రుంగుడ్ ప్రాకృతంలో బ్రుడ్, బుడ్డ్‌లుగాచేరి, వోలి, బోలి అని మారి వుండవచ్చు.

## (19) ఢలియా :

## (20) ఖరడియం :

ఢలియా య మసీ భగ్గా
య లేహణీ ఖరడియం చ తలపట్టం,
ధిద్ధి త్తి కూడలేహయ
అజ్జ వి లేహ త్తణే తణ్హా. (509)

(స్ఖలితా చ మసీ భగ్నా
చ లేఖినీ ఖరటితం చ తాలపత్రం,
ధిగ్ ధిగితి కూటలేఖక
అద్యాపి లేఖకత్వే తృష్ణా.)

వ్రాయడం రాదు పెట్టదు! సిరా ఒలికిపోయింది. లేఖిని విరిగింది తాళపత్రం ఊరికే మసికర అయింది. ఛీ! ఇంకా రాద్దామనే ఆశ! – అని ఒక



యువతి వ్రాత తెలియని వాడిని ఈసడించుకొంటున్నది. ఇదొక అన్యాపదేశం సురతాసమర్థునిపై.

ఈ గాథ మొదటి పాదంలోని ఢలియా అనే పదానికి స్ఖలితా అని వ్యాఖ్య. అనగా ఒలికిపోయింది. స్థల శబ్దానికి ఢల ఆదేశం కావచ్చును. హేమచంద్రుడు చెప్పలేదు కాని, పాఇఅ సద్ద మహాణ్ణవో గ్రహించి, ఊగు, క్రిందికిపడు, దొర్లు. కదలిపోవు మున్నగు అర్థాలిచ్చింది.

తెలుగులో దొర్లు, దొరలు, దుల్లు, దొల్లు అనే పదాలు పొర్లు, పడు అనే అర్థాలలో ఉన్నవి. దొల్లు-దుల్లు పదమే ఢలిగా ప్రాకృతంలో చేరివుంటుంది.

ఈ గాథ రెండవ పాదంలోని ఖరడియం అనే పదానికి ఖరటితం అని వ్యాఖ్య, కాని, దాని అర్థం స్పష్టంగా లేదు. హేమచంద్రుడు ఖరడిఅ శబ్దానికి, రూక్ష, భగ్న అనే అర్థాలిచ్చాడు.[23] ఇక్కడ ఈ అర్థాలేవీ సరిపోవడంలేదు.

బహుశా ఇది కర అనే తెలుగుపదం మారువేషం అనుకుంటాను. అనవసరంగా తాటాకును కరచేశావు, పాడుచేశావు అని అర్థం కూడ ముచ్చటగా చెప్పవచ్చు.

## (21) పరోహడ:

ధుత్తీరఏణ ధమ్మిఅ
జఇ ఇచ్ఛసి లింగపూరణం కాఉం,
తా ఏజ్జసు మజ్ఝ పరో
హడమ్మి సూరమ్మి అత్థమిఏ. (523)

(ధుత్తూరేణ ధార్మిక
యదీచ్ఛసి లింగపూరణం కర్తుమ్,
తత అగచ్ఛ మమ గృహ
పశ్చాద్భాగే సూర్యేస్తమితే.)

"ఓ ధార్మికుడా, నీకు శివపూజకు ఉమ్మెత్తపూవులు కావాలంటే,సూర్యాస్తమయం తర్వాత నా పెరట్లోకి రా!" అని ఒకతె ధార్మికుణ్ని రెచ్చగొడుతున్నది.

ఈ గాథ మూడు నాలుగు పాదాలలోని పరోహడ అనే పదానికి గృహ పశ్చాద్భాగః అని వ్యాఖ్య. ఈ పదం 524, 525, 526, 527 గాథలలోను ప్రయుక్తం. ఇంటి వెనుకభాగం అని అర్థం. పాఇఅ లచ్ఛీ నామమాల ఘరవాడయం అనే అర్థంలో గ్రహించింది.[24]

ఈ పరోహడ తెలుగు పెరడువలె కానవస్తుంది. తమిళంలో పేర్కడే-పేక్కడే, పెరడు ఇంటి వెనుక ప్రదేశం, దొడ్డి.

## (22) జూరేఇ:

అచ్ఛీహి పఇం సిహిణేహి
దియవరం గురుయణం నియంబేణ,
తిన్నివి జూరేఇ వహూ
న యాణిమో కేణ కజ్జేణ? (614)

(అక్షిభ్యాం పతిం స్తనాభ్యాం
ద్విజవరం గురువరం నితంబేన,
త్రీణ్యపి నిందతి వధూః
న జానీమః కేన కార్యేణ?)

ఇదొక ప్రహేళిక. ఇంటికోడలు మూడింటిని నిందిస్తున్నదట. ఆమూడు కళ్ళు, వక్షోజాలు, నితంబం. భర్త పెద్దలఎడల గౌరవంతో కనిపించడు కనుక కళ్లుండి ఏం ప్రయోజనం అని కళ్ళను నిందిస్తుంది. వక్షోజాలు పెద్దవి కావడంవల్ల ఎవరైనా పెద్దలు-బ్రాహ్మణోత్తములు వస్తే చేతులెత్తి నమస్కారం చేయలేకపోతున్నది. కనుక వక్షోజాలను నిందిస్తున్నదట. ఇంట్లో పనులకోసం అటూ ఇటూ తిరగాలికదా! అప్పుడు, తన నితంబు భారం ఎవరికైనా తగులుతుందేమోనని నితంబాలను నిందిస్తుందట.

ఈ గాథ మూడవ పాదంలోని జూరేఇ అనే పదానికి నిందతి అని వ్యాఖ్య. హేమచంద్రుడు ఖిద్, క్రుధ్ ధాతువులకు జూర ఆదేశంగా చెప్పాడు. ఈ రెండింటికి ఏమైనా సంబంధం వుందా? కనుక ఇది అన్యభాషాపదమై వుంటుంది.

తెలుగులో విసుగు, చిరుకోపం, చీకాకు తెలుపడానికి చుర చుర చూచు, చురచురలాడు, చీదరించు, చీదరగొను, చీదర మున్నగు పదాలున్నవి. ఈ చురచురే జురజుర అయి, జూరగా ప్రాకృతంలో చేరి వుంటుంది.

## (23) ఘురుఘుల్లంతో:

ఘురుఘుల్లంతో రచ్ఛా
ముహేసు వరమహిలియాణ హత్థేసు,
ఖంధార హారి ససఓ
వ్వ పుత్తి దఇఓ న ఛుట్టిహిఇ. (625)

(పరిభ్రమన్ రథ్యాముఖేషు
వరమహిళానాం హస్తేషు,



స్కంధావార హారి శశక
ఇవ పుత్రి దయితో న మోక్ష్యతే.)

ఓసీ! వెర్రిదానా? నీ ప్రియుణ్ణి అదుపులో పెట్టుకో. అతడు వీథుల మొదట్లో తిరుగుతూ, స్కంధావారంలో చిక్కుకుని వెలుపలికి రాలేని కుందేలులాగ ఏ అందగత్తెల చేతుల్లోనో పడిపోతాడు—అని ఒక అమాయకురాలిని ఆమె చెలికత్తె హెచ్చరిస్తున్నది.

ఈ గాథ మొదటి పాదంలోని ఘురుఘుల్లంతో అనే పదానికి పరిభ్రమన్ అని వ్యాఖ్య. భ్రమకు ఘురుఘుల్ల ఆదేశమని తోస్తుంది. హేమచంద్రుడు టిరిటిల్ల, ఢుంఢుల్ల, ఢంఢల్ల మున్నగునవి భ్రమ ధాతువుకు, ఢుంఢుల్ల ఢుంఢోల గవేషియా మొదలయినవి ఆదేశాలని చెప్పాడు.[26] ఘురుఘుల్ల అలాటి ఆదేశం కావచ్చు. స్కంధావారహారి శశక వెంట ఇంటి కుందేలు-వేట ఇంటి కుందేలు.[27]

తెలుగులో దొరలు, దొర్లు, దుల్లు పదాలు ఉన్నవి. ఈ ఘురుఘల్ల వీటి వికారమే అయి వుంటుంది. "నీ ప్రియుడు దొర్లుకుంటూపోయి ఎక్కడో పడిపోతాడు సుమా!" అని గేలిచేసినట్లూ వుంటుంది.

ఇంకా ఎన్నో తెలుగు పదాలు సరిగా నిరూపించవలసి వుంటాయి. ఇది కేవలం ప్రయత్నం మాత్రమే. దీనిలోని వాదబలం కన్నా, ప్రయత్న శ్రద్ధను చూడాలని సహృదయులకు విజ్ఞప్తి.

### అధోజ్ఞాపికలు

1 వజ్జాలగ్గం - 4 గా.
2 వజ్జాలగ్గం - 3 గా.
3 వజ్జాలగ్గం పీఠిక - పుట 21 (ప్రాకృత పరిషద్, అహమదాబాద్)
4 పాముల తెగలకు భారతం సర్పయాగం.
5 వజ్జాలగ్గం - 424 పుట.
6 వజ్జాలగ్గం - 426 పుట.
7 గాథాశప్తసతిలో తెలుగు పదాలు - తిరుమల రామచంద్ర.
8 శబ్దానుశాసనం - 8-4-423.
9 ఖిదేర్జూర విసూరే - శబ్దాను శాసనం - 8-4-132
10 శబ్దానుశాసనం - 8-2-196.
11 శబ్దానుశాసనం - 8-4-150
12 దేశీ నామమాల - 4-18.

13 వజ్జాలగ్గం - 491 పుట.
14 శబ్దానుశాసనం - 8.2.164.
15 తక్ష్యాదీనాం చోల్లాదయః. శబ్దానుశాసనం 8.4.395.
16 గాథా సప్తశతి - 584.
17 శబ్దానుశాసనం - 8.2.219.
18 దేశీ నామమాల - 5.1.
19 శబ్దానుశాసనం - 8.2.128.
20 ,, 8.2.59.
21 Monier Williams Sanskrit - English Dictionary, P. 269.
22 శబ్దానుశాసనం - 8.4.101.
23 దేశీనామమాల - 2.79.
24 పాఇఅ లచ్ఛీ నామమాల - 934.
25 శబ్దానుశాసనం - 8.4.132,8.4.115.
26 శబ్దానుశాసనం - 8.4.161, 8.4.189.
27 చర్చకు గాథాసప్తశతిలో తెలుగు పదాలు - తి. రామచంద్ర.

# ప్రాకృత ప్రకృతి

నేను పుట్టినప్పటి పరిస్థితి ఏమిటో చెప్పలేను. నా మనస్సు కళ్ళు తెరిచే వేళకు చుట్టూ చీకటి, కారు చీకటి. తలఎత్తి పైకిచూస్తే ఒక చిన్న చుక్క. దానిని అంటిపెట్టుకొని ఏడు పెద్దచుక్కలు తిరుగుతున్నట్టు కనిపించేది. చిన్న చుక్క కదలకుండా ఉండేదనుకుంటాను. ఆ చీకటిలో - కారు చీకటిలో ఎంతకాలం ఉన్నానో చెప్పలేను. కాలగణనకు అవకాశమేదీ? చలి! చలి! వర్షాలు! మంచు వానలు, గాలి వానలు! ఉరుములు మెరుపులు! ఉన్నవాళ్ళం ఒకరిని ఒకరం అంటి పెట్టుకొని గడపవలసి వచ్చేది. ఎంతకాలం గడిచిందో! కొంత కాలానికి లేత ఎర్రటి వెలుగు - బంగారు ఎరుపుతో, ఎరుపు పసుపు బంగారాల రంగుతో వెలుగు. ఆ వెలుగు మాకు ఎంత చైతన్యం కలిగించిందో! ఎంత వెచ్చదనం ఇచ్చిందో! వెచ్చదనం కన్నా, కొత్త ప్రపంచాన్నే ముందు పెట్టింది. ఏవేవో కొత్త వస్తువులు! జనం హడావుడి! పనులు త్వరగా చక్కబెట్టుకుందామనే తొందర! అలా ఎంతకాలం ఎర్ర వెలుగులో, పసిమి వెలుగులో ఉన్నామో! మళ్ళీ చీకటి—కారుచీకటి. కాళరాత్రి అన్నారు మా పెద్దలు. అప్పుడు మా గుంపులో ఒకరైన కాణ్వులు ఈవిధంగా స్తోత్రం చేశారు:

సహ వామేన న ఉషో దుహిత ర్దివః,
సహ ద్యుమ్నేన బృహతా విభావరి రాయా దేవి స్వతీ.
(1-48.1)

ఓ దివో దేవత పుత్రికా! ఓ ఉషోదేవీ! కాంతి ప్రసాదించు. గొప్ప వెలుగును అనుగ్రహించు. ఓ విభావరీ! కాంతి విశేషంగా ఉన్నదేవీ! సకల వస్తువులూ ప్రసాదించు. ఈ చీకట్లను తొలగించు.

వ్యుచ్ఛంతీ హి రశ్మిభిః విశ్వ మాభాసి రోచనమ్,
తాం త్వా ముషః వసూయవో గీర్భిః కణ్వా అహూషత.
(1-49.4)

ఓ ఉషోదేవీ! నీవు కాంతులను ప్రసరింపజేస్తూ, విశ్వాన్ని వెలిగింపజేస్తున్నావు. అందువల్లనే వస్తువులను - జీవికోపయోగి వస్తువులను కోరే కాణ్వులు నిన్ను సూక్తులతో స్తోత్రం చేస్తున్నారు.

మేమంతా ఆ ఉషస్సును ఆ విధంగానే కొనియాడుతూ ఉండేవాళ్ళం.

ఈ చీకట్లలో, ఈ ఉషఃకాంతిలో మనుగడ సాగిస్తున్నంతకాలం వానలకు, గాలులకు పిడుగులకు బాధపడుతూనే ఉన్నాం. వాటికి కారణమని మేము అనుకున్న దేవతలను - ఇంద్రుణ్ని - వరుణుణ్ని - సకల దేవతలను_ విశ్వేదేవులను స్తోత్రం చేస్తూనే ఉన్నాం.

చలి! చలి! ఎముకలు కొరికే చలి! ఈ చలిపోవడానికి ఏమి చేయాలి! దూరంగా అడవులలో చెట్ల రాపిడికి మేఘాలలో కనిపించే కాంతులవంటిది పుట్టడం, మండటం, మేఘాలవంటి పొరలు వ్యాపించడం చూశాము. దాని దగ్గరకు వెళ్ళినవారు చలిపోయి హాయిగా ఉందన్నారు. ఆ అగ్ని-ఆ కాంతి. కింది నుంచి పైకి వెలిగే కాంతి, అడవుల కట్టెల రాపిడితో పుట్టి మండే కాంతి, మా దగ్గరకు వచ్చి, మేమంతా సుఖంగా వెచ్చగా చలి బాధ తొలగిపోడం ఎలా?

మాలో కొందరు ఆలోచించారు. వారే విశ్వనరులు - విశ్వాసరులు. వారు అడవి కర్రలు మండుతున్నప్పుడు వెళ్ళారు. వాటిని గుంపు వద్దకు తెచ్చారు. కర్రలు పడుతూ ఉంటే, సమిధలు వేస్తూవుంటే, అడవిలో లాగే మాదగ్గరా ఆ మంటలు ఎడతెగకుండా ఉంటాయని తెలిసింది. మంటలు ఆరకుండా సమిధలు సమర్పిస్తూ ఆహితాగ్నులయ్యాం. ఆ కాంతి వైశ్వానరుడు.

అగ్ని మాకు అన్ని విధాల ఉపయోగిస్తున్నాడు. ముందుకు సాగిపోతున్నాం. చీకటి కాళరాత్రులలో అగ్ని మాకు మార్గదర్శకుడవుతున్నాడు. క్రూరమృగాలో, శత్రువులో పైబడినప్పుడు ఆయుధంగా ఉపయోగిస్తున్నాడు. ధైర్యంగా, విశ్వాసంతో ముందుకుపోతున్నాం. కొత్త కొత్త విషయాలు తెలుస్తున్నాయి. కొత్త ప్రాంతాల పరిచయం అవుతున్నది. వైశ్వానరుడయిన అగ్ని మాకు జాతవేదనుడయ్యాడు. అన్నిటినీ ఉషఃకాంతులలో లాగ స్పష్టంగా కనిపింపజేస్తున్నాడు. మా అందరినీ జీవింపజేయడంవల్ల అనలుడయ్యాడు. కొత్త వస్తువులు సంపాదించుకొనడానికి కారణం కావడంవల్ల ధనంజయుడయ్యాడు. చీకటి రాత్రులలో ఉషస్సు కాంతులను వెదజల్లడంవల్ల ఉషర్బుధుడయ్యాడు. అతని కాంతులవల్ల మేము ధనాన్ని-వస్తు సముదాయాన్ని కనుగొని స్వాయత్తం చేసుకొంటూ, సంఘాన్ని పోషిస్తూ ముందుకు పోవడంవల్ల విభావసుడయ్యాడు. ఇంద్రుడు, వరుణుడు, తక్కిన దేవతలకు మా దగ్గరి అగ్ని మూలంగా మా సేవలు అందించగలమనుకున్నాము. అగ్నిలో వేల్చి, తద్వారా దేవతలను అందరినీ సంతృప్తిపరచడానికి పూనుకున్నాం. అప్పుడు మాలోని పరాశరుడనే పెద్ద, శక్తి కుమారుడు అగ్నిని ఈవిధంగా స్తోత్రం చేశాడు:-



వనేషు జాయుః మర్తేషు మిత్రో
వృణీషే శ్రుష్టిం రాజేవాజుర్యమ్,
క్షేమో న సాధుః క్రతుర్న భద్రో
భువత్ స్వాధీః హోతా హవ్యవాట్. (1-67-1)

ఓ అగ్నిదేవా! వనాలలో-అరణ్యాలలో పుట్టినావు. మానవులకు మిత్రుడవైనావు. సంఘపు పెద్దల పనులు చేస్తున్నావు. హోతవయినావు. క్షేమం కలిగిస్తున్నావు. దేవదూతవై అన్నిపనులూ చేస్తున్నావు. గొప్పగా వెలుగుతున్నావు.

ఒకే చోట ఉండవేము గదా! కొత్త విషయాలు తెలుసుకోవాలి. కొత్త విషయాలు కొత్త ప్రదేశంలో ఉంటాయి. దానికి అగ్నే మార్గదర్శకుడు. అతనివల్లనే మేము ఎన్నో విషయాలు తెలుసుకుంటున్నాము, కనుక అతనిని స్తుతిస్తూ బయలుదేరాం:

అగ్నే నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయనాని విద్వాన్,
యుయోధ్యస్మ జ్జుహురాణ మేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ.

ఓ అగ్నిదేవా! మమ్మల్ని ఐశ్వర్యం - అనేక వస్తు సముదాయం సమృద్ధిగా లభించే మార్గంలో తీసుకువెళ్ళు. నీవు సకల ప్రశస్త విషయాలు తెలిసినవాడివి. మాకు కష్టం కలిగించే, మా పనులకు విఘ్నం కలిగించే లోపాలను, పాపాలను తొలిగించు - తీసిపారేయి. నీకు బహు విధాలుగా నమస్కారాలు చేస్తాము.

మా గమనం-పయనం మరి కొంత కిందికి సాగింది. ధ్రువ నక్షత్రం' సప్తఋషులతో పాటు మరికొన్ని నక్షత్రాలు కనిపించాయి, ఉషస్సు కాంతి సన్నగిల్లి ంది. అదిగో! ఆదిగో! ఆశ్చర్యం! ఎరుపు పసుపు కాంతుల పెద్ద బిళ్ళ వంటిది కనిపించింది. నిండుగా ఉంది. తరిగిపోవడం లేదు. కొంతకాలం కవిపించి, కొంతకాలం కనిపించక పోతున్నది.

పూర్ణ మిదం పూర్ణమదః
పూర్ణా త్పూర్ణ ముదుచ్యతే,
పూర్ణస్య పూర్ణ మాదాయ
పూర్ణ మేవావశిష్యతే.

అనుకున్నారు మాలోని ఒక పెద్ద. ఇదొక నిండైన గోళం, ఇటు చూసినా నిండైనదే, అటు చూసినా నిండైనదే. ఈ నిండైన గోళం నుంచి - కాంతి పూర్ణ దివ్య గోళం నుంచి మరల పుట్టే - కొంత కాలం తరువాత మళ్ళీ కనిపిం గోళం కూడ నిండైనదే. ఈ నిండైన దివ్య కాంతులీనే గోళం నుంచి ఇ మీదపుట్టే - కనిపించే గోళం కూడా నిండుగానే ఉంటుంది.

ఈ విధంగా చూస్తూనే ఉండిపోయాం. అది కాంతిమంతంగా ఉంది ఎక్కువ కాంతులను ప్రసరింపజేస్తున్నది. ఉషస్సుతో పాటు ఏవో శక్తులన పోషించేది అనే అభిప్రాయం కలిగింది. దానిని పూషన్ అన్నాం. కాని, ఆ కాంతి గోళం అంచులలోని విశేష కాంతి రేఖలను చూస్తే ఏదో కింద ఉంది; దానిని మూసిపెట్టినట్టు ఉంది అన్న భావం కలిగింది. కనుక ఆ దివ్యబింబాన్ని, మా శక్తులను పెంచే ఆ పూషణుని వేడుకొన్నాం ఈ విధంగా :

హిరణ్యయేన పాత్రేణ
సత్యస్యా పిహితం ముఖమ్,
తత్తం పూషన్నపావృణు
సత్యధర్మాయ దృష్టయే.

ఓ పూషన్! మాకు ఉత్సాహం కలిగించే ఓ దివ్యబింబ స్వరూపా బంగారు పాత్రతో సత్యద్వారం కప్పినట్టు ఉంది. సత్యం ఎదో గొప్ప కాంతి దానిని ఎందుకు కప్పిపెట్టినావు? సత్య స్వరూపాన్ని, సత్య స్వభావాన్ని చూడాలని, లాభం పొందుదామని నిరీక్షిస్తున్నాం. దానిని మేమంతా చూడడం కోసం, దానినుంచి మా సంఘం ప్రయోజనం పొందడం కోసం ఆ మూతన తొలగించు దేవా!- అని ప్రార్థించాం.

అప్పటికి మా సంఘం బాగా పెరిగింది. మా సంఘంలో శాఖోపశాఖల ఏర్పడ్డాయి. కొన్ని సంఘాలు పడమరకు, కొన్ని సంఘాలు తూర్పునకి బయలు దేరి వెళ్ళాయి. ఆ కాళ రాత్రులలో, ఆ వానలుగాలులలో ఆసంఘాలు మాలాగే బాధపడుతూ ఉండి ఉంటాయి. మేము ముందుకు దక్షిణానికి తరలి వెళ్ళుతూనే ఉన్నాం. కొన్ని వేల ఏళ్ళు గడచి ఉంటాయి. అగ్నిని పూజించడం విధిగా అయింది. అగ్ని అవసరం ఇంకా పూర్తిగా తొలగలేదు. మైదానాలక వస్తున్నాము. వాలఖిల్య సరస్సు—బైఖాల్ లేక్ వద్దకు, కాస్పియన్ సముద్రం కశ్యప సముద్రం దగ్గరికి వచ్చాం. తెప్పలు - నావలు కట్టడం, నీటిలో ప్రయాణం చేయడం, నీటి కిటుకులు తెలుసుకున్నాం. అంటే నీరు మాకు తెలియదని కాదు. అంత పెద్ద జలాశయం మేము చూడడం అదే మొదలు



దానిని, దారిన వచ్చే నదులను నావలతో దాటుతున్నాం. అయినా మాకు అగ్ని బలమైన ఆయుధం. అప్పుడు అగ్నిని ఈ విధంగా సంస్తుతించాం:

జాత వేదసే సునవామ సోమ మరాతీయతో నిదహాతి వేదః,
స సః పర్ష దతి దుర్గాణి విశ్వా నావేవ సింధుం దురితాత్యగ్నిః.
(1-99-1)

సకలమూ తెలిసిన - సర్వజ్ఞుడైన అగ్నికోసం సోమలతను నలగగొట్టి రసం పిండుదాం. అతడు దానిని తాగి బలం పొంది, నావ జలాశయాన్ని దాటించినట్టు మనను కష్టాలు దాటిస్తాడు అని నావతో పోల్చాం అతనిని.

కాశ్యప సముద్రం దాటి ముందుకు సాగిపోయాం! మేము పయనించింది చీకట్లో. ఆ చీకట్లు ఎంత కాలం ఉన్నవో చెప్పలేను. మేము చీకట్లు గడిచి, చూద్దుము గదా బంగారం కాంతులు అంతటా! ఉషస్సేమోనని అనుకున్నాం. పూషన్‌బింబమని కూడా అనుకున్నాం. కాదు ఆ బంగారు బింబంపై బోర్లించిన మూతను తొలగించమని మేము చేసిన ప్రార్థనను పూషణుడు విన్నాడు కాబోలు! మూత తొలగిన, ప్రవాహంతో వెలిగిపోతున్న బింబం గిరగిర తిరుగుతూ, తూర్పున ఎర్రగా-పచ్చగా పెద్ద గోళంగా కనిపించింది; కనిపించి పైకి లేస్తూంది. ఎక్కడో పెద్ద అర్ణవం నుంచి, జలాశయం నుంచి పైకి వస్తున్నట్లు ఉంది. కాంతుల పగ్గాలు వెలిగిపోయే ఆ బింబాన్ని పైకి లాగుతున్నట్టు ఉంది. అప్పుడు మహా సంతోషంతో గట్టిగా ఆ దివ్యకాంతి పూర్ణ బింబానికి స్వాగతం చెప్పాం:

ఆ సత్యేన రజసా వర్తమానో
నివేశయన్ అమృతం మర్త్యంచ,
హిరణ్యయేన సవితా రథేన
ఆ దేవో యాతి భువనాని పశ్యన్.

ఉద్వయం తమసస్పరి
పశ్యంతో జ్యోతి రుత్తరమ్,
దేవం దేవత్ర సూర్య
మగన్మత్ జ్యోతి రుత్తరమ్,

ఉదిత్యం జాతవేదసం
దేవం వహంతి కేతవః,
దృశే విశ్వాయ సూర్యం
చిత్రం దేవానా ముదగా దనీకం.

చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః
ఆ ప్రాద్యావా పృథివీ అంతరిక్షం
సూర్య ఆత్మా జగతః తస్థుషశ్చ
తచ్చక్షు ర్దేవహితం పురస్తాత్
శుక్ర ముచ్చరత్.

జ్యోక్చ సూర్యందృశే
యఉదగా న్మహతోర్ణవాత్
విభ్రాజమానః సలిలస్య మధ్యాత్
సమావృషభో లోహితాక్షః
సూర్యో విపశ్చిన్మనసా పునాతు.

నిజమైన కాంతితో దివిని పృథివిని నింపుతూ, బంగారు రథంలో భువనాలను చూస్తూ సవిత పైకి వస్తున్నాడు. అంధకారం మీదుగా దానిని జయించి పైకి వస్తున్నాడు. అన్ని కాంతులూ సూర్యుణ్ణే చేరాయి. ప్రపంచాన్ని దర్శించడానికి దేవతలు సూర్యుణ్ని పైకి ఎత్తుతున్నారు. ఆశ్చర్యం! దేవతల సేన పైకి వస్తున్నది. ఇతడు మిత్రునికి, ఇంద్రునికి, అగ్నికి కన్ను. ద్యావాపృథివులను ఆక్రమించుకొన్న ఈ సూర్యుడు జగత్తుకు ఆత్మ. దేవతలకు హితమైన కన్ను. ఇతడు శుక్రుణ్ని ముందు పంపి ముందుకు, పై పైకి వస్తున్నాడు. ఇక మనకు భయంలేదు. మహా దిగంతం నుంచి ఉదయించిన సూర్యజ్యోతిని చూస్తున్నాం. సలిలమధ్యంలో - అంతరాళంలో వెలిగిపోతున్నాడు, వృషభ సమానుడు లోహితాక్షుడు, ప్రపంచాన్నంతా చూస్తున్నవాడు మన మనస్సులను పవిత్రం చేయనీ!

అని స్తోత్రం చేస్తూ, ఆనందంతో గంతులు వేశాం, ఎంత వెలుగు ఇక చీకట్లు ఉండవు.

పశ్యేమ శరదః శ్శతమ్
జీవేమ శరద శ్శతమ్
నందామ శరద శ్శతమ్
మోదామ శరద శ్శతమ్
భవామ శరద శ్శతమ్
శృణువామ శరద శ్శతమ్
ప్రబ్రవామ శరద శ్శతమ్
అజీతా స్యామ శరద శ్శతమ్.



నూరేళ్ళు చక్కగా అన్ని వస్తువులూ చూస్తూ జ్ఞానం సంపాదించుకుందాం. నూరేళ్ళు సుఖంగా బతుకుదాం. నూరేళ్ళు సమృద్ధితో ఉందాం. నూరేళ్ళు సంతోషిద్దాం. నూరేళ్ళు మంచి మనుగడ గడుపుదాం. నూరేళ్ళు మంచిని విందాం. నూరేళ్ళు మంచి మాటలు మాట్లాడదాం. నూరేళ్ళు ఒకరికి తల ఒగ్గకుండా, అన్యాయానికి తల ఒగ్గకుండా ఉందాం—అంటూ గంతులు వేశాం.

సూర్యోదయంతో ప్రపంచమే మారి పోయినట్లనిపించింది. మునుపటి దీర్ఘరాత్రులు, కాళరాత్రులు లేవు, దీర్ఘమైన ఉషస్సులూ లేవు. సూర్యోదయానికి ముందు కొంతకాలం మాత్రం ఎర్రటి ఉషస్సు. అంతలోనే కరకరమంటూ సూర్యుడు. కాని ఉషస్సు ఉన్న కొంత సేపూ మహా సుందరంగా ఉంది. అది గమనించి రాహూగణపుత్రుడైన గోతముడనే ఒక పెద్ద ఇలా స్తుతించాడు:

ఏషా ఉ ర్యా ఉషసః కేతు మక్రత
పూర్వే అర్ధే రజసో భాను మంజతే,
నిష్కృణ్వానా ఆయుధానీవ ధృష్ణవః
ప్రతి గావో౽రుషీర్యంతి మాతరః. (1.92.1)

స్వచ్ఛమైన ఉషఃప్రభలు పూర్వదిక్కులో వెలుగుతున్నాయి. అవి సూర్యకాంతులను మించిపోయాయి. ఆ కాంతులను చూసి మా తల్లులైన ఆవులు ఆయుధాలను చూసిన వీరులలాగ ఉప్పొంగి పోతున్నాయి.

మరి వింతేమిటంటే, దీర్ఘరాత్రులు, దీర్ఘోషస్సులు పోయి, రాత్రి-ఉషస్సు-సూర్యుడు- ఉదయం అనే క్రమం వెంట వెంటనే రావడం. అది చూశాడు మాలో ఒకడైన కుత్స అంగీరసుడు.

ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతి రాగాత్
చిత్రః ప్రకేతో అజనిష్ట విభ్వా,
యథా ప్రసూతా సవితుః సవాయం
ఏవా రాత్ర్యుషసే యోని మారైక్. (1.113.1)

అదిగో జ్యోతిస్సులలో శ్రేష్ఠమైన జ్యోతిస్సు ఉషస్సు ఉదయిస్తున్నది. తూర్పున దాని కాంతులు అంతటా వ్యాపిస్తున్నాయి. సూర్యుడు పోగానే రాత్రి వచ్చినట్టు రాత్రి పోగానే ప్రత్యూషం వస్తుంది—అని మాకందరికి వివరించాడు. తర్వాత క్రమంగా సూర్యుడు వెలిగిపోతుండగా, కొందరు ఉషస్సును సూర్యునికి భగినిగా, భార్యగా, కూతురుగా, తల్లిగా వర్ణించారు.

క్రమంగా సూర్యుని ప్రాభవం పెరిగింది. ఇతర తేజస్సు లన్నిటినీ మించిపోవడంవల్ల ప్రధ్నుడయ్యాడు సూర్యుడు. అందరి పూజలూ పొందడం వల్ల అర్కుడయ్యాడు. మాలోని మృతండుడనే విద్వాంసుడు సూర్యోదయాన్ని మొదట చూసి మాకందరికీ చెప్పాడు. కనుక అతనిని సూర్యుని తండ్రిగా భావించాము. కనుక సూర్యుడు మార్తండుడయ్యాడు. మేఘాలను సృష్టిస్తాడు గనుక మిహిరుడయ్యాడు. మూడగ్నుల స్వరూపం గనుక త్రయీ తనువయ్యాడు. అందరికీ స్నేహపాత్రుడు కావడంవల్ల మిత్రుడయ్యాడు. అయినా పాతపేరు పూషా పూషణ పోలేదు. సంచరించేవాడు గనుక సూరుడయ్యాడు. ప్రేరేపించేవాడు గనుక సూర్యుడయ్యాడు.

సూర్యుడు ప్రబలుడై, ప్రకృతిలో మార్పులు తెస్తూ, ఋతువులను సృష్టిస్తూ ప్రజలకు ఎంతో ప్రయోజనకరుడవుతుండడంవల్ల మొదట సవిత అయిన అగ్ని అవసరం పరిమితమైపోయింది. సంఘం సూర్యుని వెలుగులో ఎంతో ముందుకు పోయింది. యజ్ఞం ఒక వ్యవస్థగా అయింది. అగ్ని యజ్ఞయాగాదులకే పరిమితమైపోయాడు. అప్పుడు అంగీరసుడు అన్ని మంటలు— సూర్యుని వేడిమికి కలిగేమంటలు, మేఘాలలోని మంటల వంటి విద్యుత్తులు పరిశీలించాడు. "అగ్నే మేఘాలలో మెరుపుల రూపంలో ప్రత్యక్షమవుతున్నాడనే పూర్వపుజ్ఞానం మారింది. అంతా సూర్యుని కాంతే, వైశ్వానుడు అరణులలో పుడుతాడు. భువనానికి ప్రభువయ్యాడు. మమ్ములను కాపాడినాడు. తర్వాత సూర్యునిలో చేరుతాడు."

వైశ్వానరస్య సుమతి స్యామ
రాజా హి కం భువనానాం అభిశ్రీః,
ఇతో జాతో విశ్వమిదం నిచష్టే
వైశ్యానరో యతతే సూర్యేణ.

అని వాక్రుచ్చినాడు. అగ్ని ఈవిధంగా మిగిలిపోయాడు. సూర్యునితోపాటు చంద్రుడూ ముఖ్యుడయ్యాడు.

అగ్నికి ప్రాధాన్యం ఉంటున్నదశలోనే మా నుంచి ఒక సంఘం చీలిపోయింది నిర్ఋతి దిశగా. తర్వాత ఆది అగ్నినే అంటి పెట్టుకున్నట్టు విన్నాము. (నేడు దానిని పార్సీలు అంటున్నారు.)

క్రమంగా సూర్య చంద్రుల ప్రాధాన్యం పెరిగిపోయింది. వారి గతిని అనుసరించి ప్రకృతిలో కలిగే మార్పులతో ఎన్నో విషయాలు తెలుసుకున్నాం.



దిన మాస ఋతు సంవత్సరాలు లెక్కగట్టాం. కనుకనే గృత్స్నమద భార్గవశౌనకుడు సోమాపూషణులను- సోమచంద్రులను ఈ విధంగా స్తుతించాడు:

సోమాపూషణా జననా రయీణాం
జననా దివో జననా పృథివ్యాః,
జాతౌ విశ్వస్య భువనస్య గోపౌ
దేవా అకృణ్వ న్నమృతస్య నాభిమ్. (2.41.1)

ఓ సోమా, ఓ పూషా భూమికీ దివికీ మీరే జనకులు. మీరే సంపదలను కలిగించేవారు. విశ్వానికి కారకులు మీరే. భువనానికి రక్షకులు మీరే. దేవతలు అమరులు కావడానికి మీరే కారణం.

సూర్యుడు దినమూ ఉదయిస్తున్నాడు. దినదినమూ కొత్తగా వస్తున్నాడు. చంద్రుడు పదిహేనుదినాలు పెరుగుతూ, పదిహేను దినాలు తరుగుతూ ఉదయిస్తాడు, అస్తమిస్తాడు. ఈ చక్రనేమి క్రమాన్ని మాలో ఒకరు స్వాభావికంగా వర్ణించారు:-

నవో నవో భవతి జాయమానః
అహ్నాం కేతు రుషసా మేత్యగ్రే,
భాగం దేవేభ్యో విదధాత్యాయన్
ప్రచంద్రమా శ్చరతి - దీర్ఘ మాయుః.

పగళ్ళకు కేతనం వంటి సూర్యుడు ప్రతిదినమూ ఉషస్సులకు చివరగా ఉదయిస్తాడు. చంద్రుడు తన శరీరంలో భాగం దేవతలకు కొంత ఇస్తూ చరిస్తున్నాడు. అలాటి సోమాపూషణులు మీకు దీర్ఘాయువు కలిగించనీ.

ఇక చంద్రుడు అనగానే నిండైన దినాన పూర్ణిమ, చంద్రబింబం మరుగయినవాడు అమావాస్య సంభవించడం సహజం కదా! ఈ పూర్ణిమలలోను, అమావాస్యలలోను భేదం ఉంది. సంపూర్ణ కళలుగల పూర్ణిమ రాక. ఒక కళ తగ్గిన పూర్ణిమ అనుమతి. చంద్రరేఖ ఏ మాత్రం కనిపించని అమావాస్య కుహూ, సన్నటి చంద్రరేఖ చార కనిపిస్తున్న అమావాస్య సినీవాలీ. అవీ దేవతలే మాకు. కనుకనే ఈవిధంగా స్తోత్రం చేశాం :

రాకా మహం సుహవాం నుష్టుతీ
హువే శృణోతు నః సుభగా బోధతు త్మనా,
సీవ్య త్వపః సూచ్యా చిద్యమానయా
దదాతు వీరం శతదాయముక్థ్యమ్. (2.32.4)

నేను స్తోత్రపాత్రమైన రాకను పిలుస్తాను. ఆమె నా పిలుపు విని, మా చెడ్డ కర్మలను మంచిసూదితో కుట్టివేసి, నూరేళ్ళు బతికే పుత్రులను ఇచ్చుగాక।

సినీవాలి పృథుష్టుకే యా దేవానా మసి స్వసా.
జుషస్వ హవ్య మాహుతం ప్రజాం దేవి దిదిడ్ఢి నః.

(2.32.6)

ఓ సినీవాలీ నీది మంచి జన్మ. నీవు దేవతలకు చెల్లెలివి. మేమిచ్చే హవిస్సు స్వీకరించి మాకు పిల్లలను ఇచ్చి కాపాడు.

పూర్వం మేము అన్నిటికీ అగ్నినే ప్రార్థించేవాళ్ళం. యత్తే అగ్నే తేజః, తేనాహం తేజస్వీ భూయాసం - ఓ అగ్నీ నీకు ఉన్న తేజస్సును నాకు ప్రసాదించు. దానితో నేను తేజస్వి అవుతాను—ఇత్యాదిగా ప్రార్థనలు చేసేవాళ్ళం. ఇప్పుడు అగ్నికి మించిన కాంతి, తేజస్సు, తాపం గల సూర్యుడు లభించాడు. కనుక అంతా అతనినే అడుగుతున్నాము. ఓ సూర్యుడా, మేధను ప్రజను మిరుమిట్లు గొలిపే కాంతిని మాకు ఇవ్వు - మయి మేధాం మయి ప్రజాం మయి సూర్యో భ్రాజో దదాతు - అని ప్రార్థించాము. మమ్ములను, మా బుద్ధిని సత్కార్యాలకు ప్రేరేపించే సూర్యుని కాంతిని కోరుతున్నాము - అని కోరుకోసాగినాము. అదే అన్ని మంత్రాలకు మించిన మంత్రం అయింది - గాయత్రీ మంత్రమయింది.

ఓం తత్సవితు ర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి
ధియో యో నః ప్రచోదయాత్.

సూర్యుని కాంతిని కోరనివారు ఉంటారా। అందరికీ కావాలి. సూర్య కాంతి ఒకరి సొమ్మా? ఆ కాంతి కావాలని చెప్పే ప్రార్థన ఒకరి సొమ్మా? ఇది అందరి సొమ్ము. ఇదే కాదు, వేదవిజ్ఞానం ప్రపంచవిజ్ఞానం, అందరి సొమ్ము.

సంఘం బాగా విస్తరించింది. విజ్ఞానం వ్యాపించింది. సంఘం స్థిరపడింది. రాజ్యాలు పాలకుల వ్యవస్థ ఏర్పడ్డాయి. వృత్తులు నియతంగా కొన్ని కొన్ని సంఘాలే అనుసరించడంవల్ల సంఘానికి బలం చేకూరింది. సాధారణ పూజతో, కేవలం భయ భక్తి గౌరవాల పూజతో ప్రారంభమైన యజ్ఞం ఒక వ్యవస్థగా ఏర్పడింది. దానినుంచే అన్నీ పుట్టాయి; సకల విశ్వానికి అదేకారణం అనే భావం ఏర్పడింది. యజ్ఞాన్నే ఒక విరాట్ స్వరూపంగా సాకార పురుషునిగా భావించి గానం చేశాము. పూర్వం అగ్నే అంతా, అతడే అధిష్ఠాన దేవత యజ్ఞానికి, అతడే దేవతలకు హవ్యం అందించే దూత : మాలోని మధుచ్ఛందుడనే పెద్ద అగ్నిని స్తుతించాడు ఈ విధంగా:-



అగ్ని మీళే పురోహితమ్
యజ్ఞస్య దేవ మృత్విజమ్
హోతారం రత్న ధాతమమ్. (1.1.1)

అగ్ని యజ్ఞానికి పురోహితుడు. దేవత. ఋత్విక్కు. హోత. రత్న కాంతులిచ్చేవాడు. అలాటి అగ్నిని స్తోత్రం చేస్తున్నాను. తర్వాత అగ్ని యజ్ఞంలో భాగం.

ఆ యజ్ఞమే అన్నిటికీ కారణమని తలచినప్పుడు దానిని స్తుతించడం సహజం కదా!

తచ్ఛం యో రా వృణీమహే
గాతుం యజ్ఞాయ గాతుం యజ్ఞపతయే
దైవీ స్వస్తిరస్తు నః స్వస్తిర్మానుషేభ్యః
ఊర్ధ్వంజిఘాతు భేషజం.
శన్నో అస్తు ద్విషదే, శం చతుష్పదే
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

యజ్ఞాన్ని, యజ్ఞపతిని ప్రశంసించడానికి శుభమయిన సంపదను కోరుకుందాము. మనకు దైవికమైన శుభం కలుగుగాక? మనుష్యులకు శుభం కలుగుగాక? మనకు సంబంధించిన ద్విపాత్తులకు చతుష్పాత్తులకు శుభమగుగాక. శాంతి శాంతి శాంతి.

ఈ విధంగా యజ్ఞాన్ని స్తుతించడానికి శక్తి కోరి తరువాత యజ్ఞపురుషుడిని స్తోత్రం చేశాము. దీనిని పురుషసూక్తం అన్నాం. యజ్ఞం, యజ్ఞపురుషుడు ఒకరే గనుక, అంతా యజ్ఞం నుంచే వచ్చింది గనుక, యజ్ఞాన్ని స్తోత్రం చేశాము :-

సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్
సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాంగుళం
పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చభవ్యం
ఉతా మృత త్వేశానః.

ఈ యజ్ఞ పురుషుడు వేయి తలల వాడు. వేయి కన్నులవాడు. వేయి పాదాలవాడు. అతడు భూమి నంతా ఆక్రమించుకొని పది దిక్కులా నిండిపోయాడు. ఈ భూమంతా యజ్ఞపురుషుడే. ఇంతవరకు జరిగింది, జరగబోయేది అంతా అతడే. అతడే అమృతత్వం ప్రసాదించే దేవుడు.

ఈ విశ్వమంతా ఇతడే అయినప్పుడు ఇతని కన్నేవి తొడ లేవి అంటే, బ్రాహ్మణుడు ఈ యజ్ఞపురుషుని ముఖం, బాహువులు రాజవంశీయులు, తొడలు వైశ్యులు. పాదాలు శూద్రులు - మూల బంధం - బునాది - వంటివారు. చంద్రుడు మనస్సు. సూర్యుడు కన్ను. మరొక విధంగా ముఖం ఇంద్రుడు, అగ్ని. వాయువు అతని ప్రాణాలు. అతని నాభి అంతరిక్షం. ఈ విధంగా.

ఒక ముఖ్యమైన సంగతి ఇప్పుడు స్ఫురించింది.

ఉత్తర ధ్రువ ప్రాంతంలోని, ఉత్తరకురుభూముల్లోని శీతోష్ణస్థితికి అలవాటు పడిన మాలో కొందరికి సూర్యుని కాంతి బాధాకరమయింది. అలాటి వారు కొందరు ఉత్తర కురుభూములకు మరలి వెళ్ళిపోయారు. విశ్వకర్మ త్వష్ట సూర్యకాంతిని తగ్గించే ఉపాయం ఆలోచించాడు. శకద్వీపంలో సంవత్సరంపాటు ఉండి. సూర్యుని కాంతి కొన్ని ప్రాంతాలలో తీక్ష్ణంగా ఉండదని గ్రహించి అందరికీ ఈ విషయం తెలియజేశాడు. త్వష్ట్ర విశ్వకర్మ ఈ సంగతిని మొదట తెలుసుకొని మా జనానికి నచ్చజెప్పి వెనుకకు తరలిపోకుండా చేశాడు గనుక, త్వష్ట్ర ప్రజాపతి సూర్యుణ్ని భ్రమిపై (తరిమెన చక్రంపై) ఎక్కించి తరిమెన పెట్టి సూర్యుని అతపతీవ్రతను తగ్గించాడని కథలుగా చెప్పకొన్నారు. ఈ తరమెన పన్నెండు నెలలుగల ఏడాది తరిమెన.

శకద్వీపానికి వెళ్ళిన మావారు కొందరు అక్కడి ఉల్కాలతో ఆయుధాలు చేసుకున్నారు. త్వష్ట్ర విశ్వకర్మే ఈ ఆయుధ నిర్మాణానికీ మూల పురుషుడు. ఆయన ఉల్కాల ఇనుముతో విష్ణువునకు చక్రాన్ని, శివునికి త్రిశూలాన్ని, కుబేరునికి పల్లకిని చేయించి ఇచ్చాడని కథలుగా చెప్పకొన్నారు. ఈ ఉల్కాలు విశ్వకర్మ సూర్యుణ్ని తరిమెన పట్టినప్పుడు అతని దేహంనుంచి విరిగిపడిన ముక్కలని, వాటినే విశ్వకర్మ ఆయుధాలుగా మలిచాడని కథలు పుట్టాయి.

మేము అగ్నిని ఆయుధంగా వాడుతున్నా దానికితోడు ఈ ఆయుధాలు కూడ ప్రముఖులు వాడసాగినారు. అప్పటికి మా సంఘం ఆయుధాలతోను, ఇతర సామగ్రితోను శక్తిమంతమైంది.

ఈలోగా కొందరు ఉత్తర కురుభూములకు వెళ్ళి అంతకుముందు ఎండకు భయపడి వెళ్ళినవారికి నచ్చజెప్పి, సూర్యుని ఎండ తగ్గిందని, ఇప్పుడు సహించ దగినదిగా ఉందని వివరించి వెనక్కు పిలుచుకొని వచ్చారు. ఈ విధంగా తిరిగి వచ్చినవారిలో ప్రముఖురాలు ఆదిత్యుని భార్య అయిన సంజ్ఞా దేవి. ఈమె ఆదిత్యుని తాపానికి భరించలేక ఉత్తరకురు భూములకు వెళ్ళింది. తండ్రి విశ్వకర్మ ఆదిత్యుని తాపం తగ్గించానని చెప్పిన పిదప, పరీక్షించి నమ్మకం కలిగిన తర్వాత ఆదిత్యునితోపాటు తిరిగి వచ్చింది.



కనుక వేదం అనేక కాలాల, అనేక గణాల, అనేక దేశాల, అనేక సంఘాల, అనేక రాజ్యాల, అనేకానేక మహావ్యక్తుల చరిత్ర సంకలనం. ఈ వేదాలు ఒకేసారి ముద్దగా, పిడుగుపాటుగా ఆకాశంనుంచి ఊడిపడినవి కావు. అవి పెక్కు సహస్రాబ్దాల మానవజాతి పరిణామ గాథ. వేదాలు సూక్తమయాలు. వాటిని మాలోని కొందరు మేధావులు సమాధిస్థితిలో దర్శించుకొన్నవి. కనక వేదభాష మేధావుల, ఆలోచనాపరుల భాష. దానికి మూలమైంది ప్రాకృతం.

# తెలుగు ప్రాకృతాల సంబంధం

ఇంగ్లాండులో ఒక వ్యాపారసంస్థ డిక్టాఫోనును కనిపెట్టింది. దానికి ప్రారంభోత్సవం చేయడానికి ఎవరిని ఆహ్వానిద్దామా అని ఆ సంస్థ నిర్వాహకులు ఆలోచించి మహాపండితుడైన మాక్స్‌ముల్లర్‌ను ఆహ్వానించారు. ఆయన

"అగ్నిమీళే పురోహితమ్
యజ్ఞస్యదేవ మృత్విజమ్
హోతారం రత్నధాతమమ్."

(యజ్ఞానికి పురోహితుడు, అధిదేవత, ఋత్విక్కు, హోత, యజ్ఞ ఫలధారి అయిన అగ్నిని స్తుతిస్తున్నాను. అనే ఋగ్వేదం మొదటిఋక్కును పఠించి డిక్టాఫోనును ఆవిష్కరించాడు. "ఇదేమిటి ఛాందసమ్? ఏదో పెద్దమనిషి అని పిలిస్తే బానిసల భాషపద్యాన్ని, అదిన్నీ చచ్చిన భాషాపద్యాన్ని చదువుతున్నాడే!" అని నిర్వాహకులు సణుక్కున్నారు. అది గ్రహించిన మాక్స్‌ముల్లర్ పండితుడు "దిస్ ఇజ్ ది ఫస్ట్ పొయెటిక్ అట్టరెన్స్ ఆఫ్ ది వైట్ రైస్" అని వివరించాడు. అతడు వేదాన్ని తెల్లజాతి తొలి కవితా వచనం అన్నాడు గాని నేను తొలిసారిగా విచ్చుకున్న మానవజాతి కవితాకంఠ అని అంటాను.

అగ్నిమీళే పురోహితం వంటి పరిష్కృత, సుసంస్కృత భాషాగీతం, గాయత్రీ ఛందోబద్ధమైన గీతం పిడుగుపాటుగా ఆకాశం నుంచి పడదు. కొన్ని వేల సంవత్సరాల పరిష్కార, సంస్కార పరిశ్రమలతో రూపొంది ఉంటుంది, ప్రకృతుల నుంచి, ప్రజల నుంచి ప్రాదుర్భవించి ఉంటుంది. ప్రకృతినోళ్ళలో రాపాడి రాపాడి పరిష్కృతమైన సుసంస్కృతమైన భాషనుంచి పొటమరించి ఉంటుంది. సుసంస్కృతమైన భాష ఉన్నత వర్గాల సొమ్మై కాలం మారినా ఎంతమాత్రమూ పొల్లుపోక అష్టదిగ్బంధాలతో రక్షితమవుతూ రాగా, దానికి మూలమైన, తల్లివేరైన ప్రకృతుల భాష-పాకృతభాష పిల్లకాలువలను, ఏళ్ళను కలుపుకొంటూ, ఎప్పటికప్పుడు విస్తృతమై, ప్రవహించే మహానదివలె కాలంతో పాటు, ప్రజల ఆచారాలు, అనుభవాలతో పాటు మారుతూ విస్తరించింది.

ప్రాకృతం అనగానే అటు పశ్చిమోత్తరాన ఉత్తర ధ్రువ సమీపంలోని నార్వే స్వీడన్‌ల నుంచి, ఈశాన్య పూర్వాన వాల్డివాస్టోక్ వరకు, ఇటు దక్షిణ



పశ్చిమాన యూరప్ నుంచి ఆసియాదేశాల మీదుగా ఆగ్నేయాసియాలోని ఇండోచైనా-ఇండోనేసియాల వరకు ఒకప్పుడు వ్యాపించిన గొప్ప భాష సాక్షాత్కరిస్తుంది. ఆ భాషలో నేటి స్లావ్‌భాషల పూర్వ స్వ రూపాలు మొదటిదశ కాగా, ఆగ్నేయాసియా దేశాల భాషల పూర్వ స్వరూపాలు చివరిదశ. ఇది ప్రజల భాష. ప్రజల నిత్యవ్యవహార భాష. ప్రజల ప్రేమభాష. ప్రజల కష్టసుఖాల భాష. ఇదే ప్రకృతుల - ప్రాకృతుల భాష - ప్రాకృత భాష.

సంస్కృతం అపభ్రష్టమై ప్రాకృతమైందని ప్రాచీన భారతీయ విద్వాంసులు పలువురు, ఆధునికులు కొందరు భావించడంవల్ల అపసిద్ధాంతాలు పుట్టాయి. మానవజాతి తొలిచ్ఛందో రూపమైన ఋగ్వేదంలో ప్రాకృత భాషా రూపాలు కానరావడంవల్ల ఋగ్వేదభాషకన్నా నాటి భిన్నమూ అపరిష్కృతమూ అయిన భాష ఒకటి ఉండి ఉంటుందని, అదే ప్రాకృతమని, లేక ప్రాకృతమూలమని భావించవచ్చు. ఆ ప్రాకృత భాషా పద రూపాలను కొన్నిటిని తెలియజేయడం అప్రస్తుతం కాదు.

వైదిక భాషలో నేటి ప్రాకృత భాషాపదాల స్వరూపాలు కనిపించడం ఎవరికైనా ఆశ్చర్యకరమే. ప్రాకృత ప్రత్యాయాలు వైదిక సంస్కృతంలో ఎలా మిగిలిపోయాయో చూస్తే, ప్రాకృత భాషలకు వైదికభాషకూ మూలమనదగిన భాష ఇంకొకటి ఉండాలని అనుమానించవలసి వస్తుంది. అటువంటి స్వరూపాలు కొన్ని ఇవి :

ప్రాకృత పదాలలో పదాది ఋకారం లుప్తమవుతుంది: బృంద-బంద: మృగ-మగ, మిగ, ముగ, మొగ. ఋకారానికి ఉ ఆదేశమౌతుంది. పృధ్వీ-పుహవి. వైదిక సాహిత్యంలో ఇలాటి ఋలుప్తరూపాలు కనిపిస్తాయి: కృత-ఖుధ (ఋ: 1.46.4).

ప్రాకృతపదాలలో సంయుక్తాక్షరాలు దీర్ఘాలవుతాయి: దుర్లభ-దూలభ; విశ్రమ-విశామ; స్పర్శ-పాస. వైదిక భాషలోను ఇలాటి వైరూప్యం కనిపిస్తుంది: దుర్లభ-దూలభ (ఋ. 4.9.8); దుర్నాశ-దూణాశ (శుక్లయ.ప్రాతి.3.45).

ప్రాకృతంలో అంతిమ వ్యంజనలోపం కనిపిస్తుంది: తావత్-తావ; యావత్-యావ. వైదికభాషలోను ఇలాటిది ఉన్నది: పశ్చాత్-పశ్చా (అథర్వ సంహిత. 10.4.11); ఉచ్చాత్-ఉచ్చా (తైత్తి.సంహి. 2.3.14); నీచాత్-నీచా (తైత్తి.సంహి. 1.2.14).

సంయుక్తాక్షరాలలో రేఫయకారాలలోపం ప్రాకృతంలో ఉంది: ప్రగల్భ-పగల్భ; శ్యామా-సామా; వైదికభాషలోను ఈ లోపం కనిపిస్తుంది: అప్రగల్భ-అపగల్భ (తైత్తి.సం.4.5.61); త్ర్యచ-త్రిచ (శతపథబ్రా.1.3.3.33)

సంయుక్తపదాలలో పూర్వ దీర్ఘవర్ణం ప్రాకృతంలో హ్రస్వంగా మారు
తుంది: పాత్ర-పత్త; రాత్రి-రత్తి; సాధ్య-సజ్ఝ. ఈ పద్ధతి వైదిక భాషలోను
ఉంది: రోదసీప్రా-రోదసిప్ర (ఋ.10.88.10); అమాత్ర-అమత్ర(ఋ.3.66.4).

ప్రాకృతంలో దకారం డకారంగా మారుతుంది: దణ్డ-డణ్డ; దంస-
డంస; దోలా-డోలా. వైదిక భాషలోను ఈ మార్పు అక్కడక్కడ కనిపి
స్తుంది: దుర్లభ-దూడభ (వాజసనేయసం.3.36); పురోదాస-పురోడాశ (శుక్ల.
యజు. ప్రాతి.3.44).

ప్రాకృతంలో ధ హగా మారుతుంది: బధిర-బహిర; వ్యాధ-వాహ.
వైదిక భాషలోను ఇది క్వాచిత్కంగా ఉంది: ప్రతిసంధాయ-ప్రతిసంహాయ
(గోపథబ్రాహ్మ 2.4.).

ప్రాకృతంలో సంయుక్త వ్యంజనాలలో స్వరం ప్రవేశించి ఉచ్చారణ
సౌలభ్యం కలిగిస్తుంది: క్లిష్ట-కిలిట్ఠ; స్వ-సువ; తన్వీ-తణువీ. వైదిక భాషలోను
ఈ పద్ధతి ఉంది. సహస్త్ర్యః-సహస్త్రియః; స్వర్గ-సువర్గ (తైత్తిరీ సం.4 2.3.);
తన్వః-తనువః; స్వః సువః (తై.ఆ.7.22.1;6.2.7).

ప్రాకృతంలో అకారాంత పుంలింగ ప్రథమైకవచనం ఓ కావడం సహ
జంగా కనిపిస్తుంది: దేవో; జిణో, రామో, సో. వైదిక భాషలోను ఈ ఓ
ప్రయోగం కనిపిస్తుంది: సంవత్సరో అజాయత (ఋ.సం.10.190.2); సో చిత్
(ఋ.సం.1.191.10,11).

ప్రాకృతంలో తృతీయాబహువచనానికి ఇహి చేరుతుంది: దేవేహి;
గంభీరేహి; జేట్ఠేహి. వైదిక భాషలోను ఇలాటి రూపాలున్నాయి అనురూప
దేవేభిః; జ్యేష్ఠేభిః, గంభీరేభిః; భద్రం కర్ణేభిః.

ప్రాకృతంలో చతుర్థీ విభక్తికి షష్ఠీ విభక్తి రావడం తరచుగా కనిపి
స్తుంది. వైదికభాషలోను ఇలాటిది ఉన్నట్లు పాణిని సూత్రమే సాక్షి. చతుర్థ్యర్థే
బహుళం ఛందసి (అష్టా. 2.3.62).

ప్రాకృతంలో పంచమీ విభక్తి ఏకవచనంలో చివరిహల్లు లోపిస్తుంది:
దేవాత్-దేవా; ఉచ్చాత్-ఉచ్చా; జినాత్-జిణా. వైదిక భాషలోను ఇలాటిలోపం
కనిపిస్తుంది: ఉచ్చా; నీచా; పశ్చా.

ప్రాకృతంలో ద్వివచనం లేదు. దానికి మారు బహువచన ప్రయోగమే
ఉంది. దేవా; హరీ. వైదిక భాషలోను కొన్నిచోట్ల ద్వివచనానికి మారు బహు
వచనమే కనిపిస్తుంది: ఇంద్రావరుణౌ- ఇంద్రావరుణా; మిత్రావరుణౌ-మిత్రా
వరుణా; దివిస్పృశావశ్వినౌ-దివిస్పృశా వశ్వినా.[1]



పై పరిశీలనలనుబట్టి ప్రాకృతం వ్యాప్తంగా ఉన్నదని, అదే సంస్క
రింపబడి సంస్కృతమైందని ఊహించడానికి అవకాశం ఉంది. ప్రాకృతం విశాల ప్రాంతంలో విస్తరించిన భాష. పశ్చిమాన స్లావ్ భాషలలోను, దక్షిణ భాషలలోను, మధ్య ఆసియాలోని భాషలలోను, చూళికా ప్రాకృతమని చెప్పిన భాషలలోను సంస్కృతంతో గల సామ్యం ఆశ్చర్యం కలిగిస్తుందని డాక్టర్ వి. రాఘవన్ తమ పాశ్చాత్య పర్యటనానంతరం వ్రాసిన వ్యాసాలలో వివరించారు.[2] ఆ భాషలలో స్త్రీలు మాట్లాడుతున్నప్పుడు ప్రాకృతం వింటున్నట్లు ఉండేదని ఆయన అన్నారు. ఆధునిక ఇరానీ, ఆఫ్ఘానీ, హిమాలయ పశ్చిమాగ్ర ప్రాంత భాషలు మాట్లాడినా, జావాసుమత్రాభాషలు విన్నా, నాకు ప్రాకృతంగానే తోస్తుంది.

దీనినిబట్టి సంస్కృత ప్రాకృతాలకు ఏ విధంగానూ జన్యజనక సంబంధం లేదని, రెండూ ఒకపూపు రెండు రేకులని - కాదు కాదు - ఒక రేకు రెండు పార్శ్వాలని, ఒక కత్తి రెండు వాదరలని అనవచ్చు. ఛందోబద్ధమయిన భాష కొంత పరిష్కృతమూ, ప్రయత్న సాధితమూ, సుందరమూ కావడంవల్ల ఋగ్వేద సంస్కృతం పై వర్గాల భాష అయి, కింది వర్గాల భాష-సామాన్య వ్యవహార భాష-దానికి కొంత భిన్నంగా ఉన్నా, చాల సన్నిహితంగా ఉండేదని ఊహించవచ్చు. ఈ సంస్కృతీకరణం వేదప్రాదుర్భావానికి ముందే ప్రారంభమయి ఉంటుంది. ఈ సంస్కృతీకరణం మన పూర్వులు ఆరునెలల మహాకాళరాత్రిలోను, ఆరునెలల ఉషఃకాంతిలోను వసిస్తున్నప్పుడు, జ్వలనుడే ఆయుధంగా. రక్షకుడుగా పర్యటిస్తున్నకాలంలోను ప్రారంభమై ఉంటుంది. కాలక్రమాన ఆ పదాలు కలుషితం కాకుండా వేదానికి కట్టుబాట్లూ-ప్రాతి శాఖ్యలు, నిరుక్తాది నిఘంటువులు పుట్టాయి. శిష్టుల భాష సంస్కృతమో, సంస్కృత తుల్యమో అయింది. జన సామాన్య భాష ప్రాకృతమే. బుద్ధుని కాలపు భాషచూచినా బుద్ధుని జాతక కథల భాష, ఉపదేశ సంగ్రహమైన ధమ్మపదం మొదలయినవి ఉన్నత్రిపిటకాలలోని పాళి అనబడే ప్రాకృత భేదం చూచినా, సంస్కృత ప్రాకృతాల సన్నిహితత్వం తెలుస్తుంది. ధమ్మ పదాన్నికొద్దిగా సంస్కరిస్తే సంస్కృత మౌతుంది.

బాలస్త్రీ మంద మూర్ఖాణాం నృణాం చారిత్రకాంక్షిభిః,
అనుగ్రహార్థం తత్వజ్ఞైః సిద్ధాంతః ప్రాకృతే కృతః.

(బాల స్త్రీ మంద మూర్ఖులు కూడా సచ్ఛీలురు కావాలనే కోరికతో తత్త్వజ్ఞులైన పెద్దలు తమ సిద్ధాంతాలను ప్రాకృతభాషలో చెప్పారు.) అని హేమచంద్రాచార్యుడు తన కావ్యానుశాసనంలో ఒక ప్రాచీన శ్లోకాన్ని ఉదాహరించాడు.

అందువలననే తథాగతుడు, మహావీరుడు తమ ఉపదేశాలను పై వారి భాష అయిన సంస్కృతానికి పోక ప్రజాసామాన్య శీలరక్షణ కోసం వారి భాషలోనే ఉపదేశించారు.

ప్రాకృతాన్ని సంస్కరిస్తే ఎంత సులభంగా సంస్కృతమౌతుందో కింది ఉదాహరణలు తెలుపుతాయి:-

అభిత్థరేత కల్లాణే పాపా చిత్తం నివారఏ,
తందంహి కరోతో పుఞ్ఞం పాపస్సిం రమతేమనో. (ధమ్మపదం)

దీని సంస్కృతచ్ఛాయ ఇది:

అభిత్వరేత కల్యాణే పాపాత్ చిత్తం నివారయేత్,
తంద్రాం హి కుర్వతః పుణ్యం పాపే రమతే మనః[3]

సత్కార్యాచరణ విషయంలో త్వరపడాలి. పాపం నుంచి మనస్సును మరలించుకోవాలి. ఈ విషయంలో ఆలసించేవాడికి పుణ్యం నష్టమైపోగా మనస్సు పాపంలో లగ్నమవుతుంది - అని దీని అర్థం.

ఈ విధంగానే జైనాగమ సాహిత్యంలో ప్రాచీనతమమైన ఆయారాంగ సుత్తంలోని కొన్ని వాక్యాలు గమనించండి :

ణత్థి కాలస్స ణాగమో. సవ్వే పాణా పియాఉయా. సుహసాయా. దుక్ఖపడికూలా. అప్పియవహా. పియజీవిణో. జీవిఉకామా. సవ్వేసిం జీవియం పియం.[4]

దీని సంస్కృత చ్ఛాయ ఇది:

నాస్తి కాలస్య అనాగమః. సర్వేప్రాణాః ప్రియాతురాః, సుఖసాధాః, దుఃఖ ప్రతికూలాః, అప్రియవహాః, ప్రియజీవివో, జీవితు కామాః, సర్వేషాం జీవితం ప్రియమ్.

విధి తప్పుతుందనలేము. ప్రాణులన్నీ సంతోషమే కోరుతాయి. సుఖం కోసం ప్రయత్నిస్తాయి, దుఃఖాన్ని ఇష్టపడవు. అప్రియాన్ని ఇష్టపడవు. జీవితాన్ని ఇష్టపడతాయి. జీవింపగోరుతాయి. ఎందుకంటే, అందరికీ జీవితం ప్రియమైంది గనుక - అని దీని అర్థం.

పై ఉదాహరణలను బట్టి అస్తవ్యస్తంగా, లోకంలో వివిధ రూపాలలో ఉన్న ప్రాకృతాన్ని సంస్కరించి సంస్కృతంగా రూపొందించారనడం స్పష్టం. నేటి ఉత్తర ధ్రువ ప్రాంతాల భాషలను సంస్కరించినా ఒక మూవిరి సంస్కృతాలవుతాయి.



ఈ విస్తృత భాష జైన బౌద్ధ ప్రచార ప్రాబల్యంతో వివిధ రీతుల విస్తరించింది. బౌద్ధ త్రిపిటకాల భాషను పాలీ అన్నారు. పాలీ అంటే పర్యాయం, మూల పాఠం, బుద్ధ వచనం అని బుద్ధఘోషుడు నిర్వచించాడు. కాని, బుద్ధుడు మగధరాజధాని అయిన పాటలీ పుత్ర పరిసర వ్యవహార భాషలో ఉపదేశించాడు గనుక పాటలీ పాలీ అయి ఉంటుందని నా నమ్మకం పాలీ ప్రభావం నేటి మైథిలీ భోజపురీ భాషలలో చూడవచ్చు.

ఈ విస్తృత భాషకు ప్రాకృతమనే వ్యవహారం ఎప్పుడు వచ్చిందో చెప్పలేము. ఇది ఆయా ప్రాంతాలను బట్టి వివిధ రూపాలు పొంది వివిధ నామధేయాలూ పొందింది. మధ్య ఆసియాలోని ఖోటాన్ మొదలైన దేశాల భాషల సంబంధంతో చూళిక అయిది;[5] గాంధార బెలూచిస్థాన్‌లలో పైశాచి అయింది. మగధ సామ్రాజ్యంలో మాగధి అయింది; నేటి మహారాష్ట్ర—గుజరాత—రాజస్థాన్—ఉత్తరప్రదేశ్‌లోని విస్తృత ప్రాంతాలు, ఆంధ్ర కర్నాటకాలలోని ఉత్తర ప్రాంతాలు కలిసిన విశాల రాష్ట్రంలో–మహారాష్ట్రంలో–మహారాష్ట్రి అయింది.[6]

ఈ మార్పులను గుర్తించి ఆయా ప్రాంతాల భాష పాత్రోచితమనే దృష్టి గల భరతాచార్యుడు ప్రాకృతభాషలను తొలిసారిగా పేర్కొన్నాడు. ఇతడు ప్రాకృతభాషలను మాగధీ, ఆవంతికా, ప్రాచ్యా, శౌరసేనీ, అర్ధమాగధీ, బాహ్లికా, దాక్షిణాత్యా అని ఏడుగా వింగడించాడు.[7] ప్రాకృతమంటే, ప్రకృతుల – ప్రజలభాష ప్రాకృతం అని అతని ఉద్దేశమై ఉంటుంది. కాని అతడు తద్భవతత్సమాది విభజన చేయలేదు. తర్వాత రెండవ శతాబ్దివాడైన చండుడు తన ప్రాకృతలక్షణమ్ అనే వ్యాకరణంలోను భరతునిలాగే ప్రాకృతోత్పత్తిని గురించి చర్చించలేదు. కాని వర్ణాగమ వర్ణలోపాలు సూచించడం వల్ల సంస్కృతమే మూలమని ఇతడు భావించినట్టు తోస్తుంది.[8]

ప్రాచీనులలో 7వ శతాబ్దివాడైన రాజశేఖరుడు ప్రాకృతంనుంచే సంస్కృతం పుట్టిందన్నాడు. అతడు ఒక పాత్రతో ఇట్లా చెప్పించాడు:

యద్యోనిః కిల సంస్కృతస్య సుదృశాం
జిహ్వాసు యన్మోదతే
యత్ర శ్రోత్రపథామకారిణి కటుః
భాషాక్షరాణాం రసః
గద్యం చూర్ణపదం పదం రతిపతేః
తత్ ప్రాకృతం యద్వచః

తాన్ లాటాన్ లలితాంగి పశ్య సుదతీ
దృష్టేః నిమేష వ్రతమ్.

ఓ లలితాంగి, కళ్ళు రెప్పార్పకుండా లాటదేశీయులను చూడు. వారి భాష ప్రాకృతం. అది సంస్కృత భాషకు మూలమైనది. ఎప్పుడూ మహిళల నాలుకపై నాట్యమాడేది. ఈ భాష రతిపతికి స్థానమైనది అని లాటదేశీయుల భాషను పొగిడాడు. ఈ లాటులు లట్వియా వారేమోనని నా అనుమానం. అలాగే 9వ శతాబ్దివాడైన వాక్పతి రాజు తన గౌడవహో కావ్యంలో ప్రాకృతాన్ని తొలి భాషగా ఇట్లా పేర్కొన్నాడు :

సయలాఓ ఇయం వాఆ విసంతి విత్తోయవాయావో
ఏంతి సముద్దంచియ నేంతి సజలావోచ్చయ జలాఇ.

అన్ని భాషలూ ప్రాకృత భాషలో ప్రవేశిస్తాయి. దాని నుంచే అన్ని భాషలూ పుట్టాయి. నీళ్ళు సముద్రంలో చేరతాయి. సముద్రం నుంచి ఆవిరై మళ్ళీ నీళ్ళవుతాయి.

రుద్రట రచిత "కావ్యాలంకారః"ను వాఖ్యానించిన నమిసాధువు కూడ వాక్పతి రాజు లాగే అన్నాడు "సకల జగజ్జంతువులకు వ్యాకరణాది సంస్కారంలేని సహజ వ్యాపారం ప్రకృతి, దానివల్ల కలిగినదిగాని, అదిగాని ప్రాకృతం. ప్రాకృతం పసి పిల్లలకూ, మహిళలకూ సుబోధమయింది: సకల భాషా నిబంధమైన పలుకు. అది మేఘాలనుంచి పడిన నీరు వంటిది. అది దేశ విశేషాన్ని బట్టి సంస్కారాదులనుబట్టి విశిష్టతను పొంది, సంస్కృతాదులుగా తర్వాత విభేదాలు పొందుతుంది."

నమి సాధువు నిర్వచనం ఎంతో చక్కగా ఉంది, ప్రాకృతం ప్రజల సహజ భాష. సంస్కారం పొందిన తర్వాత మారుతుంది.

కాని, తర్వాతి వారు "సంస్కృతం ప్రకృతి, దాని నుంచి పుట్టింది ప్రాకృతమ్. ప్రాకృత భాషకు సంస్కృత శబ్దం ప్రకృతి" అని విపరీత వ్యుత్పత్తి కల్పించారు.

వివిధ వ్యవహారాల వల్ల, జైన బౌద్ధ మత ప్రచారం వల్ల ప్రాకృతానికి ప్రజలలో ఆదరణ కలిగి విశేష సంబంధం ఏర్పడడం వల్ల స్థానిక భాషల పదాలు కూడ ప్రాకృతంతో చేరుతూ వచ్చాయి; దక్షిణా పథంలోనూ చేరాయి. వాటిని తెలుసుకోడం అవసరమైంది. ఏది ప్రాకృతమో, ఏది స్థానికమో, దేశ్యమో విడదీయలేనంతగా ప్రాకృతం విస్తరించింది. దానివల్ల అర్థ నిర్ణయంలోను సంశయం ఏర్పడింది. ఈ నిర్ణయం కోసం తత్సమ, దేశ్య అనే విభజన



ఏర్పడింది. ఈ విభజనను తొలిసారిగా చేసిన వాడు ఆచార్య హేమచంద్రుడు-సిద్ధహేమచంద్ర శబ్దానుశాసనంలో.[9] ప్రాకృతకావ్య వ్యాఖ్యాతలు కులబాల దేవ, అభిమాన చిహ్న, గోపాల, దేవరాజ, ద్రోణ, ధనపాల, పాదలిప్తాచార్య, రాహులక, శ్రీలంకాదులు ప్రాకృత భాషా పదాలు కాని వాటిని "ఇతి దేశీ" అని సూచించారు. కొందరు దేశీపదకోశాధికారం వ్రాశారు. అవి సరిగాలేవని ఆచార్య హేమచంద్రుడు దేశీ నామమాలా అనే నిఘంటువునే కూర్చాడు.

దేశీ దుస్పందర్భా
ప్రాయస్సందర్భితాపి దుర్బోధా,
ఆచార్య హేమచంద్రః
తత్తాం సంద్రుభతి విభజతి చ.[10]

దేశీ పదాలను అన్వయించడం కష్టం. అన్వయించినా అర్థం చేసుకోడం మరొక కష్టం. అలాటి వాటిని ఆచార్య హేమచంద్రుడు అన్వయించి సుబోధం చేస్తాడు-అని ఈ నిఘంటు ప్రారంభంలోనే ఆచార్య హేమచంద్రుడు ప్రతిజ్ఞ చేశాడు. హేమచంద్రుని అనుసరించే 12–13 శతాబ్ది వాడైన త్రివిక్రముడు తన ప్రాకృత శబ్దాను శాసన వృత్తి పీఠికలో ఆ పద్ధతినే తత్సమ, తద్భవ, దేశి అని భాషను విశ్లేషించాడు.

కన్నడ లక్షణ గ్రంథాలు తెలుగు లక్షణ గ్రంథాల కన్నా ముందుగా వెలిశాయి. 9వ శతాబ్దం వాడైన నృపతుంగుడు తన కవిరాజ మార్గంలో తత్సమ దేశ్యాలు చెప్పకపోయినా తద్భవ పరిచ్ఛేదంలో సమ సంస్కృత పదాలకు సమానం చెల్లదన్నాడు. సమ సంస్కృత మంటే తత్సమం కాని సంస్కృతం.[11]

ప్రాకృత వ్యాకరణాలను, కన్నడ వ్యాకరణాలను అనుసరించే తెలుగు వ్యాకర్తలు భాషను తత్సమ, తద్భవ, దేశ్యమని విభజించారు. ఈ విభజనను తొలిసారిగా చేసినవాడు ఆంధ్ర భాషా భూషణకర్త కేతన. ఇతడు ఈ మూడింటినే కాక అచ్చ తెలుగు, గ్రామ్యం అని మరి రెండు విభాగాలు చేశాడు; తత్సమంతప్ప తక్కిన నాలుగు అచ్చ తెనుగే అన్నాడు— పంచపాండవులంటే మంచంకోళ్ళలాగ అనే సామెతగా. అచ్చ తెనుగు అనే పదాన్ని తనకు దాదాపు సమకాలికుడైన కన్నడవైయాకరణుడు కేశిరాజు రచించిన శబ్దమణిదర్పణంలోని అపభ్రంశ ప్రకరణంలో వాడిన అచ్చగన్నడమనే పదం నుంచి సృష్టించుకొని ఉంటాడు.[12] ఇతడు కన్నడ ప్రాకృతాలు బాగా వచ్చిన వాడు; కర్నాటక భాషా భూషణాన్ని అనుసరించే ఆంధ్ర భాషాభూషణం రచించాడు.[13]

ఏతావతా దాదాపు బుద్ధుని కాలం నుంచే బౌద్ధం వ్యాపించిన తెలుగు దేశంలో, పల్లవుల సామ్రాజ్యం చివరి వరకు ప్రాకృతం శాసన భాషగా ఉన్న తెలుగు దేశంలో తెలుగుపై ప్రాకృత ప్రభావం ఎక్కువగానే పడి ఉంటుంది. అలాగే దేశీయాలయిన తెలుగు పదాలు ప్రాకృతంలో చేరడం సహజం. ఈ ఆదాన ప్రదానాలు తెలిపే పదాలను, వాటిలోనూ మొదట పాలీ ప్రాకృతం నుంచి చేరిన పదాలను దిగువ పట్టికగా ఇచ్చాను. వీటిని రైస్‌డేవిస్ పాలీ–సంస్కృత నిఘంటువునుంచి మిత్రులు శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారు ఏర్చి తెలుగు గోష్ఠిలో చదివారు. వాటిపై విశేషంగా చర్చ జరగింది.[14]

| పాలీ | తెలుగు |
|---|---|
| అంస | అంచు |
| అక్కస | అక్కసు |
| అచ్చి (కాంతి) | అచ్చిరావడం |
| అచ్చిబంధ | అచ్చుకట్టు |
| అచ్చరిఓ | అచ్చెరువు |
| అజ్ఞాస | ఆడియాస |
| అన్న (జ్ఞానం) | అన్నెం |
| అనయ | అనయం |
| అంబిల | అంబలి |
| అమ్మా | అమ్మ |
| అయ్యా | అయ్య |
| అరే (సంబోధన) | అరే |
| అలగ్గ | అలగా |
| అబద్ధ (అస్పృతం) | అబద్ధం |
| అబోభరిక | ఎబ్బేరికం |
| అబ్బు | అబ్బో |
| ఆగు | అగం |
| ఆణత్తి | ఆనతి |
| ఆదా | ఆదా |
| ఆదేయ్య | ఆదుకొను |
| ఆరకత్త | ఆరికట్టు |
| ఆస | ఆస |



| పాలీ | తెలుగు |
|---|---|
| ఇంగిత | ఇంగితం |
| ఇంఘాల | ఇంగలం |
| ఇచ్చక | ఇచ్చకం |
| ఉగ్గి (మింగు) | ఉగ్గు |
| ఉక్క | ఉక్క |
| ఉగ్గహ | ఉగ్గడించు |
| ఉణ్ణి | ఉన్ని |
| ఉదీరణ | వదరు |
| ఉస్సావ (కారు) | ఉచ్చ |
| ఉద్దార | ఉద్దర |
| ఉవ్వత్తి (ఉత్పాతం) | ఉత్పత్తిపిడుగు (శాసనాలలో) |
| ఉపజ్జ | ఓజ |
| ఎత్తావత్తా | ఏతావతా |
| ఏధ | ఎదుగు |
| ఏస | ఈయస |
| ఏసిన్ | ఏచి |
| ఓఅర | ఒయ్యారం |
| ఓకిరణ | ఓకిరింపు |
| ఓకిలిణి | ఓకిలింపు |
| ఓడ్డేతి | ఒడ్డు |
| ఓడ్డ | ఒడుపు |
| ఓడ్డి | వద్ద, యొద్ద, ఒడ్డు |
| ఓర | ఓర |
| ఓరత | ఊరట |
| ఓసరణ | ఓసరిల్లు |
| ఓహరణ | ఓహిరిసాహిరి |
| కంస | కంచు–కంచం |
| కట్ట | కట్టె |
| కత్తరి | కత్తెర |
| కబ్బ | కబ్బం |

| పాళీ | తెలుగు |
|---|---|
| కంబలిఅ | కంబళి |
| కమ్మార | కమ్మరి |
| కరకర | కరకర |
| కలేబర | కళేబరం |
| కసంబు | కసవు |
| కాచ | గాజు |
| కిచ్చ | కించ, క్రించు |
| కిటిక | కిటికి |
| కుంచిక (తాళం చెవి) | కుంచకోలు |
| కుటిక | గుడిసె |
| కుటవ | గూడు |
| కుడ్డ | గోడ |
| కుణి | కునియు, గునియు(వంగు) |
| కుండ | కుండ |
| కుసి (విషువుల చీవరాలపై అడ్డుకుట్టు, చీల) | కుసి (మంచపు) |
| కూర | కూర, కూడు |
| కోణ | కొన |
| కొట్టణ | కొట్టుట (కొట్నాలు) |
| కొంత | కొంటె |
| కొంట | కుంటు |
| కజ్జిక | కజ్జం, కజ్జికాయ |
| కంబ | కంబం |
| ఖిట్ట | కిట్టెం, చిట్టెం |
| ఖార | కారం |
| ఖీల | చీల |
| ఖుడ్డక | కొండిక, కొద్ది, కొలది |
| గద్ద | గద్ద |
| గారవ | గారవం |
| గుల | గుల, గుల్ల |
| గేండుక | చెండు |



| పాళీ | తెలుగు |
|---|---|
| గేరుక (రంగు) | జేగురు |
| గోన | గోద, గొడ్డు |
| ఛాగ | ఛాగం |
| చిక్కల్ల (బురద) | చిక్కన |
| చిత్తి | చిత్త (నక్షత్రం) |
| చిల్లక | చిలుకకొయ్య |
| చీర | చీర |
| చున్నం | సున్నం |
| చొక్క | చొక్కమైన (చొక్కటం) |
| ఛక్క | చక్క (ఆరు) |
| చిద్ద (చినిగిన) | చెడ్డ |
| జూత | జూదం |
| జోతి | జోతి |
| తక్కర (దొంగ) | టక్కరి |
| తట్టుక | తట్ట |
| తట | తట్టు (అతట్టు) |
| తట్టిక | తడిక, తడక |
| తతీయ | తదియ |
| తంతి | తంతి |
| తరీ | తరి (నౌక) |
| తన్హా | తనుపు, తనియించు |
| తాంబ (తామ్రం) | తాంబాణం |
| తరచ్చ (చిరుత) | త్రచ్చు |
| తాళ (తాళంచెవి) | తాళం (చెవి) |
| తాపిత | తాపించిన |
| తిట్ట (గట్టి) | దిట్టం |
| తిన్హ | తిన్నని |
| తిప్ప | తిప్పలు |
| తీరణ | తీర్పు |
| తీరేణ | తీర్పుతున్న |
| తేమన | తేమ |

| పాళీ | తెలుగు |
|---|---|
| థావర (నిలుచు) | తావరం, తావలం |
| థిర | తిరం |
| దత్తి (దానం) | దత్తి |
| దద్దు | దద్దుర్లు |
| దప్ప (లావు) | దప్పం |
| దుట్ట | తుట్ట (పురుగు) |
| దుపట్ట | దుప్పటి |
| ధమ్మ | ధమ్మం |
| ధోవతి | దోవతి |
| ధారణి | ధారుణి |
| నంగల | నాగేలు, నాగలి |
| నవక | నవకం |
| నావా | నావ |
| నామ | నామం |
| సిక్కన్న (వ్యాపించిన) | సిక్కన |
| నిక్కహ | నిక్కవం |
| నిజ | నిజం |
| నిచ్చ | నిచ్చలు |
| నిట్ఠ | నిట్టనిలువు |
| నిభ | నిభాయించు, నిభం |
| నిసభ (నాయకుడు, రాజకుమారుడు) | నిసబు (శ్రేష్ఠ) |
| నేఉణ్ణ | నేర్పు |
| పకతి, పకతిక | పగిది |
| పక్క | పక్క |
| పజ్జ (దారి) | పజ్జ |
| పతిన్నా | ప్రతిన |
| పన్న, పన్ను | పన్నుగడ |
| పణ్ణ (దానం) | పణ్ణస |
| పణ్ణసన్న (సరిహద్దు సూచించే ఆకుముడి) | పణ్ణస (శాసనాలలో) |
| పంత (ఎల్ల) | పొంత |



| పాళీ | తెలుగు |
|---|---|
| పంతి | బంతి |
| పయుత (పెరిగినది, ముడిపడినది) | పయ్యెద (?) |
| పయుగ్గ | పగులు |
| పలిఘ | పలుగు |
| పసు | పసులు |
| పల్లల (చిన్నసరస్సు) | పల్లం |
| పాలి (ఉచితం) | పాడి |
| పిల్లక | పిల్ల |
| పుణ్ణ | పున్నెం |
| పున్నమ | పున్నమ |
| పుథవి | పుడమి |
| పూగ | పోక |
| పూగ | ప్రోగు, పోగు |
| పేటక (పిటకసంబంధి) | పెటకం |
| పేల (ముద్ద) | పెళ్ళ |
| పేలిక | పేళ్ళగంప |
| పోసీఅ | ప్రోచు |
| ఫణక | పడగ |
| ఫరతి | పారు |
| బిల | బిళ్ళ |
| బుజ్జన (గుర్తించు) | బుజ్జగించు |
| బొంది | బొంది |
| భక్కన్ (తిననిచ్చు) | బొక్కు |
| భణతి | బాణి |
| భము | బొమ్మ (కను) |
| మంకు (చిక్కులోపడ్డ) | మంకు (పట్టు) |
| మంతణ | మంతనం |
| మచ్ఛర | మచ్చరం |
| మర్యాదా | మర్యాద |
| మరుమ | మొరుం, మురస |

| పాళీ | తెలుగు |
|---|---|
| మల్లక | మల్ల (మట్టికంచం) |
| మసి | మసి |
| మస్సు (అమస్సు) | మీసం (మీసం లేనిది) |
| మానిక | మానిక (నాలుగుద్రోణాలు) |
| మాయ (మోసం) | మాయ |
| మిగ | మెకం |
| మిల్హ, మయిల | మైల |
| రక్కస | రక్కసి, రాకాసి, రక్కసుడు |
| రచ్ఛ (దారి) | రచ్ఛ (బండ) |
| రిత్త | రిత్త |
| లంచ | లంచం |
| లహు | లగువు |
| వంక | వంక, వంకర |
| వచ్ఛ (మలం) | ఉచ్ఛ |
| వత్తిక | వత్తి |
| వడ్ఢి (పెరుగుట) | వడ్ఢి |
| వణ్ణ | వన్నె |
| వణ్ణియ | వన్నె |
| వత్థ | బట్ట |
| వద్ద | బద్దె |
| వసభ | బసవ |
| వాట | వాడ, వాటా |
| వాల (క్రూరమైన) | వాలు (మెకం) |
| వికట | వికటం (అకటా) |
| విన్నాణ | విన్నాణం |
| విలుగ్గ (విరిగిన) | విరుగు |
| విలార (బిడాల) | ఇలారం (ఇల్లు, ఇలారం) |
| విసుక | విసుగు |
| వేత్త | బెత్తం |



| పాళీ | తెలుగు |
|---|---|
| వేలా | వేళ |
| వేర | వేరం |
| వోకర | ఓకరింపు |
| సంగతి (సంఘటన, ప్రమాదం) | సంగతి |
| సంథన | సంతనసేయు |
| సంబళ (బిద) | సంబళం |
| సంబుక | చెంబు |
| సంభార (అవసర వస్తువులు) | సంబారం |
| సక్క | చక్క (బరచు) |
| సక్కలి | చక్కిలం |
| సచ్ఛ | సచ్ఛం |
| సజ్జ (ఆసనం) | సజ్జ |
| సన్న | సన్న |
| సన్హ (సుకుమార) | సన్నని |
| సత్తు | సత్తుపిండి |
| సద్ద | సద్దు |
| సుక్క | చుక్క (నక్షత్రం) |
| సున్న | సున్న |
| సొంది (సహజ సంభాషణ) | సోదె, సొద |
| సుంక | సుంకం |

పైన పేర్కొన్న పదాలలో ఆదాన ప్రదానాలు ఎట్లా జరిగాయో చెప్ప లేము. ఈ విధంగానే తెలుగు పదాలు ప్రాకృతాలలో చేరి, తద్వారా సంస్కృతంలోను ప్రవేశించాయి. ఇట్లా తెలుగు పదాలు సాతవాహనుల కాలంలో ప్రాకృత భాషావ్యవహారంలోను, సాహిత్యంలోను చేరాయి. ప్రాకృత సంస్కృత శాసనాలలో తెలుగు ఊళ్ళయిన వేంపూరు మొదలయిన వాటి పేళ్ళు, దాన గ్రహీతల పేళ్ళు కనిపిస్తాయి. ప్రస్తుతం మనకు లభిస్తున్న అతి ప్రాచీన తెలుగు పదాలు సాతవాహన చక్రవర్తుల ద్విభాషా నాణేలలోనివి. ఈ నాణేల ఒకవైపు ప్రాకృతంలోను, మరొకవైపు తెలుగులోను చక్రవర్తుల పేర్లున్నాయి. వీటిని సుప్రసిద్ధ పురాతత్త్వ శాస్త్రజ్ఞులు డాక్టర్ ఇంగువ కార్తికేయ శర్మగారు స్పష్టంగా చదివి ఎపిగ్రాఫికా ఇండికా 4వ సంపుటి లో ప్రచురించారు. ఈ

నాణేలు పులమావి, శాతకర్ణి, యజ్ఞశ్రీ శాతకర్ణి చక్రవర్తులవి చెరి ఒకటి. మొదటిది: 'అరహణకు వాసిట్ఠీ మాతనకు తిరు పులమావికు.' దీని అర్థం అరసుడైన వాసిష్ఠి కుమారుడైన శ్రీ పులమావియొక్క. రెండవది : "అరహణకు వాసిట్ఠీ మాతనకు తిరు హాతకణికు." దీని అర్థం అరసుడైన వాసిష్ఠిపుత్రుడైన శ్రీ శాతకర్ణియొక్క. మూడవది : అరహణకు గోతమీపుతకు తిరు యనహాతకణికు." దీని అర్థం అరసుడైన గౌతమీపుత్ర శ్రీ యజ్ఞశాతికర్ణియొక్క.'[15]

తత్సమీకరణం కూడా ఆ కాలంలోనే ప్రారంభమయింది. నాగబు అనే పదం గల ఒక బ్రాహ్మీ శాసనఫలకం మద్రాసు మ్యూజియం ఆవరణలో ఉన్న దానిని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు గుర్తించి వివరించారు. దీనిని నేను మనలిపి పుట్టుపూర్వోత్తరాలలో గ్రహించచాను.[16] ఇది విడిపదంకాదని నాగబుదస అనే పేరులోని భాగమని, నాగశబ్దానికి 'బు' ప్రత్యయం చేరిన తత్సమ పదం కాదని డాక్టర్ కార్తికేయ శర్మగారు విమర్శించారుగాని, ఈ నాగబు అనే అక్షరాలున్న ఫలకం పక్కన విరిగినా, బుదస అనే అక్షరాలు ఉన్నవని చెప్పదగినంత ముక్క విరగలేదు. శిల్పి అక్షరాలను బట్టి శిలా ఫలకంపై పొందికగా చెక్కుతాడుగాని, ఐదక్షరాల పేరును ఫలకం మధ్య నుంచి ప్రారంభించి చెక్కడు. కనుక నాగబు అనే మూడక్షరాలకు సరిపోయినంతమాత్రం గ్రహించి అటు ఇటు సమానంగా స్థలం వదలినట్టు స్పష్టం.

ప్రాకృతం కొన్ని శతాబ్దాలు తెలుగునాట శాసన భాష గనుక స్థానిక తెలుగు పదాలు కూడా ప్రాకృతంలో చేరాయని ఇదివరకే చర్చించాము. సాతవాహన చక్రవర్తి అయిన హాలుడు సేకరించి గూర్చిన గాథా సప్తశతిలో ప్రాకృత వేషంలో ఉన్న తెలుగు పదాలు చాలా ఉన్నాయి. అల్లాంటి వాటిని దాదాపు 40 దాకా నేను ఐదు దశాబ్దాల క్రితమే తొలిసారిగా భారతిలో ప్రచురించి తర్వాత మరి కొన్ని వ్యాసాలతో కలిపి పుస్తక రూపంలోను ప్రచురించాను. వాటిని కొన్నిటిని ఇక్కడ ఉట్టంకించడం అవసరమని భావిస్తున్నాను:

| పాకృతం | తెలుగు |
|---|---|
| అత్తా | మేనత్త, అత్త |
| వాలుంకి | వాలుగ |
| పీలుఅ | పిల్ల, పిలక |
| పోట్టం | పొట్ట |
| కిలించిఅ | క్రించు, కిలించల్ |
| అడ్డాఏ | అద్దంలో |



| పాకృతం | తెలుగు |
|---|---|
| భోండి | పంది |
| సరఅం | చెఱకు |
| తుప్ప | నేయి (తువ్వాయి, తురుపు) |
| ఫలహీ | పత్తి |
| వేంట | వెంటు |
| సిప్పర | చివ్వరగడ్డి |
| తాలూర | తలారు (సుడి) |
| మఢహసరిఆ | మడవ |
| ఓ! | ఓ! |
| ఓడ | ఓడు, అవిటి |
| సాఉలీ | శాలువ |
| మఇల | మైల |
| పాణ | పాణిసి |
| తీర (ఏ) | తీరదు |
| కుసుంభ | కుసుమపూవు |
| ణడిజ్జఇ | నలియు |
| పక్కల | మొక్కలీడు |
| చటుఅం | చట్టువం |
| దోగో | దారం |
| ఉడే | పీడు |
| అవ్వో! | అవ్వో! అమ్మో!! |
| బిసణేమి | విసరివేస్తున్నాను |
| దే! | అదో! |
| పేచిరీ | పేచీకోరు, పెచ్చారి |
| ఉప్పంగ | ఉప్పొంగు |
| అత్థక్క! | అమ్మక్క! |
| పలాల | పులు |
| అలాహి | ఒల్లి |
| ఉఅ, ఉఅహ | ఓయీ! (చూడు) |
| కఫ | కై (చతురీవి) |

| ప్రాకృతం | తెలుగు |
|---|---|
| సురసురంతి | సురసురమని |
| థరహరంతి | థరథరమని |
| సణిఅం | సన్నగా |
| థుక్కాథుక్కఇ | తుకతుకలాడుతున్నది |
| పుప్ఫుఆ | పిడకల నివ్వ |
| చోజ్జం | చోద్యం |

ఇట్లాగే 8వ శతాబ్దిదైన వజ్జాలగ్గమనే సంకలనంలోను చాల తెలుగు పదాలు కనిపిస్తాయి. జయవల్లభుడనే శ్వేతాంబర జైనకవి దీనిని సంకలనం చేశాడు. దీనిలో 24 తెలుగు పదాలు ప్రాకృత వేషంలో ఉన్నాయి:[18]

| ప్రాకృతం | తెలుగు |
|---|---|
| వింతర | వింతయిన |
| అవట్టవి | పట్టిపోతున్నది |
| ఓః (సంబోధనం) | ఓః |
| కసరక్క | కసురుకాయ |
| తలిసేహి | తలిరులచేత |
| విసూరణం | ఉస్సురను |
| దేః | అదోః అదిగోః |
| సడిజ్జసు | సలియు |
| సాహేఇ | చాటుతున్నది |
| (సుణ) హిల్లియా | (కుక్క) పిల్ల |
| చంపిఊణ | చొనుపు (అదుము) |
| ఢుక్కోడియా | తుకతుకలాడు |
| గగ్గర | గగ్గర (ధ్వని) |
| తవణీ (మెతుకు) | తరవాణీ (మెతుకు) |
| వేలియా | వెలయాలు |
| ఉబ్బేఇ | ఉబ్బుతున్నది |
| కాణా | కానసివాడు |
| డలియా | దొర్లు |
| కరడియం | కర (మురికి) చేయు |
| ఘఘోఘఢ | ఘెరడు |



| ప్రాకృతం | తెలుగు |
|---|---|
| ఝారేఇ | ఝరఝర—ఝరఝర మంటున్నది |
| ఢురుఢుల్లంతో | దొర్లుతూ |

ఈ ఆదాన ప్రదానాలను బట్టే డాక్టర్ చిలుకూరు నారాయణరావుగారు తెలుగు మూలం ప్రాకృత సంస్కృతాలని అభిప్రాయపడ్డారు. ఈ అభిప్రాయం క్రొత్తదేమీ కాదు. మన ప్రాచీన వైయాకరణులందరూ "తల్లి సంస్కృతంబు ఎల్లభాషలకును" అన్నవారే. చిలుకూరి నారాయణ రావుగారు నన్ను చూసినప్పుడెల్లా ద్రావిడ భాషావాద సన్నిపాతజ్వరితుడు అని హాస్యం చేసేవారు. ఆయనతోను, తర్వాత సంస్కృత ప్రాకృతాంధ్ర మహావిద్వాంసులు రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారితోను జరిపిన అనేక చర్చల వల్ల ప్రాకృత తెలుగులకు జన్యజనక సంబంధం వంటి సన్నిహితత్వం ఉన్నదనిపిస్తుంది. చిలుకూరి నారాయణరావుగారు తమ ఆంధ్రభాషా చరిత్రలో చాలా తెలుగు పదాలకు సంస్కృత ప్రాకృత వ్యుత్పత్తి సాధించారు. దానిని అంతగా తీసివేయడానికి వీలులేదు.

కన్నడంలోను ఈవాదం పాతకాలం నుంచి ఉంది. 13వ శతాబ్దంలో ఉన్న కర్నాటక వైయాకరణుడు చెన్నవీరకవి కాశకృష్ణ ధాతుపాఠానికి వ్యాఖ్య వ్రాస్తూ చాల వైకృతపదాలకు— కన్నడ తెలుగు తమిళాల ఉమ్మడి పదాలనదగిన వానికి కాశకృష్ణధాతువులతో వ్యుత్పత్తి సాధించాడు. ఇది కన్నడ వ్యాఖ్య. దీనిని యుధిష్ఠిర మీమాంసకులనే పండితులు సంస్కృతీకరించారు. వాటిలో కొన్ని మాటల వ్యుత్పత్తిని ఉదాహరిస్తాను:-

అట=అటగతౌ. భ్రమతి, క్రీడయతీతి అటః=క్రీడనమ్.

ఈటె=ఏటతి. తాడయతి. ఈటగతౌ. ఈటిః=అస్త్రవిశేషః

చేట=చిల్ప్రేష్యే. మానేచ. చేటతి. శూర్పేణ నిష్పవన క్రియాం కరోతి. చేటః=శూర్పే.

ఏట=ఇటగతౌ. ఏటతి, ప్రక్షిపతి. ఏటః=ప్రక్షేపణమ్.

చాకలి=చకతృప్తౌ, శీతీభావేచ. చకయతి. చకతి. శీతీభవతి. చాకలః=రజకః. చాకలి=రజకీ.

చాప=చపసాంత్వనే. చపతి. సంతుష్టో భవతి. చాపా=కటమ్.

గూడెం, గూడు=గూడ నివాసే. గూడతి. నివసతి, గూడుః=గ్రూడెం =నివాసస్థానం.

పండుః=పడి గతౌ. పండతే. ప్రసరతి. పండుః=ఫలమ్.

పిల్ల=పిల్ల చలనే. పిల్లతి నినదతే. పిల్లః=వత్సః, పిల్లా=వత్సా.

మంట=మటి దాహే. మంటతి, జ్వలతి. మంటః=జ్వలనమ్.

ఆవు=అవ రక్షణపాలనే. అవతి. పాలయతి. ఆవుః=గౌః.

గరిక=గృ సేచనే. ఘరతి. ఘర్షయతి. గరికా=దూర్వా.

ముల్లు=ముల్ల ధారణే, ఘర్షణేచ, ముల్లతే. ముల్లుః=కంటకమ్.

త్రాసు=త్రసి ఉద్వేగే. త్రస్యతి. ఉద్విజతి. త్రాసుః=తులా.

పోరః పోరీ=పుర అగ్ర గమనే, పురతి అగ్రేగచ్ఛతి. పోరః=పుత్రః, పోరీ=పుత్రీ.

వాన=వన సంసక్తే. వనతి. విస్తృతోభవతి. వనం. జలం. వానః=వర్షాః

బిల్లు(విల్లు)=బిల్ల గతౌ. బిల్లతి. ఇషుంప్రక్షిపతి. బిల్లుః=ధనుః.

నాయి=నయ రక్షణే, చారణే చ. నయతే. రక్షతి. నాయి=శునీ.

అంచు=అంచు గతి పూజనయోః. అంచతి. అంచుః=తటమ్.

గాజుః=గజ శబ్దౌ. గజతి. గాజుః=కంకణమ్.

పిట్ట=పిట్ట చలనే. పిట్టతి చలతి. పిట్టః=పక్షీ.

గోడ=గోడృబంధనే. గోడ్రతి బంధయతి. గోడః=భిత్తిః.

దండ=దండ హింసాగత్యోః. దండయతి. దండా=మాలా.

జాణ=జణశబ్దే. జణతి. జానాతి. జాణః=బుద్ధిమాన్.

సాని=షణుదానే. సనతి. సనుతే. దదాతి. సాని=మాతా.

ఈ విధంగా చాలా పదాలకు ఇతడు వ్యుత్పత్తి సాధించాడు. ఈ ఆదాన ప్రదానాలు ఎక్కువగా ఉన్నందునే చిలుకూరి నారాయణరావుగారు తెలుగుకు మూలం ప్రాకృత సంస్కృతాలని విశ్వసించడంలో తప్పుకనిపించదు.[20]

తెలుగు కన్నడాలలో ప్రవేశించిన తద్భవ పదాలు పరిశీలిస్తే నూటికి నూరుపాళ్ళు ప్రాకృతభవాలో, పాకృతసమాలో అయిఉన్నవి గాని సంస్కృత భవాలు కావని చెప్పవచ్చు. ప్రాచీనుల ప్రకారం సంస్కృత భవాలైనప్పుడు ప్రాకృత పదాలే అవుతాయి. కనుక సరాసరి తెలుగులో చేరే ప్రసక్తే లేదు. సరాసరిగా చేరినవి తత్సమాలు మాత్రమే. కన్నడ వైయాకరణులు, కేతన మొదలైన తెలుగు వైయాకరణులు అవ్యయాలను, సంస్కృత సిద్ధరూపాలను తెలుగులో సరాసరిగా వాడగూడదని చెప్పారుగాని, కేరళ భాషలో సంస్కృత విభక్తి ప్రత్యయాలు ప్రయోగించి రచించిన కావ్యాలు ఎన్నో ఉన్నాయి. ఉదాహరణకు : రామః రావణనె కొన్ను. రామన్ రావణం హత్వా సీతయై



గ్రహిచ్చు. మనకు కూడా మల్లినాథ సూరి చెప్పినట్లు వ్యవహారంలో ఉన్న శ్లోకాలు ఇలాటివి లేకపోలేదు. మల్లినాథుడు సర్వజ్ఞ సింగభూపాలుని ఆస్థానానికి ఎలాటి ఆడంబరమూ లేకుండా పోతుండగా ఎవరో ఆక్షేపించగా, సమాధానం ఇట్లా ఇచ్చాడు :

కిం దారుణా వంకరటింకరేణ
కిం వాససా చీకిరిబాకిరేణ,
సర్వజ్ఞభూపాల విలోకనార్థం
వైదుష్య మేకం విదుషాం సహాయః.

దీనిలో తెలుగు పదాలకు సంస్కృత విభక్తి ప్రత్యయాలు వాడగా, సంస్కృత క్రియాపదాలు వాడిన శ్లోకాలు కూడా కనిపిస్తాయి.

తిండికైతె బహుమంది వసంతి
తండులాలు సుతరాము న సంతి,
కుండలెల్ల నడిమింట లుఠంతి
ముండలాః కొడుకులెల్ల హసంతి.

ఇంతకూ ప్రాకృతం ఉత్తరార్ధ గోళమంతా ఒకప్పుడు వ్యాపించి ప్రవహిస్తూ వచ్చి, మధ్య ఆసియాలో ఖోటాన్ ప్రాంతం భాషలతో కలిసి చూళిక అయి, మరికొంత దక్షిణంగా, ఆగ్నేయంగా ప్రవహించి పైశాచిగా పేరుపొంది, ఒకపాయతో మగధ ప్రాంతాన్ని ముంచెత్తి మాగధి అయి, మరొక పాయతో విశాల రాష్ట్రం – మహారాష్ట్రం అంతటా వ్యాపించి మహారాష్ట్రి అయి, సింధు నుంచి మరొక పాయగా సముద్రతీరం వెంబడివెళ్ళి శౌరసేని అయి, కలగాపులగమై అపభ్రంశమై చివరకు ఎన్నో రూపాలు పొంది, సారస్వతంలో సంస్కృతంలాగే పుస్తకాల మరుగున దాగిపోయింది.

బౌద్ధమతానికి ఆటపట్టుగా ఉండే నాగార్జున కొండ, మహేంద్రగిరి మొదలు – మహాబలిపురం వరకు, ఇటు అమరావతి మొదలు కొండాపురం వరకు బౌద్ధారామాలు విస్తృతంగా ఉన్న తెలుగు దేశంలో తెలుగుపై ప్రాకృత ప్రభావం పడటం సహజం. కాని, తెలుగు భాషలో ప్రాకృత పదాలు మిగిలిపోయాయి గాని, సాహిత్య విషయంలో తెలుగువారికి కన్నడుల కున్నంత ఔదార్యం లేకపోయింది. జైన బౌద్ధాలు ఎంతో సాహిత్యాన్ని సృష్టించి ఉంటాయి గదా! ఆ మతాలపై ద్వేషంతో ఇతర మతాలవారు ఆ సాహిత్యాలను నామరూపాలు లేకుండా చేసి ఉంటారు. గొప్ప సిద్ధాంతాలతో, ఆదర్శాలతో అవతళ

రించిన ఆరామాలను లజ్జదిబ్బలన్నవారు ఆ సాహిత్యాలను ఏమైనా చేసి ఉండరా, అంతేకాక ఆ శతాబ్దాలలో ఎడతెరపి లేకుండా జరిగిన యుద్ధాలు, బౌద్ధులు హీనయానం నుంచి మహాయానానికి, తత్ఫలితంగా ప్రాకృతం నుంచి సంస్కృతానికి మారడమూ ప్రాకృత ప్రాధాన్యాన్ని తగ్గించి సంస్కృత సాహిత్య ప్రాధాన్యాన్ని హెచ్చించడంవల్లనూ ప్రాకృత సాహిత్యం తెలుగునాట క్షీణించి నశించిందేమో।

నన్నయకు వంద సంవత్సరాల ముందు తెలుగుదేశంలో ఉన్న మహాకవులు పంప జినవల్లభులు ఆత్మరక్షణ కోసం, మత రక్షణ కోసం తెలుగునాడును పాలించే కన్నడ రాజులను ఆశ్రయించారంటె,[21] వారికి సమకాలికుడైన మల్లియరేచన కవిజనాశ్రయంలో సగం చచ్చి మిగిలాడంటే, మత మాత్సర్యం ఎంత ప్రబలమైందో చెప్పనక్కరలేదు.[22] కన్నడులు మత మాత్సర్యం ఉన్నా సాహిత్యాన్ని, సంస్కృతి స్థావరాలైన జైన దేవాలయాలను ధ్వంసం చేసేంత కుసంస్కారులు కాలేదు, కనుకనే సాహిత్యాన్ని చెక్కుచెదరకుండా దక్కించుకున్నారు. మనకు అలాటి ఔదార్యం లేనందున మన సాహిత్యంపై ప్రాకృత సాహిత్య ప్రభావం అంతగా పడలేదని అనాలి. ప్రాకృతాలను చదువు కొన్నవారు నాటకాలలోని ప్రాకృత సంభాషణల అధ్యయనం వరకే తమ పరిధిని ఏర్పరచుకొన్నారని తోస్తుంది. బౌద్ధ జైన ప్రాకృత సాహిత్యాలను చూచినట్లు కనిపించదు.

మన కవులందరు నన్నయ మొదలు చిన్నయవరకు ప్రాకృతవేత్తలే.[23] అప్పకవి,

సంస్కృతము ప్రాకృతంబును శౌరసేని
జగతిపై మాగధియు పైశాచికయును
జూళికయు నపభ్రంశమును సొరిదినాంధ్ర
భాషయును నివి చను నష్టభాషలనగ

అని అష్టభాషలను పేర్కొన్నాడు. నిజానికి ఇవన్నీ ప్రాకృతాలే కాని ప్రాకృతంబును అని విడిగా చెప్పడం గతానుగతికమని తోస్తుంది. ఇతని కన్నా ముందు తాళ్ళపాక అన్నమాచార్యుల మనుమడు చినతిరుమలాచార్యుడు (1537) అష్టభాషాదండకంలో చూళికాపభ్రంశాలకు బదులుగా ప్రాచీ, అవంతీ, అని, ఆంధ్రభాషకు బదులుగా సార్వదేశి అని ప్రయోగించాడు. నన్నయ తనను ఉభయ భాషా ప్రవీణుడనని చెప్పుకొన్నాడు. ఈయన మిత్రుడూ, భారతాంధ్రీకరణంలో తోడ్పడ్డాడనే ప్రథ ఉన్నవాడు అయిన నారాయణ భట్టు (1063)



యస్సంస్కృత కర్నాటక
ప్రాకృత పైశాచికాంధ్ర భాషాసు,
కవిరాజశేఖర ఇతి
ప్రథితః సుకవిత్వ విభవేన.[24]

అని నన్నయతోనే నందంపూడి శాసనంలో ప్రశస్తి పొందాడు. ఇక నవీన గుణసనాథుడైన నాచనసోమన "అష్టభాషా కవిత్వశ్రీ వాణీవిజిత సంపదే" అని బుక్కరాయలతో పెంచుకలదిన్నె శాసనంలో ప్రశంసితుడయ్యాడు. బాలభారత కర్త దోనూరు కోనేరుకవి (1547) తన కృతిపీఠికలో తనను "భాసుర సంస్కృత ప్రాకృతాదిక శాస్త్ర భాషాకవిత్వ సౌభాగ్య నిపుణుడను, వినుతాష్ట భాషా కవిత్వ ప్రచండుడను" అని చెప్పుకున్నాడు. ధరణిదేవుల రామమంత్రి (15. శ.) దశావతార చరిత్రలో "సంస్కృత ప్రాకృతాద్యష్ట భాషాకవిత్వ తత్త్వ సంవేది" (1.16) అని చెప్పుకొని ఒక సీసాన్ని రచించాడు ఆ భాషలలో. కొఱవి గోపరాజు (15శ.) సింహాసన ద్వాత్రింశికలో తాను అష్టభాషావిదుడనని చెప్పుకోడమేకాక ప్రాకృతపదప్రయోగంతో ఒక సీసాన్ని రచించాడు (2.46). గణపవరపు వేంకటకవి (1620-60) ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసంలో షడ్విధ ప్రాకృతాలు వాడుతూ ఒక సీసపద్యం చెప్పాడు (876). రంగాజమ్మ (1633-73) మన్నారుదాస విలాసంలో షడ్విధ ప్రాకృతాలలో ఆరు పద్యాలు రచించడమేకాక "అతులితాష్ట భాషాకవితా సర్వంకష మనీషా విశేష విశారదను" అని చెప్పుకొంది. భాస్కర రామాయణ కవులలో ఒకడైన మల్లికార్జునభట్టు అష్టభాషాకవీంద్రుడు. వైకృతచంద్రికాకర్త మంచళ్ళ వాసుదేవ కవి అష్టభాషా కవిత్వ సామ్రాజ్య పట్టభద్రుడు. ఆంధ్రపాణిని బిరుదాంచితుడు నివర్తి శేషసుమతి అష్టభాషా కవితాకోవిదుడు. మహావైయాకరణుడు. సుశ్రుత శారీరాన్ని తెలుగు చేసిన రాజవైద్యుడు అయిన ఎలకూచి బాలసరస్వతి సకల భాషా కవిగా తనను చెప్పుకోవడంవల్ల ప్రాకృతజ్ఞుడై ఉంటాడని మనం భావించవచ్చు. ఆంధ్రకౌముదీకారుడు మండ లక్ష్మినరసింహాచార్యుడు అష్టభాషా సరస్వతి. సురపురాధీశుడైన రాఘవ పామనాయకుని ఆస్థానంలో ఉన్న విద్వత్కవి కిరీటం వేంకటాచార్యులు ప్రాకృతధురంధరులే. గద్వాల సంస్థాన కవీశ్వరుడు, యథాశ్లోక తాత్పర్య రామాయణం రచనకు ఆధ్వర్యవం వహించి కిష్కింధాకాండను రచించిన కామసముద్రం అప్పలాచార్యులు "మాగధీ భాండీర మాళవీప్రభృతి సత్ప్రాకృతమ్ముల ప్రబంధములు గొన్ని" రచించారు. ఈయన తండ్రి కామసముద్రం కృష్ణమాచార్యులు, యథాశ్లోక తాత్పర్య రామాయణం

సుందరకాండ రచించిన తిరుమల కృష్ణమాచార్యులు ప్రాకృత కవితా ధురంధరులే. పసవ త్రిరాజు బహిరీ గోపాలరావుకు 'అష్టభాషా' అని బిరుదు ఉండేది.

ఇక శ్రీనాథుని గురించి చెప్పనక్కరలేదు. "శాలివాహన సప్తశతి నాడివితి" అని చెప్పుకొన్నాడు. ఇది అతని ప్రాకృతవేదిత్వానికి పెద్ద సాక్ష్యం. దగ్గుపల్లి దుగ్గన నాసికేతోపాఖ్యానంలో శ్రీనాథుని గురించి "సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్య భాషా పరిజ్ఞాన పాటవంబు" అని ప్రశంసించడంవల్ల ప్రాకృత భేదాలు అతనికి కరతలామలకాలని చెప్పవచ్చు.

ఈవిధంగా మన కవులు చాలావరకు అందరూ, ప్రాకృతజ్ఞులే. కాని ప్రాకృతంతో ప్రభావితమైన రచన ఏదీ కనిపించదు. "భాసుర భారతార్థముల భంగులెరుంగ నేరమిన్ గాసట బీసటల్ చదివి గాథలు త్రవ్వు తెలుంగు వారికిన్" భారతం ప్రసాదించాడు నన్నయ అని నృసింహపురాణంలో ఎర్రాప్రగడ చెప్పిన పద్యంలోని గాసట బీసటలు గాథాసప్తశతి, బేతాళ పంచవింశతి అని ఒకమారు, కాశ్యపభట్టు, విశ్వనాథభట్టు అని మరొకమారు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు పేర్కొన్నారు. ఈ రూపాలు ప్రాకృత భాషా సంప్రదాయం ప్రకారం సాధువులని మహావైయాకరణులు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు సమర్థించినా, గాథాసప్తశతి చెత్తచెదారం కాదే? నన్నయకు ముందు, తర్వాత అలంకారికులందూ రసగుళికలని ప్రశంసించి లక్ష్యాలుగా ఉదాహరించిన గాథా సప్తశతిలోని గాథలను ఎర్రన ఈసడించి ఉండడు. ప్రాకృతం మహాయాన బౌద్ధం వల్లనే పాత్రప్రవచనాలనుంచి తొలగిపోయి ఉంటుంది. ఇక శివకవులు ప్రజాకవులన్న మాట నిజమే. కాని, వారు జైనబౌద్ధులకు బద్ధద్వేషులు. కనుక ప్రాకృతాన్ని సుతరామూ మూ చూడనైనా మూ చూడలేదు. ఈ విధంగా ప్రాకృతసంబంధం సాహిత్య మూలంగా విచ్ఛిన్నమైపోయి ఉండాలి.

మనకు పూర్వం విరివిగా ఉండి, మధ్యన విచ్ఛిన్నమైపోయిన ప్రాకృత సాహిత్య సంబంధం శ్రీనాథుని శాలివాహన సప్తశతి అనువాదంతో పునరుజ్జీవితమయిందనవచ్చు. "శాలివాహన సప్తశతి నాడివితిని" అన్న శ్రీనాథుని మాటలను బట్టే గాథాసప్తశతి పూర్తిగా అనూదితమై ఉంటుంది. శ్రీనాథునికి ప్రాకృత సాహిత్యం గురించి బాగా తెలుసు. దండి దశకుమార చరిత్రను అనువదించిన కేతనకు "సాగరస్సూక్తిరత్నానాం సేతుబంధాది యన్మయం" అని దండి పొగడిన ప్రవరసేనుని సేతుబంధం తెలియకుండా ఉంటుందా? కనుక శ్రీనాథునికి తెలియకపోవడమనే ప్రసక్తే లేదు. అటువంటి మహాకావ్యానువాదానికి అతడు ఎందుకు పూనుకోలేదో! శ్రీనాథుడి సప్తశతిలోని ఐదు పద్యాలు దొరకడం మన అదృష్టం, తక్కినవి ఖిలమైపోవడం మన దురదృష్టం.



ఇక ప్రాకృతవైయాకరణులను చూద్దామా అంటే, వారి రచనల ప్రభావం తెలుగు సాహిత్యంపై ఏమీ ఉన్నట్టు కానము. 12-13 శతాబ్దాలవాడైన త్రివిక్రముడు, సంస్కృత వ్యాకరణ గ్రంథాలలో భట్టోజిదీక్షితుల సిద్ధాంత కౌముదిలాగా ప్రాకృతానికి షడ్భాషాచంద్రిక ప్రసాదించిన లక్ష్మీధరుడు (16 శ.), ప్రాకృత మణిదీపం వెలిగించిన అపరశంకరులు అప్పయదీక్షితులు (16-17 శ.), మరికొందరు ప్రాకృతవ్యాకర్తలు తెలుగువారైనా, తమ ప్రాకృత రచనలతో తెలుగు సాహిత్యాన్ని ప్రభావితం చేయలేరు.

గుణాఢ్యుడు పైశాచీ ప్రాకృతంలో రచించిన బృహత్కథ ప్రపంచ కథాసాహిత్యంలోనే మొట్టమొదటిది. గుణాఢ్యునికి సంబంధించిన కథలే నిజమైతే, ఇతడు మనకు చాల సన్నిహితుడు. గాథలు త్వ్వే తెలుగువారు ఈ కథలను పూర్తిగా స్వాయత్తం చేసుకోవలసింది. కాని అట్లా జరుగలేదు. ఈ బృహత్కథ సంస్కృతానుసరణలన్నీ మనకు కాశ్మీర కవులవే లభించాయి. బృహత్కథను బుధస్వామి (9.శ) బృహత్కథా సంగ్రహమనే పేర, తర్వాత క్షేమేంద్రుడు (10.శ), బృహత్కథా మంజరి అని, అతనికి కనిష్ఠ సమకాలికుడైన సోమదేవసూరి కథాసరిత్సాగరమని సంస్కృతీకరించారు. వీళ్ళందరూ తాము మూలాతిక్రమణ చెయలేదని, సంకోచవ్యాకోచాలు మాత్రమే చేశామని చెప్పుకొన్నారు. కాని ఈ అనువాదాలలో పదవ శతాబ్దం వరకు (రచయితల కాలంవంకు) ఉన్న సంస్కృత కావ్యేతివృత్తాలు కనిపించడంవల్ల పండితులకు బృహత్కథ పరిమాణ ప్రామాణికతలను గురించి సందేహాలు కలిగాయి. ఇది తమిళంలోని "పెరుంగదై" కు సంస్కృతీకరణమేమో అని శ్రీవేదంవెంకటరాయశాస్త్రి (ఎం. ఎ) అభిప్రాయం. ఇతరోపజ్ఞమైన కథలూ దీనిలో చేరాయని అయన అభిప్రాయం.[25]

ఈ బృహత్కథా ప్రభావం సంస్కృతానుసరణ మూలంగా తెలుగు సాహిత్యంపై బాగానే పడింది. శ్రీనాథునికి కనిష్ఠ సమకాలికుడైన జక్కనకు ప్రాకృతం గురించి బాగా తెలుసు. దీనికి అతని విక్రమార్క చరిత్ర అవతారికే సాక్షి. ఇతని విక్రమార్క చరిత్ర సంస్కృత విక్రమార్క చరిత్రకు అనువాదం కాదు. సంస్కృత విక్రమార్క చరిత్రలోని కొన్ని కథలు జక్కన రచనలో కనిపించినా, దీనిలోని చాల కథలు సంస్కృత రచనలో లేవు. సంస్కృత రచనలోని కథలెన్నో జక్కన రచనలో లేవు. జక్కన రచనలోని కొన్ని కథలకు మూలాలు బృహత్కథా మంజరి, కథాసరిత్సాగరాలలో కనిపిస్తాయి. అలాగే తెలుగు బేతాళ పంచవింశతిలోని కొన్ని కథలకు మూలాలు బృహత్కథామంజరీ, కథాసరిత్సాగరాలలో కనిపిస్తాయి. అందువల్ల

పరోక్షంగా దీనిని ప్రాకృత ప్రభావ మనవచ్చు.[26] డాక్టర్ నీరజా చక్రవర్తి తమ సిద్ధాంత వ్యాసంలో ఈ విషయాన్ని బాగా విశ్లేషించారు.

పెద్దనామాత్యుని మనుచరిత్రేతివృత్తం మక్కికి మక్కీ బృహత్కథా మంజరీ కథా సరిత్సాగరాలలో ఉన్నా, అతడు తాను ఇతివృత్తాన్ని మార్కండేయ పురాణంనుంచి గ్రహించానని కంఠోక్తిగా చెప్పడం వల్ల, అతని మాటను నమ్మక తప్పదు. నిరంకుశోపాఖ్యానం ఇతివృత్తం బృహత్కథలోదే. రుద్రకవికి తెలిసిన బృహత్కథా మంజరి, కథాసరిత్సాగరాలు పెద్దనామాత్యుడికి తెలిసి ఉండకపోవు గదా! మన కవుల దృష్టి పురాణాలపై ప్రసరించినట్లుగా బృహత్కథా మంజరీ, కథా సరిత్సాగరాలపై పడలేదు. ఎందుకో!

కదిరీపతి రచించిన శుక సప్తశతి కూడ కర్ణాకర్ణికగా విన్న కథల గుచ్ఛమే కాని సంస్కృత శుకసప్తశతి అనబడే దాని అనువాదం కాదు. సంస్కృతంలో ప్రచురించిన శుక సప్తశతిలో ప్రారంభంలో ఒక ఆర్య తరువాత దానిని విశదీకరిస్తూ వచనంలో కథలున్నాయి. దాని పద్ధతే వేరు. తెలుగు శుకసప్తశతిలోని కొన్ని కథల మూలాలు బృహత్కథా మంజరీ, కథాసరిత్సాగరాలలో కనిపిస్తాయి, కనుక ప్రాకృత ప్రభావం పరోక్షంగా ఉంది.

నన్నయకు వంద సంవత్సరాల ముందు కూడా తెలుగునాట ఒకవైపు బౌద్ధం, మరొక వైపు జైనం జనాదరణం పొందుతూనే ఉన్నాయి. కాని, ఆ మతాలు క్షీణదశలో ఉన్నాయనవచ్చు. పొరుగున ఉన్న కన్నడ తమిళ దేశాలలో జైన బౌద్ధాలు క్షీణించి శైవ వైష్ణవ మతాలు ప్రబలుతున్నాయి. తమిళంలో భారతం అదివరకే వెలసింది కావ్యంగా. రాజరాజనరేంద్రునిశ్వశుర గృహం తమిళనాడే గనుక భారతం తమిళలలో వెలసిందని అతడు ఎరుగును. కన్నడ భారతమైన విక్రమార్జునవిజయం సంగతి కూడా రాజరాజనరేంద్రునికి తెలుసు. నన్నయ విక్రమార్జున విజయమనే కన్నడ భారతాన్ని చదివాడన డానికి ఆయన భారతంలోనే అంతస్సాక్ష్యాలున్నాయి. నన్నయకు కన్నడం, ప్రాకృతం అభిలషణీయాలైనా మతం అడ్డు వచ్చింది. వైదిక ధర్మ పునః ప్రతిష్ఠాపన దృష్టితో భారత రచన అవసరమైంది. కనుక తాను వ్యాసభారతాన్ని కట్టుదిట్టంగా అనువదించదలుచుకొన్న పద్ధతిని ముందుగానే స్పష్టంగా చెప్పకొన్నాడు. భారతానువాదమంతా ఆయన చేతిమీదుగానే జరిగి ఉంటే ఎట్లా ఉండేదో! (పరిహారాలు లేక వ్యాసభారతం యథాతథంగా అవతరించి ఉండేది.) తర్వాత దానిని అనువదించిన తిక్కన ఎర్రనలు కావ్యదృష్టి కలవారయినా, ప్రధానంగా నన్నయ మార్గాన్ని విడనాడలేదు గనుక ప్రాకృత ప్రభావం మతం అడ్డురావడంవల్ల పడలేదు.



కాని తెలుగు రామాయణంపై ప్రాకృత ప్రభావం బాగానే పడింది. రామాయణమంటే వాల్మీకి రామాయణం. ఎవరు ఏమి చెప్పినా, ప్రక్షిప్తాలు చాలా ఉన్నాయని ఒప్పుకున్నా, రామాయణ ప్రధాన కథ వాల్మీకి ఉపజ్ఞం. ఇది బుద్ధునికి ముందే రచితమై ఉండాలి. అట్లా కాకపోతే బుద్ధుడు తాను ఇక్ష్వాకు వంశం వాడినని పదే పదే చెప్పుకోడం, తానే ఒక జన్మలో రాముడి ననడం జరుగదు. రామకథ బుద్ధునికి, మహావీరునికి ముందే జనంలో బాగా వ్యాప్తిలో ఉన్నందున ఈ రెండు మతాలవారు తమ మతాలు ప్రాచీన సాంప్రదాయిక ఇతిహాస పురాణాలకు భిన్నమైనవి కావని జనాన్ని నమ్మించడానికి నానాయాతన పడ్డారు, నానా ప్రచార పద్ధతులతో. పూర్వమూ, సమకాలంలోను ఉన్న వైదికమత గ్రంథాలను మార్చి తమవిగా వ్రాసుకోడం, తామే నిజం వ్రాస్తున్నా మనడం జైన బౌద్ధాలకు పరిపాటి. జనంలో ప్రచారంలో ఉన్న వాటిని కొద్ది కొద్దిగా మారుస్తుంటే జనం అంతగా పట్టించుకోదు, క్రమంగా ఆకృష్టమౌతుంది. ఇదీ జైన బౌద్ధుల ప్రచార పద్ధతి. ఇది ఒకరకంగా స్లో పాయిజనింగ్.

రామాయణం విషయంలో ఇలాటి మహా ప్రయత్నాలు జైనంలో మూడు జరిగాయి : విమలసూరి పరంపర, 2 సంఘదాస పరంపర, 3. గుణభద్ర పరంపర. వీటిలో విమలసూరి పరంపరే ఎక్కువ వ్యాప్తి చెందింది. లోకప్రియమైన రామకథను జైన ధర్మపు మూసలో పోయడానికి తొలిసారిగా ప్రయత్నించినవాడు విమలసూరి. ఇతనిని తర్వాతి ప్రాకృత సంస్కృత జైన కవులు అనుసరించారు.[27]

విమల సూరి క్రీస్తుశకం మొదటి శతాబ్దంలో ఉన్నవాడు (72). ఇతని రామాయణ భాషను బట్టి ఇతడు క్రీస్తు శకం మూడవ శతాబ్దం వాడు కావచ్చునని కొందరివాదం. ఈ రామాయణాన్ని ఇతడు జైన మత ప్రచారం కోసమే రచించాడు. "సింహాన్ని జింక చంపింది. కుక్క ఏనుగును తరిమింది. ఇలాటి విపరీతమైన, అసంభవమైన మాటలతో నిండిన రామాయణాన్ని కవులు రచించారు. ఇదంతా అబద్ధం, ఉపపత్తి విరుద్ధం. ఇలాటి మాటలను పండితులు విశ్వసించరాదు. పూర్వ గ్రంథాలలో ఉన్నదాన్ని, ఆచార్య పరంపరగా వచ్చిన దాన్ని నేను అనుపూర్విగా చెబుతాను" అని ఇతడు తన గ్రంథం అవతారికలో చెప్పకున్నాడు.[28] ఇతని మూల రామాయణం ఏదో?

ఈయన రామాయణం పేరు "పఉమచరిఉ" – అంటే పద్మచరితం. రాముని ముఖం వికసించిన పద్మం వంటిది. కళ్ళు పద్మాల వంటివి. అతని

పేరు పెట్టాడు. శరీర కాంతి పద్మ సదృశం. కనుక అతనికి తండ్రి పద్మ అని పేరు పెట్టాడు. పద్మ – పదుమ – పఉప అయింది. రాక్షసులు మాంసభక్షకులు కారు. వీరు తమ పుణ్యంతో ద్వీపాలను రక్షిస్తారు గనుక వీరికి ఈ పేరు వచ్చింది వానరులు కామరూప కామ గమనాలుగల విద్యాధరులు. వీరు మానవులే. అపూర్వ విద్యలు సాధించారు. వానరులు తమ ఇండ్లపై వానరచిహ్నాలు ఉంచుకోవడంవల్ల వానరు లయ్యారు. భరత శత్రుఘ్నులు కైకేయి కుమారులు.

తక్కిన రెండు జైన సంప్రదాయాల ప్రకారం సీత రావణమండోదరుల కుమార్తె. హనుమంతుడు రావణుని చెల్లెలయిన చంద్రప్రభ కుమార్తె అనంగ కుసుమను పెండ్లాడుతాడు. ఈమెకాక అతనికి వందమంది భార్యలున్నారు.

'పఉమచరిఉ'లోని వారంతా జైనులే. సీత తనశిరోజాలు లుంఛనం చేసి (పీకివేసుకుని) జైనదీక్ష స్వీకరిస్తుంది. రావణుని రాముడు చంపడు, లక్ష్మణుడు అతని ఆజ్ఞతో చంపుతాడు. రాముడు శుద్ధసత్త్వం, చెడ్డపనులు చేయడు. రావణుని వంటి జైన సాధకుణ్ని చంపడంవల్ల లక్ష్మణుడు సరాసరి నరకానికి పోతాడు. రాముడు తపస్సుచేసి నిర్వాణం పొందుతాడు. ఈ కావ్యం లోని ప్రతి పాత్ర ప్రసక్తి ఉన్నా లేకపోయినా, జినధర్మం ఉపదేశిస్తుంది.

విమలసూరి, సంఘదాస, గుణభద్రాచార్యుల పరంపరల్లో పెక్కు ప్రాకృత సంస్కృత రామాయణాలు వచ్చాయి తర్వాతికాలంలో. వాటిలో విచిత్రమైన ఉపాఖ్యానాలు చాలా ఉన్నాయి. వాటి ప్రభావం తెలుగు రామాయ ణాలపై పడింది. కనుకనే, మన రామాయణాలు పెక్కింటిలో అవాల్మీకీయ మైన పెక్కు కథలు కనిపిస్తాయి.

ఈ అవాల్మీకీయ రామాయణ ప్రచారాన్ని అరికట్టడానికే భాస కాళిదాస ప్రవరసేనులు రామకథను కావ్యనాటకాదులుగా సంస్కృత ప్రాకృతాలలో రచించారని నా విశ్వాసం.

సాహిత్య శాస్త్ర దృష్టితో ప్రవరసేనుని సేతుబంధంలోని అవతారికా పద్ధతి, ఆశ్వాసవిభజన సరాసరిగానో, కన్నడ సాహిత్యం ద్వారానో తెలుగు కావ్యాలలో ప్రవేశించింది. ప్రాచీన సంస్కృత కావ్యాలలో అవతారికా పద్ధతి లేదు. ప్రాకృత కావ్యాలయిన సేతుబంధ, గౌడవహోలలో ఈ అవతారికా పద్ధతి ఉంది. దీనిలో ఇష్టదేవతాస్తుతి, సుకవిప్రశంస, కుకవినింద, గ్రంథకర్తృ వంశాదికం ముఖ్యాంశాలు. ప్రాకృత కవులకు అవతారిక అవసరమైంది. ప్రాచీన కథలను ఇతరులు మెలిపెట్టి, వికృతంచేసి ప్రదర్శిస్తున్నప్పుడు పరోక్షంగా వారిని మందలించడం, ఆ కథలను సరిగా చెప్పినవారిని ప్రశం సించడం, ప్రజలను హెచ్చరించడం అవసరమైంది. కాళిదాసు ఒక్క



రఘు వంశంలో మాత్రం అవతారిక వంటిది చెప్పి, మందః కవిశః ప్రార్థీవంటి శ్లోకాలతో విమలసూరిని హెచ్చరించాడు. కుమార సంభవం బుద్ధుని మార విజయగాథకు సమాధానమని నా విశ్వాసం. సేతుబంధం స్కందగుప్తుని దౌహిత్రుడు, కాళిదాసు శిష్యుడు, వాకాట రాజు అయిన ప్రవరసేనుడు రచిం చడం వల్ల, స్వతః కళావిలసితం కావడం వల్ల, దండ్యాదులు ప్రశంసించడం వల్ల చాలా వ్యాప్తి చెందింది.

పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలోను, 20 వ శతాబ్దిలోను ప్రాకృ తంపై తెలుగువారికి మక్కువ ఎక్కువయింది. శతగోప సహస్రాది బహు గ్రంథకర్తలు, విద్వత్కవులు శ్రీ మేడేపల్లి వేంకట రమణాచార్యులుగారు ప్రాకృత భాషా చరిత్ర వ్రాయడమే కాక సేతుబంధాన్ని అనువదించారు. అప్పటికి చక్కగా పరిష్కృతమైన సేతుబంధ ప్రతి లభించలేదు గనుక దాని లోని దోషాలు అనువాదంలోను వచ్చాయి. ఉదాహరణకు :

"చాపతుల్యాకృతి వహించు సంద్రమునకు
సంహితశరోపము పార్శ్వ సంఘటితము
గుణమువలె నున్న వింధ్యాద్రి కుధరవరము
జూచె రాఘవు డత్తరి చూడ్కులలర."

సముద్రం వంపుగా ఉన్న విల్లులాగా ఉంది. దాని రెండు కొనలకు కట్టిన నారిలాగ ఉంది వింధ్యపర్వతం. వింధ్యనుంచి పారే సెలయేళ్ళు సంధించిన బాణాలలాగ ఉన్నాయి అని కవి ఉద్దేశం (మూ. 1.54). పై అనువాదంలో పై నుంచి పారుతున్న సెలయేళ్ళు బాణాలలాగ ఉన్నాయనే భావం పోయింది. శ్రీ ఆచార్యులుగారి మూలమేదో ! దీనిని ప్రాకృత సాహిత్య పాథోనిధులు శ్రీ అవధానం చంద్రశేఖర శర్మగారు ఇట్లా అనువదించారు :

"అంబుధి డంబుమీరిన శరాసముగా, నుభయాంతసంగియై
పంబిన తద్భరంబు సయిపందగి నిస్సరదాపగా ప్రవా
హంబులు సంహితాంబకములై తనరన్ పరిశుద్ధ మౌర్వికా
భం బగు వింధ్యమున్ ధరణిపాల వరేణ్యుడు గాంచె ముందటన్."

(1–50)

గాథాసప్తశతిని శ్రీనాథుని తర్వాత అనువదించడానికి యత్నించినవారు గురువర్యులు వేటూరి ప్రభాకరులు, శ్రీయుతులు తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, దిగుమర్తి సీతారామస్వామిగార్లు. వీరు కొన్ని గాథలను మాత్రం అనువదిం

చారు. దీనిని పూర్తిగా అనువదించిన వారు శ్రీయుతులు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారలు. ఈ రెండు అనువాదాలలో శ్రీ రాళ్ళపల్లి వారిది చాల సహృదయాదరం పొందింది. వీరి అనువాదం ఎలాటి వ్యర్థపదాలూ లేక మూలాతిశాయిగాను ఉంది. ఉదాహరణకు :

పుట్ఠంతేణ వి హిఅఏణ
మామి కహ ణివ్వరిజ్జఏ తమ్మి,
అద్దాఏ పడిబింబం వ్వ
జమ్మి దుఃఖం ణ సంకమఇ (3.4)

స్ఫుటతాపి హృదయేన
మాతులాని కథం నివేద్యతే తస్మిన్,
ఆదర్శే ప్రతిబింబమివ
యస్మిన్ దుఃఖం న సంక్రామతి.

ఆ. అద్దమందు నీడ అంటునట్లెవ్వని
యాత్మ నొరుల వగవు లంటుకొనవొ
యట్టి వానితోడ నెట్లు చెప్పుదు నత్త
మనము ప్రక్కలైన మానెగాని

నేను గాథాసప్తశతిలో తెలుగు పదాలు అనే పేర ప్రాకృత సాహిత్యానికి సంబంధించిన వివిధ వ్యాసాల సంకలనం ప్రచురించాను. గాథాసప్తశతి గాథల భావాలను కథలుగా అల్లి 'పల్లకి' వారపత్రికలో సంవత్సరం పాటు (1985–86) ప్రచురించాను. అవి చాలా జనాదరం పొందాయి. మహాయాన బౌద్ధుల ప్రప్రథమ ప్రామాణిక బుద్ధ చరిత్రమైన 'లలిత విస్తర మహాపురాణం'ను నేనూ, శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు అనువదించి మొదట ఆంధ్రప్రభ ఆదివారం వివిధ వ్యాసానుబంధంలోను, తర్వాత పుస్తకరూపంగాను ప్రచురించాము. లలిత విస్తరం సంస్కృత ప్రాకృతాలు పడుగుపేకగా ఉన్న రచన. లలిత విస్తరంలో లిపులను గురించి ఉందని, మరొకటి ఉందని చరిత్రకారులు, పురాతత్త్వవేత్తలు చెప్పడమే కాని, దానిని ఎవరూ వివరించలేదు. శ్రీ ద్విజేంద్ర లాల్ మైత్ర దాని సారాంశాన్ని ఆంగ్లంలో ప్రచురించారు. పైన పేర్కొన్న మేమిద్దరం దానిని తొలిసారిగా యథాతథంగా అనువదించాము. ఈ అనువాదమే భారత భాషలలో తొలి అనువాదమై ఉండవచ్చును. నేను క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతను, బృహత్కథా మంజరిని వచనంలో అనువదించాను. వీటి మూలం ప్రాకృతం గనుక పరోక్షంగా ప్రాకృత సేవ చేసినట్లే.



మాహులుడనే కవి హరమేఖల అనే ఐదు పరిచ్ఛేదాల వైద్య గ్రంథాన్ని ప్రాకృతంలో రచించాడు. ఇతడు చిత్రకూటంలో క్రీస్తుశకం 920 ప్రాంతంలో ఉన్నవాడు. దీనిని తొలిసారిగా సాంబశివ శాస్త్రి అనే విద్వాంసులు తిరువాన్కూరు సంస్కృత గ్రంథమాలలో దేవనాగరిలో ముద్రించారు. దీనిలో నేటికీ సకల జనులకు ఉపయోగపడే యోగాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. ఐదవ పరిచ్ఛేదం పూర్తిగా సుగంధ ద్రవ్య యోగాలకు సంబంధించింది. దీనిలోని యోగాలను ఎవరైనా ప్రయోగాత్మకంగా పరిశీలించి సిద్ధపరిస్తే, లాభం పొందవచ్చు. కృత్రిమ కస్తూరీ కరణం, సుగంధాంతర కరణం మున్నగు వానిని సాధించి, గొప్ప ధనవంతులు కండి అని గ్రంథకర్త అనేక సార్లు గ్రంథంలో చెప్పాడు. ఏ మందుల సంస్థలో, కాస్మెటిక్ సంస్థలో పూనుకుంటే చాలా ప్రయోజనం ఉంటుంది. ముఖ్యంగా దోమలు, నల్లులు, ఈగలు, ఎలుకలు మొదలైన వాటినివారణ యోగాలు చాలా ప్రయోజనకరాలు. దీనిని నేనూ ప్రసిద్ధ వైద్యులు, ఆయుర్వేద మహోపాధ్యాయులు డాక్టర్ వేటూరి శంకర శాస్త్రిగారూ అనువదించి ప్రచురించాము.[20]

బుద్ధ జాతక కథలను శ్రీ శివ శంకరశాస్త్రిగారు వచనంలోను, సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు పద్యంలోను అనుసరించారు. వంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు గిడుగు రామమూర్తి పంతులుగారి సప్తశతి పూర్తి సంచికలో "ప్రాకృత సాహిత్యమూ - ప్రజాసేవానూ" అనే గొప్ప వ్యాసం, పుస్తకమంత పెద్దది వ్రాశారు. శ్రీ పరవస్తురామానుజ స్వామిగారు హేమచంద్రాచార్యుని దేశినామమాలను సంస్కరించి ప్రచురించడమే కాక, ప్రాకృత భాషపై అనేక వ్యాసాలు వ్రాశారు. బౌద్ధ వాఙ్మయ బ్రహ్మగా విఖ్యాతులైన శ్రీదుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు బౌద్ధ సాహిత్యంపై అనేక గ్రంథాలు రచించారు. రాజా శ్రీ వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్‌బహద్దర్‌గారు ధమ్మపదం అనువదించడమేకాక బౌద్ధం గురించి, ప్రాకృత సాహిత్యాన్ని గురించి అనేక వ్యాసాలు వ్రాశారు. శ్రీ అవధానం చంద్రశేఖర శర్మగారు సేతుబంధకావ్యాన్ని గొప్పగా అనువదించి ప్రచురించారు. ఆచార్య డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు ఇటీవల ధమ్మపదం అనువదించారు. డాక్టర్ కొరిడె కమలమ్మ 'ప్రాకృత సాహిత్యంలో ప్రజాజీవితం' అనే సిద్ధాంత వ్యాసం ఆంగ్లంలో ప్రచురించడమేకాక, వజ్జాలగ్గం అనువదించి ప్రాకృత కవితా మాధుర్యాన్ని సామాన్య ప్రజలకూ అందజేశారు. శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారు తెలుగు భాషపై పాలీ ప్రాకృత ప్రభావం గురించి పుస్తకం ప్రచురించారు.

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు బహుభాషాకోవిదులు, ప్రాకృతంలో గొప్ప పరిశ్రమ చేసిన విద్వాంసులు ప్రాకృత భాషా సాహిత్యాలపై పెక్కు అపూర్వ వ్యాసాలు వ్రాశారు.

ఇట్లా ఎంతో పోగా కొంతయినా మిగిలిన ప్రాకృత సాహిత్య ప్రభావం తెలుగు సాహిత్యంపై కొద్దిగా పడినప్పటికీ, తెలుగుభాషపై ప్రాకృత భాషా ప్రభావం పూర్తిగా ఉంది. ప్రాకృతాలు తెలుగులో రంగరించుకొనిపోయాయి. నేటి భాషావేత్తలు ఈ విషయంలో నిష్పాక్షికంగా పరిశోధన జరుపవలసిన అవసరం ఉంది.

## అధోజ్ఞాపికలు

1. ప్రాకృత సాహిత్యకా ఇతిహాస్ - డాక్టర్ జగదీశ చంద్రజైన్: పుట 5; పాఇఅసద్ద మహణ్ణవో పీఠిక.
2. డాక్టర్ వి. రాఘవన్ వ్యాసాలు - హిందూ.
3. ధమ్మపదం - వాసవగ్గో : 1.
4. ప్రాకృత సాహిత్యకా ఇతిహాస్ - పుట. 16.
5. ఆచార్య బాగ్చీ చూళికా ప్రాకృతంపై వ్యాసం.
6. జయశంకర్ ప్రసాద్ అజాత శత్రు నాటక పీఠిక.
7. భరత నాట్యశాస్త్రం.
8. చండుని ప్రాకృత వ్యాకరణం.
9. సిద్ధ హేమచంద్ర శబ్దానుశాసనం.
10. దేశినామమాలా-1.
11. కవిరాజమార్గ - పరి. 8; పద్యం. 58.
12. శబ్దమణిదర్పణం - పుట. 12.
13. సాహితీ సుగతుని స్వగతం - తిరుమల రామచంద్ర.
14. శ్రీ చీమకుర్తి శేషగిరిరావు తెలుగు గోష్ఠి వ్యాసం - జనవరి 1989.
15. ఎపిగ్రాఫికా ఇండికా - డా. కార్తికేయ శర్మ వ్యాసం.
16. మనలిపి పుట్టుపూర్వోత్తరాలు - తిరుమల రామచంద్ర.
17. గాథాసప్తశతిలో తెలుగు పదాలు - తిరుమల రామచంద్ర.
18. పజ్జాలగ్గలో తెలుగు పదాలు - తిరుమల రామచంద్ర: భారతి. మే. 1980.
19. కాశకృష్ణ ధాతుపాఠవ్యాఖ్య.
20. ఆంధ్రభాషాచరిత్ర - డాక్టర్ చిలుకూరినారాయణరావు.



21. గంగాధర శాసనం - డాక్ట వేలటూరి వేంకటరమణయ్య.
22. మల్లియరేచన మొదటి తెలుగు కవి - డాక్టర్ పి.వి. పరబ్రహ్మశాస్త్రిగారు, తెలుగు గోష్ఠి వ్యాసం.
23. తెలుగుపై ప్రాకృత ప్రభావం - డాక్టర్ రవ్వా శ్రీహరిగారి వ్యాసం.
24. నందంపూడి శాసనం - శ్లోకం 25.
25. శ్రీ వేదం వేంకట రాయశాస్త్రి గారి వ్యాసం - భారతి. 1960.
26. జక్కన విక్రమార్క చరిత్ర - ఒక పరిశీలన. డాక్టర్ నీరజా చక్రవర్తి.
27. ప్రాకృత సాహిత్యంలో రామకథ - తిరుమల రామచంద్ర. భారతి —జూన్, జూలై, ఆగస్ట్ 1978.
28. పఉమచరిఉ - 2.116,117.
29. హరమేఖల - గోపాలాచార్లు, లక్ష్మీపతి మెమోరియల్ ట్రస్ట్, గాంధీనగర్, హైదరాబాదు — 380.

(1990 మార్చిలో బెంగళూరులో జరిగిన అఖిల భారత తెలుగు మహాసభలో చదివిన పరిశోధన వ్యాసం.)

# అపభ్రంశ వాఙ్మయ పరిచయం

[ఈ వ్యాసం అరవైసంవత్సరాల క్రిందట ఆంగ్లేయ రచనలు ఆధారంగా వెలువడిన హిందీ రచనలను చూచి వ్రాసినట్టిది. నా అపరిణత మనస్కత దీనిలో స్పష్టమవుతుంది. అది వేదాలు క్రీస్తుకు ముందు ఆరువందల, ఏడువందల ఏళ్ళనాటివని జాతకాలు కట్టినకాలం. పాశ్చాత్య విద్వాంసులలూ, తదనుయాయులు బుద్ధునికాలం స్పష్టంగా తెలిసిన తర్వాత వేదాల కాలాన్ని మరికొన్ని వందల సంవత్సరాలు వెనుకకు నెట్టారు. కనుక ఈ వ్యాసం అప్పటి దృష్టితో అపక్వ విషయాలతో వ్రాసినట్టిది.

ఇప్పుడు ప్రాకృత భాషాసాహిత్యానికి సంబంధించిన కొత్త విషయాలు ఎన్నో తెలిశాయి. వేదసంస్కృతం భ్రష్టమై ప్రాకృతాపభ్రంశాలయ్యాయని నేను ఇప్పుడు నమ్మను. మహాభారత, ఉపనిషద్వేదాదుల కాల నిర్ణయంలో మహారాష్ట్ర ఖగోళశాస్త్రాది విద్వాంసుడు శ్రీ వర్తక్ సిద్ధాంతాన్ని నమ్ముతున్నాను. అయినా ఈ వ్యాసాన్ని నాఅప్పటి అజ్ఞానానికి తార్కాణగా ఈ సంకలనంలో చేర్చాను.]

భారతీయ భాషలలో వైదికభాష ప్రాచీనతమం, ఋగ్వేదం వైదిక వాఙ్మయంలో ప్రాచీనతమం. ఋగ్వేదంలోని ఋక్కులు కొన్ని సరళమైనవి, కొన్ని ప్రౌఢమైనవి. ఋగ్వేదభాష అప్పటి శిష్టభాష. శిష్టభాషకానిది విభాష. ఆ కాలంలో అనేక విభాషలు ఉండేవి ఒకే శబ్దానికి అనేకరూపాలు ఉండేవి- 'గోణీ, గోతా, గోపాలికా' అని ఆవుకు, 'గత్వా. గత్వీ గత్వాయ' అని వెళ్ళి అనడానికి ఇత్యాదిగా.

వైదికయుగంలోను, దానికి పూర్వమూ ఉన్న జనసామాన్య భాషలను గ్రియర్సన్ ప్రథమ ప్రాకృతాలు (Primary Prakrits) అన్నారు. ఇదే ప్రాచీన భారతీయ ఆర్యభాషాకాలమని డాక్టర్ సునీతికుమార్ ఛటర్జీ అన్నారు. ఈ విభాషలలో సామ్యం కనిపిస్తుంది. ఈ విభాషలు వాయవ్య దిశనుంచి విస్తరించాయి. ఆయా ప్రదేశాల భేదాలను బట్టి ఉదీచ్య, మధ్యదేశ, ప్రాచ్య విభాషలు ఏర్పడ్డాయి. ఉదీచ్యభాషను పెషావరు, పంజాబులలో వ్యవహరించేవారు. ప్రాచ్యభాషలు వ్యవహరించేవారు వైదిక మర్యాదలను అనుసరించలేదు.



కనుక వీరిని వ్రాత్యులన్నారు. వ్రాత్య స్సంస్కారహీనస్స్యాత్- అని అమరం. వ్రాత్యుడంటే సంస్కారహీనుడు. వీరు సావిత్రీభ్రష్టులు. వీరు కఠినంగా లేని పదాలను కఠినమని భావించేవారు. ఈ ప్రాచ్య విభాషలను గ్రియర్సన్ రెండవ ప్రాకృతాలు (Secondary Prakrits) అన్నారు. సునీతికుమార్ చటర్జీ మధ్య కాలీన భారతీయార్యభాషలు (Midddle Indo Aryan Speech) అన్నారు. గ్రియర్సన్ మొదలయిన భాషా శాస్త్రజ్ఞులు ఈ పరిణామానికి మూడు దశలు చెప్పారు :

1. ప్రారంభదశ (క్రీ.పూ. 400 నుంచి క్రీస్తుశకం 100 వరకు)
2. మధ్యదశ (క్రీ.శ. 100 నుంచి క్రీ.శ. 500 వరకు)
3. ఉత్తరదశ (క్రీ.శ. 500 నుంచి 1000 వరకు)

ప్రారంభదశ భాషలపై ప్రాచీన వైదికభాషా ప్రభావం అధికంగా కనిపిస్తుంది. పాళీ, అశోక శాసనాలలోని ప్రాకృతం ఈ తరగతివి. జైన ప్రాకృతాలు, శౌరసేని మొదలయినవి మధ్యదశకు చెందినవి. జైనేతర శౌరసేని. మహారాష్ట్రి, మాగధి, అర్ధమాగధి, పైశాచి ఉత్తరదశకు చెందినట్టివి. మధ్యదశకు చెందిన ప్రాకృతాలపై, ద్రావిడ, ఆస్ట్రిక్ (నిషాద) భాషా ప్రభావం చాల ఉంది. హేమచంద్రుడు, లక్ష్మీధరుడు, మార్కండేయుడు అపభ్రంశభాషకు వ్యాకరణం వ్రాశారు. కాలాంతరాన అపభ్రంశ భాషనుంచి అధునిక భారతీయభాషలు ఆవిర్భవించాయి. హిందీపై అపభ్రంశ ప్రభావం అపారమైనది.

అపభ్రంశమంటే, దిగజారింది, ఒకస్థానం నుంచి కిందికి పడిపోయింది- అని అర్థం. అపభ్రంశభాష అంటే శిష్టేతరభాష, అపాణినీయమైన భాష అని అర్థం. క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దం వాడయిన పతంజలి మహాభాష్యంలో అపభ్రంశ శబ్దం ప్రయోగించాడు. భర్తృహరి వాక్యపదీయంలో అపభ్రంశ శబ్దం కనిపిస్తుంది. భరతుడు చెప్పిన ప్రాకృతాలలో అపభ్రంశం లేకపోయినా, అపభ్రంశ శబ్దార్థాన్నిచ్చే విభ్రష్టశబ్దం వాడాడు. అప్పుడు శబరులు, అభీరులు మొదలయిన వనవాసులు అపభ్రంశ భాషను వాడేవారు. అప్పటికి దీనిలో సాహిత్యం వెలువడలేదు.

అపభ్రంశ శబ్దం క్రీ.శ. ఆరవశతాబ్దంలో వ్యాకరణాలంకార గ్రంథాలలో కనిపిస్తుంది. దీనిలో సాహిత్యం ఉన్నట్టు కూడ అప్పటి లక్షణగ్రంథాల వల్ల తెలుస్తున్నది. అప్పటికి అపభ్రంశ భాషలో స్వతంత్ర సాహిత్యం వెలువడింది. కొందరు అలంకారికులు ఈ సాహిత్యాన్ని గుర్తించినా, ఈ భాష అభీరుల

భాషగానే నేటికి వ్యవహారంలో ఉంది. కాని, క్రీ.శ. తొమ్మిదోశతాబ్దానికి సర్వసామాన్యభాషగా పరిణమించింది. ఇది సౌరాష్ట్ర నుంచి మగధవరకు వ్యాపించింది. స్థానభేదంవలన రూపభేదమూ పొందింది. నమిసాధువు 'ప్రాకృతమేవాపభ్రంశః' (ప్రాకృతమే అపభ్రంశం) అని నిర్వచిస్తూ, దీనిలో ముఖ్యమైన రూపాలు 1. ఉపనాగరం, 2. ఆభీరం 3. గ్రామ్యం అని మూడు పేర్కొన్నాడు.

పదకొండోశతాబ్దంనాటికి అపభ్రంశం సాహిత్యభాషగా రూపుదిద్దుకుంది. సాహిత్యవేత్తలు అపభ్రంశాన్ని సాహిత్యభాషగా స్వీకరించి కావ్యరచనకు పూనుకున్నారు. కాని, స్థానభేదాన్ని బట్టి మార్పులు చాల కనిపిస్తాయి. విస్తృతార్థంలో దీనిని వాడినా, మాగధీ భాషలో మాత్రం ప్రాకృతభాషా లక్షణాలు కనిపిస్తాయి. మధ్యదేశీయులు మధ్యమమార్గం అనుసరించారు. ప్రాచ్యంలో ర కుబదులు ల వాడడం-రాజా-లాజా; మధ్యదేశంలో ర, ల లు రెండూ వాడడం కనిపిస్తుంది. అంతేకాక ఆదిమవాసుల సంపర్కంవల్ల భాషాస్వరూపాలూ మారిపోయాయి.

మరొకవైపు వైదికసూక్తాల ప్రాచీనభాషకు నవీనరూపాలూ ఏర్పడ్డాయి, ఉదీచ్య విభాషానుగుణంగా ఆ రూపాలు స్థిరపడ్డాయి. ఒక విధమైన శిష్ట వ్యవహార భాష ఏర్పడింది. వైదికభాష్యాలు ఈ శిష్ట వ్యవహార భాషలో వెలువడినాయి.

క్రీస్తుశకం 500 నుంచే అపభ్రంశభాష విస్తరించినా, 8వశతాబ్దికిగాని దానికొక సాహిత్యరూపం ఏర్పడలేదు. 9వ శతాబ్దం నుంచి 13వ శతాబ్ది వరకు అపభ్రంశ సాహిత్యానికి స్వర్ణయుగమనవచ్చు.

అపభ్రంశ సాహిత్యంలో తొలికవి స్వయంభు(వు). ఈయన సాహిత్యస్రష్ట. ఈయన పఉమచరిఉ (పద్మచరితమ్), రిట్ఠణేమిచరిఉ అనే రెండు కావ్యాలువ్రాసి ఖ్యాతి వహించాడు. పుష్పదంతుడు, ధనపాలుడు, నయనంది, కరకామరుడు, దాహిలుడు మొదలయిన కవులు వివిధ కావ్యాలు రచించి ఈ సాహిత్యాభివృద్ధికి తోడ్పడ్డారు. వీరిలో సర్వశ్రేష్ఠకవి పుష్పదంతుడు. ఈయన మహాపురాణమనే గ్రంథంలో స్వప్నదర్శనమనే విషయాన్ని ఇరవైనాలుగు సార్లు విషయ చ్ఛందోభాషా వైవిధ్యంతో మనోరంజకంగా, చెప్పినది చెప్పకుండా వర్ణించాడు.

జైనకవులు మహాపురాణాలను, పురాణాలను, చరిఉలను వ్రాయగా, బౌద్ధులు స్వతంత్ర పదాలను, గీతాలను, దోహా (ద్విపద)లను వ్రాశారు. విద్యాపతి కీర్తిలత అనే స్వతంత్ర కావ్యం రచించాడు. అబ్దుల్ రహమాన్ అనే



మహమ్మదీయకవి 'సందేశ రాసక' అనే కావ్యం రచించాడు. ఇది అతని పాండిత్యానికి నికషం. ఈ కావ్యంలో ప్రారంభంలో తప్ప మరెక్కడా మత ప్రచార ప్రసక్తి కనిపించదు.

జైనకవులు శ్రావకుల ప్రార్థనతో కావ్యాలు రచించారు. శ్రావకుల వ్యవహారభాష అపభ్రంశం. కనుక తమ భాషలో కావ్యాలు రచించమని వారు జైన ఆచార్యులను కోరేవారు. కనుక జైనకవులు తమ ఆశ్రయదాతల వంశం, కులగోత్రాదులు తమ కావ్యాలలో వర్ణించేవారు. జైనాచార్యుల కావ్యేతి వృత్తం వ్రత మాహాత్మ్యాలు, మహాపురుషుల జీవితాలు. వీరు గద్యగ్రంథాలు, నాటకాలు రచించలేదు. వీరు త్యాగ నిరతులు, ధనాపేక్షలేని వారు గనుక ఆశ్రయదాతలను గురించి మిథ్యా వర్ణనలేమీ చేయలేదు. వీరు సంస్కృత ప్రాకృత ప్రబంధ శైలిని అనుసరించక, కొత్తపుంతలో నడిచారు.

ప్రాచీన మూఢ విశ్వాసాల ఖండన, గురుస్తుతి, రహస్య వాదం (ప్రతీకాత్మకత) వీరి కావ్య విశేషాలు. ప్రకృతి, మానవ స్వభావం, దేవతలు మొదలయినవి వీరి వ్రత మాహాత్మ్యాలలోను, మహాపురుష జీవితాలలోను తరచు కానవస్తాయి. కర్మ విపాకసిద్ధాంతం, పునర్జన్మ వాదం వీరి కావ్యాలకు జీవాతువు. వీరి ప్రధాన లక్ష్యం మతప్రచారం గనుక మహాపురాణాలు, చరిత్ర కావ్యాలు, రూపక కావ్యాలు, కథాత్మక గ్రంథాలు, సంధి కావ్యాలు, రాస గ్రంథాలు, స్తోత్రాలు రచించారు.

జైనపురాణాలలో త్రిషష్టి శలాకా పురుషుల చరిత్రలు వర్ణితాలు. శలాకా పురుషులంటే యుగపురుషులు. వీరు 63 మంది. వీరిలో 24 మంది తీర్థంకరులు, పన్నెండుమంది చక్రవర్తులు, తొమ్మండుగురు వాసుదేవులు, తొమ్మండుగురు బలదేవులు, తొమ్మండుగురు ప్రతి వాసుదేవులు- మొత్తం అరవై ముగ్గురు. ఈ సంప్రదాయాన్ని తమిళ శైవులు అనుసరించారు. వారి అరువత్తు మూవర్ నాయనార్లు త్రిషష్టి శలాకాపురుషుల అనుకరణే. జైనకవులు రామాయణాన్ని మార్చి పద్మపురాణమని, మహాభారతాన్ని మార్చి హరివంశ పురాణమని తిరగ వ్రాశారు.

అపభ్రంశ సాహిత్యంలో రామాయణ పాత్రలకు ప్రత్యేక స్థానం ఉంది. రాముడు, లక్ష్మణుడు, రావణుడూ జైనధర్మనాయకులే. త్రిషష్టి శలాకా పురుషులలో వీరూ ఉన్నారు. ప్రతి కల్పంలోను త్రిషష్టి శలాకాపురుషులు ఉద్భవిస్తారు. అంటే బలదేవులూ, వాసుదేవులూ, ప్రతివాసుదేవులూ అవతరిస్తారన్నమాట. రాముడు బలదేవావతారం. లక్ష్మణుడు వాసుదేవావతారం. బలదేవుడు, వాసుదేవుడు ఒక తల్లి బిడ్డలుగా ఉండరు. బలదేవుడు ప్రతివాసుదేవునితో

యుద్ధం చేయడు. ప్రతి వాసుదేవుడు యుద్ధంలో హతుడై జైన ధర్మదీక్ష స్వీకరించి మోక్షం పొందుతాడు.

స్థూలంగా అపభ్రంశ సాహిత్యంలో ఉన్న రామాయణ సంప్రదాయాలు రెండు: 1. విమలసూరి పరంపర విఖ్యాతమైంది. దీనలో రావణుడు ఉదాత్త గుణ సంపన్నుడు; మహాభక్తుడు. 2. గుణభద్ర పరంపర. ఇది అంతగా ప్రసిద్ధి చెందలేదు.

అపభ్రంశ సాహిత్యంలో చరిత్రగ్రంథాలు-తీర్థంకరుల, మహాపురుషుల చరిత్రలు-విశేషంగా ఉన్నాయి. జసహరచరిఉ, ణేమిదాహ చరిఉ వంటివి ప్రేమాఖ్యానాలు. పఉమసిరి చరిఉ, భవిస్సయత్త చరిఉ, సుదంసణచరిఉ వంటివి ధార్మిక మహామహుల చరిత్రలు. శ్రీ చంద్రుని కథాకోశం, అమరకీర్తి ఛక్కమ్మోవఏస కథాత్మక కావ్యాలు. వీటిలో దైవపూజ, గురుసేవ, జప తపోదానాది సత్కర్మల వివరణ, వాటిక ఉదాహరణ ప్రాయంగా కథలు ఉంటాయి. భవిస్సయత్తకథ, పజ్జుణ్ణకథ, స్థూలభద్రి కథ వంటివి స్వతంత్ర కథలు. మొత్తంమీద అపభ్రంశ వాఙ్మయంలో మత నిరపేక్షమయిన కావ్యాలు చాల కొద్ది. విద్యాపతిరచితమైన కీర్తిలత స్వతంత్ర కావ్యం, ఇది రాజచరితం కనుక చారిత్రక ప్రబంధం. అబ్దుల్ రహమాన్ రచించిన సందేసరాసకం స్వతంత్ర కావ్యం. ఒక విరహిణి తన ప్రియునికి సందేశం పంపడం దీని ఇతి వృత్తం. ఇది కేవలం లౌకిక కావ్యం.

జీవన కరుణ సంలాపకథ ప్రబోధ చంద్రోదయం, సంకల్ప సూర్యోదయంల వంటి రూపకం; దీనిలో మానవరూపం ధరించిన జీవుడు, మనస్సు, ఇంద్రియాలు పాత్రలు. ఇలాటి మరొకరూపకం హరిదేవకృత మదన పరాజయం. కామక్రోధాద్యరిషడ్వర్గాలు దీనిలో పాత్రలు.

అపభ్రంశ సాహిత్యంలో రాసో అనేది ఒక విశిష్ట శాఖ. ఈ శాఖలో జినదత్తసూరి ఉపదేశ రసాయన రాసో, జిన ప్రభసూరి నేమిరాసో, అంతరంగ రాసో ముఖ్యమైనవి.

అపభ్రంశ వాఙ్మయంలో స్తోత్ర సాహిత్యం అపారం. అభయ దేవుని జయ తిహుయణ స్తోత్రం, ఋషి జినస్తోత్రం, అత్యంత విఖ్యాతాలు. ధర్మ సూరిస్తోత్రం పన్నెండు నెలలు ప్రతీకగా గురుస్తుతి గలది.

సంధి అనే సాహిత్య ప్రక్రియలో ప్రసిద్ధ పౌరాణిక చరితాలు ఉంటాయి. చూనరీ, చర్చరీ, కులక మొదలయినవి కావ్యభేదాలు. వినయచంద్ర ముని రచించిన చూనరీలో సదాచార మహిమా వర్ణనం ఉంది. జినదత్త సూరి



రచించిన చర్చరి గురుమహిమను వర్ణిస్తుంది. జినదత్తుడు తాను రచించిన కులకంలో ధర్మోపదేశం చేశాడు.

అపభ్రంశ సాహిత్యంలోని ఉపదేశాత్మక గ్రంథాలు రెండు విధాలు— 1. ఆధ్యాత్మిక గ్రంథాలు, 2. ఆది భౌతిక గ్రంథాలు. యోగీంద్రుని పరమార్థ ప్రకాశ, రామసింహుని పాహుడ దోహా, సుప్రభాచార్యుని వైరాగ్యసారం ముఖ్యాలు. దేవసేనుని సావయవధమ్మ దోహా, జినదత్తుని ఉపదేశ రసాయన సార ఆధి భౌతిక గ్రంథాలు.

జైన ప్రబంధ కావ్యాలలో కథా నిర్వహణం ఏమీ బాగుండదు. ఈ కవుల లక్ష్యం ధర్మప్రచారం కనుక, తమ మత మహిమను కొనియాడడమే వారి లక్ష్యం. శృంగార వీరశాంతాలు ప్రధాన రసాలు. పరిచ్ఛేదాలను కడవక అంటారు. కావ్య ప్రారంభంలో దువఈ లేక ఘత్తా అనే ఛందస్సులలో పీఠిక ఉంటుంది. దీనిలో ప్రబంధ (సంధి) సారాంశం వివరిస్తారు. పజ్ఝటిక, పాదాకులక, కడనక, పారాణక, అవిల్లహ అనే ఛందస్సులు వాడుతారు. కృత్యారంభంలో సజ్జన సంస్తుతి, ఆత్మవినయం తప్పనిసరిగా ఉంటాయి. అనుభూత విషయ వర్ణనే ప్రధానం. ధ్వని, శబ్దావృత్తి, అనుకరణ ధ్వని మున్నగువానితో శ్రావ్యత కలిగిస్తారు. అంత్యానుప్రాసం ముఖ్యం. (దీనిని తర్వాతి హిందీ కవులు అనుసరించారు.) రెండు ఛందస్సులను కలిపి ఛప్పయ్, కుండలి, రద్దా మొదలయిన వింత ఛందస్సులకు సృష్టించినవారు అపభ్రంశ కవులే. పజ్ఝటిక, పాదాకులక, కడనక, పారాణిక, అలిల్లహ, ఘతా, అదిలా, సింహావలోక, ప్లవంగ, భుజంగ ప్రయాత, కామినీ మోహన, తోటక, దోదక్ర, చౌపాయి అపభ్రంశ సాహిత్యంలో బహుళ ప్రచారంలో ఉన్న ఛందస్సులు. కుండలి ఆర్యావృత్తం చివరి పాదానికి మరొక వృత్తం కలిపి సాగదీయడం. ఇది తెలుగువారి కందార్ధ మయింది.

అపభ్రంశ సాహిత్య ప్రభావం హిందీ మున్నగు ఆదునిక భాషా సాహిత్యాలపై ఎంతో ఉంది. జైన సాహిత్యం దాదాపు అంతా అపభ్రంశంలోనే ఉంది. అపభ్రంశ సాహిత్యకారులు కొత్తదారులు తీర్చి ప్రజాదరణ పొందారు. లోకహితం చేకూర్చే సాహిత్యం అపభ్రంశంలో చాల ఉంది.

బౌద్ధులు వజ్రయాన, సహజయాన సిద్ధాంతాలను ప్రతిపాదించే అనేక గ్రంథాలను అపభ్రంశంలో వ్రాశారు. సిద్ధులు సిజసిద్ధాంత ప్రతిపాదనకు, కర్మకాండ నిరసనకు అపభ్రంశంలో గ్రంథాలు వ్రాశారు. తంత్రసారం లల్లావాక్యాని అనేవి శైవ అపభ్రంశ గ్రంథాలు.

# తెలుగు దేశంలోని బౌద్ధ శాఖలు

బుద్ధ భగవానుడు రాజగృహ పరిసరాలలోని వేణువనారామంలో విహరిస్తున్న సమయం. వేణ్ణా తీరంనుంచి కొందరు నైగములు బుద్ధభగవానుని దర్శనానికి వెళ్ళారు. వారితోపాటు ఒక యువ చిత్రకారుడూ ఉన్నాడు. అతడు తథాగతునికి సాష్టాంగపడి, ఆయన చిత్రం గీచుకొనడానికి అనుమతి కోరాడు. ఆయన యువకుని కోరికను కాదనలేక సరేనన్నాడు. ఆసీనుడైన బుద్ధుని ఎదుట ఒక తెల్లటి తెర కట్టి దానిపై వెలుగుపడేటట్టు చేసి, తెరపై పడిన ప్రతిబింబం అంచులనుబట్టి రేఖాచిత్రం సిద్ధపరిచాడు యువ చిత్రకారుడు.[1] జీవించిన వ్యక్తి నుంచి తీసిన తొలి సిల్‌హౌటి చిత్రం అదే అని అంటారు మిత్రులు శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి.

దీనినిబట్టి బుద్ధుని సమకాలంలోనే తెలుగు దేశంలో బుద్ధుని ఉపదేశ ప్రభావం ప్రసరించిందని మనం నిశ్చయించవచ్చు. బుద్ధుని ఉపదేశాలు తెలుగు వారిని ఆకర్షించడానికి ప్రధాన కారణం తెలుగువారిలోని ఎదుదుతిరిగే స్వభా వమే ననుకుంటాను. బుద్ధునిమతం అప్పటి పతనోన్ముఖమైన సంఘ వ్యవస్థకు ఎదురు తిరిగినట్టిది. బుద్ధునికి పూర్వమే వేదాలూ, ఉపనిషత్తులూ, దర్శనాదులూ వున్నా, ఉపనిషత్తులలోని మహోన్నతానుభూతి సామాన్యులకు అందుబాటులో ఉండలేదు. క్షత్రియులు బలవంతులై రాజ్యం ఏలుతూంటే, బ్రాహ్మణులు అనుభవానికీ, అర్థం చేసుకోవడానికీ కూడా సాధ్యంకాని కర్మాత్మకమైన మతం ప్రజల ఎదుట పెట్టారు. వైశ్యులు కృషి వాణిజ్యాలలో నిమగ్నులై వుండేవారు. శూద్రులు జ్ఞానశూన్యులై, సేవాధర్మంతోనే సంతృప్తి పడేవారు. క్షత్రియ వైశ్యశూద్రులనే త్రివర్ణాలకు క్రమంగా ధర్మజిజ్ఞాస క్షీణించింది. మత ధర్మాలలో తక్కిన వర్ణాల జోక్యానికి బ్రాహ్మణులు ఇష్టపడేవారు కారు. ఈ విధంగా క్షత్రియ వైశ్యశూద్రులు తమ పూర్వుల ఆత్మజ్ఞానాన్నీ, ఒకప్పుడు తమ నిత్యజీవనమైన ధర్మాన్నీ విస్మరించి విద్యా విజ్ఞానాలకు దూరమైనారు. బ్రాహ్మణులు పురోహిత మాత్రులేకాక విద్యాగురువులై మిగిలిన మూడు వర్ణాల

1. ఆంధ్ర జాతీయ కళాశాల ప్రిన్సిపాలు, విఖ్యాత కళాకారుడు ప్రమోద్ కుమార్ చటర్జి తరగతులలో చెప్పిన విషయం.



లోని బలవంతులనూ ధనవంతులనూ కూడగట్టు కొన్నారు. క్షత్రియులు పాలకులైతే బ్రాహ్మణులు మహామంత్రులూ, న్యాయనిర్ణేతలూ అయ్యారు. భోగైశ్వర్యాలకు మాత్రమే సాధనమైన కర్మకాండ మతమనేభావం ప్రబలింది. దానివల్ల వారుకూడ ఆత్మజ్ఞాన శూన్యమై పరంపరాగతమై, నిర్మలమైన ఆధ్యాత్మ విద్యను విస్మరించారు.

"కామాత్మనః స్వర్గపరాః జన్మ కర్మ ఫలప్రదామ్,
క్రియా విశేష బహుళాం భోగైశ్వర్య గతింప్రతి.

భోగైశ్వర్య ప్రసక్తానాం తయా పహృతచేతసాం,
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే.

అనే గీత శ్లోకాలకు నాటి బ్రాహ్మణధర్మం లక్ష్యభూత మయింది. కనుక జనసామాన్యం మతధర్మ శూన్యమైపోయింది. వారికి చదువూ, సంధ్య, మతమూ లేదు. ధనవంతులైన క్షత్రియవైశ్యులు మాత్రమే యజ్ఞయాగాలు చేయగలరు. మధ్యతరగతివారూ, పేదలూ వాటిని చేయలేరు. వారికి మతబోధన చేసేవారూ లేరు. మొత్తానికి బ్రాహ్మణులంతా మత శూన్యు లయ్యారంటే, అసత్య మేమీ కాదు. బ్రాహ్మణులు అధికారం పొంది స్వార్థపరులై క్షుద్రవిద్యలకు దిగారు. దిఘ్ఘనికాయంలోని బమ్మజాలసుత్తంలో ఆనాటి బ్రాహ్మణుల పతనం చక్కగా వర్ణితమైంది. బుద్ధుడు రాజగృహంనుంచి నాలందాకు పోయేమార్గంలో తన శిష్యులతోపాటు అంబలబత్తికా అనే ఆరామంలో విశ్రమిస్తాడు. అప్పుడు సుప్రియుడనే సన్యాసి, అతని శిష్యుడు బ్రహ్మదత్తుడూ వారితోపాటే వుంటారు. సుప్రియుడు బుద్ధునీ, బౌద్ధధర్మాన్ని నిందించగా, బ్రహ్మదత్తుడు స్తుతిస్తాడు. ఈ సంగతిని బుద్ధునికి శిష్యులు చెప్పగా, ఆయన "ఇతరులు బౌద్ధ ధర్మాన్ని తూలనాడినప్పుడు మీరు బాధపడకండి, కోప్పడకండి, ఆత్మనిగ్రహం కోలుపోకండి, కలుషిత హృదయంతో ఎవరూ సత్యాసత్యాలను గ్రహించలేరు. తెగడితే కుంగిపోవడం, పొగిడితే పొంగిపోవడం తగదు. హృదయం రాగ ద్వేషాలతో ఉద్వేగం పొందితే, సత్యగ్రహణ సమర్థంకాదు" అని హెచ్చరిస్తాడు. బ్రాహ్మణులు తమకు భక్త శ్రీమంతులు శ్రద్ధతో ఇచ్చిన అన్నంతో జీవిస్తూ, వ్యసనానికి లోబడ్డారని బుద్ధుడంటాడు. వారు నాట్యగీత నాటకాలలోను, బేతాళంలోను, అభిచారాదులలోను, ఏనుగులు, గుర్రాలు, కారెనుములు మున్నగువాని, పందేలలోను అసక్తులయి వున్నారని, క్షుద్రవిద్యలకు దిగి పతితులైపోయారని బుద్ధుడన్నాడు.

రాజగృహంలోని వేణువనంలో ఉప్పలవణ్ణు అనే భిక్షుణికి బుద్ధుడు బ్రాహ్మణు డెవడో మరొకమారు వివరిస్తాడు:-

"వారి పోక్ఖర పత్తేస ఆరగ్గరివ సాసపో,
యో న లిప్పతి కామేసు తమహం బ్రూమి బ్రాహ్మణం."

"పుష్కర పత్రంపైన – కమల పత్రంపైన నీటి బిందువులాగ, రంపం మీద ఆవగింజలాగ ఎవరు భోగ భాగ్యాలలో అంటనట్టు వుంటాడో అతనినే నేను బ్రాహ్మణుడంటాను."

జేతవనంలో మరొకసారి చందాభుడనే భిక్షువుకు బుద్ధుడు నిజమైన బ్రాహ్మణుని గురించి ఇలా చెబుతాడు :

"చందంవ విమలం సుద్ధం విప్పసన్న మనావిలం,
నదీభావపరిక్ఖీణం తమహం బ్రూమి బ్రాహ్మణం."

చంద్రునివలె నిర్మలుని, శుద్ధుని, దోషరహితుని, కలత చెందని మనస్సు గలవానిని, తృష్ణనశించిన వానిని, నేను బ్రాహ్మణుడని చెబుతాను." దీగ్ఘనికాయంలోని అంబట్ట సుత్త జోణదండ సుత్తాలలో జాత్యహంకారాన్ని నిరసించాడు బుద్ధుడు. నగరప్రాంతంలో నిగ్గరారాణి నిర్మించిన పుష్కరిణీ తీరంలో బుద్ధుడు శోణదండుడనే చంపా నగర బ్రాహ్మణునికి బ్రాహ్మణ ధర్మాన్ని చెబుతాడు. ధ్యాన శీలాదులున్న పవిత్ర జీవితాచరణమే నిజమైన యజ్ఞమని చెబుతాడు.

అలాంటి సంక్షోభ నమయంలోనూ, తమ ధర్మాలను నిర్వహిస్తున్న బ్రాహ్మణులూ, తక్కిన వర్ణాలవారు లేకపోలేదు. వారందరూ శీలానికి ప్రాధాన్యమిచ్చారు. ఋషిదృష్టమైన జ్ఞానం బుద్ధదర్శిత నిర్వాణం కన్నా భిన్నంకాదనిపిస్తుంది. శమదమాదులు లేకపోతే ఈ స్థితి లభించదు. సుమధురమైన మానుషమే ఈ దివ్యానుభూతికి సాధనం. తర్కప్రజ్ఞవల్ల ఇది లభించదు. క్రోధ మాత్సర్యాలకు దూరుడై పవిత్ర చిత్తుడై ఆత్మనిగ్రహం గలవాడే భిక్షువనీ, అతడే బ్రాహ్మణుడనీ, అతడు భౌతిక దేహ పతనానంతరం బ్రహ్మైక్యం పొందుతాడని బుద్ధుడు తేవిజ్జసుత్తాంతంలో అన్నాడు. బ్రహ్మమంటే సర్వాతీతమై, అతీంద్రియమైన శాంత్యానంద రూపమేనని బుద్ధుని మతం.

ఆనాడు ప్రజలకు కావలసింది శీలప్రతిష్ఠ, తత్త్వజ్ఞానం కాదు. కరుణాహింసాదికల్యాణ గుణసంపత్తిలేని తత్త్వజ్ఞానం ప్రమాదాత్మకం. ఉపనిషత్తులలో ఏకదేశంగా చెప్పబడిన ఈ సచ్ఛీలయోగాన్ని బుద్ధుడు సంపూర్ణంగా బోధించాడు.



"శీలేపతిత్థాయ నరో సవణ్ణో చిత్తం వణ్ణంచ భావయం
ఆతాపి నివకో భిక్ఖు సోఇమాం వి, జయతే జతంతి."

అన్నాడు.

ప్రజాసామాన్యం తెలుసుకొనడానికి బుద్ధుడు పాటలీపుత్ర భాషలో ఉపదేశించాడు. పాటలీపుత్ర భాషే పాలీ అయిందని నా విశ్వాసం. దీనిని మాగధి అనికూడ అన్నారు. మాగధే అన్ని భాషలకూ మూలమని బౌద్ధులన్నారు. బుద్ధఘోషుడు తన భాష్య గ్రంథాలను మాగధిలోనే రచించినట్టు చెప్పుకున్నాడు. మహావంశంలో ఈ భాషను గురించి ఇలా వుంది :

"నిస్సంసయం గ మే త్తేయో ఇతివత్వా పునఃపునం,
సద్దిం అత్థకథాయాద పొత్తకే పిటక త్రయే,
గంకారే వసంతో సా విహారే దూరసంకరే.
పరివత్తేపి సబ్బాపి సింహళస్థకథాతదా,
నబ్బేసం మూలభాసాయా మాగధాయ నిరుత్తియా,
సత్తానం సబ్బభాసానం ఆహూ రాశి హితావహా."

"మహావిహారంలోని భిక్షువులు అత్థకథతో పోయి పిటకత్రయాన్ని బుద్ధఘోషునికిచ్చారు. బుద్ధఘోషుడు సర్వభాషలకు మూలమైన మాగధీభాషలో సింహళ భాషలోని అత్థకథను సంపూర్ణంగా పరివర్తనం చేశాడు. అది సర్వభాషలకు మూలమైంది."

ప్రాంతీయ భాషలో బోధించే పద్ధతికూడ తెలుగువారిని విశేషంగా ఆకర్షించి వుంటుంది.

బుద్ధుడి ఉపదేశాల పాఠం నిశ్చయించడానికి బుద్ధుని నిర్యాణం తర్వాత రెండు నెలలకు రాజగృహం సమీపంలోని సప్తపర్ణి గుహలో శిష్యులు సమావేశమయ్యారు. దీనిని ప్రథమ సంగీతి అంటారు. ఈ గుహ వైహార పర్వతంలో వుంది. అజాతశత్రువు ఈ సభాస్థలిని ఏర్పాటు చేశాడు. ఈ సంగీతికి మహాకశ్యపుడనే బుద్ధ భిక్షువు అధ్యక్షత వహించాడు. సంఘానికి, ధర్మానికి సంబంధించిన సూత్రాలను, గౌతముడు బోధించిన ధర్మబోధనలను వారు కూర్చి నిర్ణయించారు. ధారణా పద్ధతిలోనే సమస్త బోధలూ ఉండిపోవడంవల్ల, లిఖిత గ్రంథాలు లేకపోవడంవల్ల శిష్యులు ఈ విధంగా సమావేశమై ఉపదేశాల సేకరణ, వాటి నిర్ణయం చేయవలసి వచ్చింది. ఈ సంగీతికి తెలుగుదేశం నుంచి 40 మంది ప్రతినిధులు వెళ్ళారు. ఈ సమావేశం నిర్ణయించిన మతానికి థేరవాదమని పేరు.

గౌతముని నిర్యాణానంతరం కొద్ది కాలంలోనే చాలా రాజ్యాలు పుట్టుకు వచ్చాయి. ఈ రాజకీయ పరిణామం వల్ల రాజ్యాలకు పరస్పరం పోట్లాటలు జరిగాయి. మగధరాజయిన అజాత శత్రువుకు, వజ్జియనులకు జరిగిన పోరాటంలో మగధ, కోశాంబి, శ్రావస్తి రాజ్యాలు పోరాడాయి. చిన్న చిన్న రాజ్యాలు కొన్ని దానిపక్క, దీనిపక్క చేరాయి. మగధ రాజ్యమూ విస్తరించింది. ఇవన్నీ బౌద్ధాన్ని అనుసరించేవే. కాని, రాజ్యాల మార్పుతో ధర్మంలోను మార్పులు వచ్చాయి. అందువలన మరల ధర్మనిర్ణయంకోసం, సంశయ పరిహారంకోసం భిక్షువులందరూ సమావేశమయ్యారు.

బుద్ధుని నిర్యాణానంతరం వంద సంవత్సరాల తర్వాత జరిగిన ఈ సమావేశాన్ని ద్వితీయ సంగీతి అంటారు. ఇది వైశాలిలో జరిగింది. దీనికి తెలుగు దేశం నుంచి పలువురు ప్రతినిధులు వెళ్ళారు. దీనిని కాలాశోకుడనే రాజు ఏర్పాటుచేశాడు. దీనిలో 700 మంది భిక్షువులు పాల్గొన్నారు. వీరిలో బౌద్ధులు అభిప్రాయభేదాలతో థేర (స్థవిర) వాదులని, మహాసాంఘికులని రెండుగా విడిపోయారు. వారినే థేరనికాయులని, మహాసాంఘిక నికాయులని అన్నారు. భేదం కలిగించిన విషయాలు విచిత్రమైనవే.

1) అవసరాలకు ఉప్పు నిలువ చేసుకోవాలి.

2) భోజనం మధ్యాహ్నం లోపలే కాకుండా తర్వాతకూడ చేయవచ్చు.

3) బౌద్ధవిహారాలు మొదలైన సౌకర్యాలు లేని దేశాలలో వినయ సూత్రాలను సడలించాలి.

4) విహారాలకు సంబంధించి ఉపోసత మందిరాలలో మాత్రమే కాకుండా, ఆ ప్రాంతంలోని ఇతర స్థలాలలోను దీక్ష ఇవ్వవచ్చు. దోషాలను పెద్దలముందు అంగీకరింప జేయవచ్చు.

5) ఏ పనినైనా చేయడానికి బౌద్ధ సంఘం అంగీకారం అవసరమైనా, పని చేసిన తర్వాత కూడ ఆ అంగీకారం పొందవచ్చు.

6) పూర్వుల ఆదర్శాలు తీసుకోవడమే ఏపనికైనా సరైన ప్రమాణం.

7) భోజనానంతరం నీళ్ళు, పాలు వంటివి మాత్రమేకాక ఇతర పానీయాలూ సేవించవచ్చు.

8) మత్తును కలిగించని నీరావంటి వాటినికూడా సేవించవచ్చు.

9) ఆసనాలపైన అంచులులేని వస్త్రాన్ని వేసుకోవచ్చు.

10) భిక్షువులు బంగారాన్ని, వెండినీ స్వీకరించవచ్చు.



ఈ అంశాలను ఆమోదించాలని 700 మందిలో అధిక సంఖ్యులు కోరారు. తక్కినవారు కాదన్నారు. ఈ అంశాలు ధర్మ బాహ్యాలుకావని అధిక సంఖ్యాకులు అంగీకరించినందున అల్పసంఖ్యాకులు థేర నికాయులుగానే వుండిపోయారు. అధిక సంఖ్యాకులు మహా సాంఘిక నికాయులుగా విడిపోయారు. ఈ సంగీతికి మహాసంగీతి అని పేరు.

ఈ ప్రజాస్వామ్య పద్ధతిని బుద్ధుడు తన కాలంలోని అనాదిజాతుల సంఘాలనుంచి గ్రహించాడు; ప్రశాంతంగా విభేదాలు తొలగించడానికి ఈ పద్ధతిని అనుసరించాడు. ఇది నత్తి, కమ్మవాచ, శలాకా. నత్తి అంటే తీర్మానం ప్రతిపాదించడం, కమ్మవాచ చర్చలు జరపడం, శలాకా వోటింగు.

ఈ విధంగా బౌద్ధ సంఘం తర్వాత 120 సంవత్సరాలకు — అనగా క్రీస్తు పూర్వం 263 వరకు 18 నికాయాలుగా చీలింది. మహాసాంఘిక నికాయం మార్పు చెందుతూ క్రీస్తు శకారంభానికి మహాయాన నికాయంగా పరిణమించింది.
తృతీయసంగీతి కనిష్కుని కాలంలోను, చతుర్థ సంగీతి మౌర్యాశోకుని కాలంలోనూ, పంచమసంగీతి హర్షవర్ధనుని కాలంలోను జరిగాయి. పద్దెనిమిది చీలికలయిన నికాయాలలో థేరవాదులు పన్నెండువర్గాలుగాను, మహాసాంఘికులు ఆరు వర్గాలుగాను చీలిపోయారు.

మన నిర్గుణ పరబ్రహ్మోపాసనవలె హీనయానం, దాని కఠోర నియమాలు సామాన్యులకు దుస్సాధ్యమయాయి. మోక్షజ్ఞానం ప్రధానమని, నిర్వాణాన్ని బాహ్య సాహాయ్యమేమీ లేకుండా తానే స్వయంగా సాధించాలని హీనయానం చెబుతుంది.

మహాయానం బుద్ధదేవుని యెడల భక్తిని బోధించి, సర్వజీవులూ నిర్వాణం పొందవచ్చుననీ, నిర్వాణమంటే ఏకైక సత్త్వరూపమనీ, అది మన వ్యవహారానుభవంలో ఉండే జీవాత్మ లక్షణాలేవీ లేని శూన్యగుణ రూపమనీ చెప్పింది. అర్హత్ సిద్ధి ఉత్తమమైనది కాదని, దానికంటే బోధిసత్త్వస్థితి మహనీయమని కూడ మహాయానం చెబుతుంది. మహాయానమత ప్రతిపాదకమైన సద్ధర్మ పుండరీకంలో అర్హత్త్వం నిందితమయింది. గౌతముడే బోధిసత్త్వస్థితిని ప్రశంసించినట్లు సద్ధర్మ పుండరీకం చెప్పింది. సద్ధర్మ పుండరీక, ప్రజ్ఞాపారమిత, సమాధిరాజ, లంకావతార సూత్రాలు మహాయానం బలీయంగా వున్న తెలుగువారు రచించినవని నా నమ్మకం. "మానవరక్షణకై త్రిలోకాలలోను బుద్ధుని ఆగమనం అవసరం గనుక స్వీయమోక్షంతో సంతృప్తిపొందకుండా జీవలోకాన్ని యుగ యుగాల్లోనూ సముద్ధరించడానికి బోధిసత్త్వస్థితిని పొందాలి. ఇది అర్హత్‌స్థితి కంటె మహనీయం, సమున్నతం." ఇది మహాయాన మతం, ఈ మహాయాన ధర్మాన్ని పరిశీలిస్తే దీనికి, భగవద్గీతలో చెప్పిన ధర్మానికి భేదం కనిపించదు. బుద్ధుడొక సామాన్యమానవుడు కాదని,

దేవాదిదేవుడని, సద్ధర్మ పుండరీకం తెలుపుతుంది. అతడు కృపాసాగరుడు, జీవుల మోక్షంకోసం అతడే ప్రయత్నించి సాధిస్తాడు.

పూర్ణసిద్ధిని గురించి అశ్వఘోషు డిలా అన్నాడు:- అది శూన్య ప్రదేశం వంటిది. అద్దంయొక్క తళతళ వంటిది, శాశ్వతమైనది. సర్వవస్తువులూ దానిచేతనే పరిపూర్ణత పొందుతున్నాయి. సర్వజీవదశలూ దానిలోనే ప్రతి ఫలిస్తాయి. దానిలో ప్రవేశించేదీ, పోయేదీ, నశించేదీ ఏమీలేదు. అది సర్వ కలుషాలకూ అతీతమైన ప్రజ్ఞాసారం.

ఇలా క్రీస్తు శకారాంభంలో మొలకెత్తిన మహాయానం నాగార్జునాచార్యు నితో మహా పటవృక్షంగా పెరిగింది. దానికి దిగ్నాగాచార్యుడు మొదలైనవారు ప్రోదిచేశారు.

## బౌద్ధ ధర్మం






చైత్యవాదులకు ధాన్యకటకం ప్రధానారామం. వీరిలోను, పూర్వశైలీయ అపరశైలిక, సిద్ధార్థక, రాజగిరిక అనే వర్గాలు ఏర్పడ్డాయి. ఈ చైత్యకుల నుంచే మహాయానులు క్రీస్తు శకారంభంలో ఏర్పడ్డారు. చైత్యకులలనే చైత్యం కట్టాలనేవారు.

ఈ మహాయానం తర్వాత దేశమంతటా వ్యాపించింది. దీనినిబట్టి తెలుగు వారు ఎక్కువగా మహాసాంఘికుల పైనే మొగ్గారనడం స్పష్టం. మహాయానం తర్వాత వజ్రయానమైంది. ఇదే బౌద్ధంలో చివరిదశ, మహాసాంఘికులు బుద్ధుణ్ని లోకాతీత అతిమానుషవ్యక్తిని చేశారు. స్థవిరవాదులు అతని మానవ తను రక్షించారు.

మహాయానం ఒక మహత్తర ఆదర్శాన్ని ఎదుట నిలుపుతుంది. దీనిలో త్యాగం ముఖ్యం. ఏదీ అజేయం కాదు. బోధిసత్త్వ అవతారసృష్టి ఈ త్యాగ నిరూపణకే. ఈ త్యాగంవల్లనే బౌద్ధమతం ఆఫ్ఘనిస్తాన్ నుండి జపాన్ వరకు, సైబేరియా నుండి జావావరకు మానవజాతిని ఆకర్షించి, ఆయా ప్రాంతాలను కళామయం చేసింది.

ఈ మహాయానం మరొక ఈవి దర్శనం. ఈ సంప్రదాయం ఉన్నత దర్శన శాస్త్రాన్ని మనకు ప్రసాదించింది. రెండవ శతాబ్దపు నాగార్జునుడు, ఆయన వ్యాఖ్యాతలు, నాల్గవ శతాబ్దపు అసంగుడు ఈదర్శనాలను తీర్చిదిద్దారు. అసంగుడు ఈ విశ్వాన్ని క్షణక్షణ పరివర్తన శీలమన్నాడు. దీనికి అపవాదం లేదన్నాడు. అందువల్లనే తన మతానికి అనాత్మవాదమన్నాడు. నాగార్జునుడు ఈ అనాత్మ వాదాన్ని, అనిత్యత్వాన్ని, ఆధారం చేసుకొని తన శూన్యవాదాన్ని లేక సాపేక్షవాదాన్ని నిరూపించాడు. అతడు పదార్థ జగత్తును సర్వత్రా క్షణికత, అనాత్మవాద సిద్ధాంతాలను ప్రయోగించి, అన్ని వస్తువులు శూన్యమని, సార శూన్యమని ఉద్ఘోషించాడు.

ఆంధ్రదేశపు బౌద్ధాచార్యులలో నాగార్జునుడు ప్రథమగణ్యుడు. ఇతడు విదర్భలో ఒక బ్రాహ్మణ వంశంలో జన్మించాడు. వైదికమతాన్ని బాగా అధ్యయనం చేశాడు. ఇతడు సర్వతోముఖ ప్రజ్ఞాశాలిగా, తత్త్వశిఖామణిగా, మహాకవిగా ప్రసిద్ధి చెందాడు. శ్రీపర్వతోపరితలంపై మహాయానపీఠం నెల కొల్పాడు. నాగార్జునికి ముందునుంచే శ్రీపర్వతం (నాగార్జునకొండ) మహా విహారాలకు, చైత్యాలకు, విద్వద్వరులకు, బౌద్ధ భిక్షువులకు ఆటపట్టు. ఇతడు శాతవాహన రాజవంశీయుడైన యజ్ఞశ్రీ శాతకర్ణికి మిత్రుడు. ఇతడు క్రీస్తు శకం 70-99 లలో వున్నవాడు. యజ్ఞశ్రీ నాగార్జునునికోసం సంఘారామా

లను శ్రీపర్వతంపై నిర్మించాడు. పాహియాన్ దీనిని పారావత విహార మన్నాడు. నాగార్జునుని ప్రోత్సాహంవల్ల శాతకర్ణి అమరావతీ చైత్యానికి రమణీయ వరణం నిర్మించాడు. నాగార్జునుడు శాతకర్ణికి ఒకలేఖ లిఖించాడు. ఇది సుహృల్లేఖ అనే పేరుతో టిబెట్ చైనా భాషలలో అనువాద రూపంలో సురక్షితంగా వుంది. ఈ లేఖలో నాగార్జునుడు తన మిత్రునికి ధర్మయుతమైన సందేశమిచ్చాడు.

నాగార్జునుడు తన సిద్ధాంత ప్రతిపాదకంగా మాధ్యమిక కారిక, విగ్రహ వ్యావర్తిని అనే గ్రంథాలు రచించాడు. బుద్ధుని వాదానికంతా మూలభూతమైన ప్రతీత్య సముత్పాదమనే. దానిని నాగార్జునుడు శూన్యవాదమనే పర్యాయంతో చెప్పాడు. బుద్ధుని దర్శనం అనిత్య, దుఃఖ, అనాత్మలనే సూత్రంపై నిబద్ధం. స్థూలంగా బుద్ధదర్శనం నవాంగం.

(1) క్షణికవాదం (2) ప్రతీత్య సముత్పాద్యం (3) అనాత్మవాదం (4) అ-భౌతికవాదం (5) అనేశ్వరతవాదం (6) దశఅకథనీయాలు (7) ఆలోచనాత్యంతం (8) సర్వజ్ఞత్వ నిరసనం (9) నిర్వాణం.

బుద్ధుడు కార్యకారణాలను అవిచ్ఛిన్నసంతతిగా ఒప్పుకోడు కాని, ఇది జరిగిన తర్వాత అది జరుగుతుంది అనేదాన్ని అంగీకరించాడు. ఒకదాని నాశనంతర్వాత రెండవదాని ఉత్పత్తి. ఈ నియమాన్ని ప్రతీత్య సముత్పాదం అన్నాడు. ప్రతి ఉత్పాదనకు ఒక ప్రత్యయం వుంటుంది. ప్రత్యయమంటే హేతువు. అనగా ఒకటి గడచిన తర్వాత, నష్టమయిన తర్వాత రెండవది పుట్టడం ప్రతీత్య సముత్పాద్యం. కార్యకారణ నియమం అవిచ్ఛిన్నం కాదు. విచ్ఛిన్న ప్రవాహం. దీనినే నాగార్జునుడు శూన్యమన్నాడు.

నిర్వాణమంటే దీపంగాని, మంటగాని ఆరిపోవడం. ప్రతీత్య సముత్పన్నమైన నామరూపాలు తృష్ణావేగంతో కలిసి జీవన ప్రవాహరూపం ధరించి ప్రవహిస్తుంటాయి. ఈ ప్రవాహపు అత్యంత విచ్ఛేదమే నిర్వాణం. పోసిన నూనె, వత్తి, లేక మరొక ఇంధనం కాలిపోయిన తర్వాత మళ్ళీ నూనె, వత్తి, ఇంధనం లేనప్పుడు మంటగాని, దీపంగాని ఆరిపోయినట్లు ఆస్రవాలు - మనో మాలిన్యాలు క్షీణించిన పిదప ఈ జన్మ మరణాలు నశిస్తాయి. నిర్వాణమంటే ఆరిపోవడం గదా! కాని బుద్ధుడు నిర్వాణగతుడైనవాడు మరణించిన పిదప ఏమవుతుందనే విషయం చెప్పడానికి నిరాకరించాడు.

క్షణికవాదాన్ని నాగార్జునికి పూర్వమున్న ఆచార్యులు యత్ సత్ తత్ క్షణికం- ఏది వాస్తవికమో అదంతా క్షణికం అని వివరించారు. అలానే ఏది క్షణికం కాదో అది వాస్తవికం కాదని కూడా అన్నారు. ఇట్టి స్థితిలో కార్య



కారణాలమధ్య వుండే సంబంధాన్ని సాధించేవస్తువు వుండడానికి వీలులేదు. అందువల్ల బుద్ధుడు కార్యకారణ నియమం గురించి "అస్మిసతి ఇదం భవతి" అని చెప్పాడు. కారణం వుంది కాబట్టి కార్యం రూపొందుతున్నది. కారణం నాశనమైన పిమ్మట కార్యం ఉత్పన్నమవుతుంది. రెండూ కలిసి ఏకకాలంలో వుండవు.

ప్రతిదీ శూన్యమని నాగార్జునుని వాదం. శూన్యం అంటే సత్యం అసత్యం, ఉభయం అనుభయం కూడ కానిది. పదార్థాలన్ని స్వవ్యాఘాతాలు, అస్థిరాలు. అందువల్ల అసత్యాలు అనగా శూన్యాలు.

"తత్తత్ప్రాప్య యదుత్పన్నం
నోత్పన్నం తత్స్వభావతః."

కారణమున్నదంతా అసత్తు. పుట్టినదానిమీద, కార్యంమీద ఆధారపడినది నిజమైనది కాదు, అప్పు స్వధనం కానట్టు. మన అజ్ఞానంవల్ల దృశ్యమాన జగత్తు వుంది. ప్రజ్ఞ అలవడినప్పుడు మిథ్యాజ్ఞానం కరిగి శూన్యం ఏర్పడుతుంది. ఇది పరమసత్యానికి సంకేతం. కేవలం శూన్యం కాదు.

శాశ్వత వాదానికీ (doctrine of eternity), ఉచ్ఛేదవాదానికీ (doctrine of annihilation) మధ్య మార్గం కావడంవల్ల నాగార్జునుడు తన వాదాన్ని మాధ్యమిక వాదమన్నాడు.

మాధ్యమికవాదం ప్రధానాంశం పూర్తిగా ఉపనిషత్సిద్ధాంతమే. కాని మాధ్యమికులు ఎంతమేర ఉపనిషత్సిద్ధాంతాలనుంచి గ్రహించారన్నదానిని పరిశోధన చేయవలసి వుంటుంది. నిజానికి వీరు ఉపనిషత్సిద్ధాంతానికీ, అద్వైతానికి సేతువువంటి వారనవచ్చు. కనుక అద్వైతులను ప్రచ్ఛన్న బౌద్ధులనే అభాషాణకాన్ని పూర్తిగా కొట్టివెయ్యలేము. అలాగే మాధ్యమిక వాదులనూ ప్రచ్ఛన్నా ద్వైతులనీ అనవచ్చు.

ఈ శూన్యవాదమే వీరబ్రహ్మం, వేమన మున్నగు తెలుగు యోగివేదాంతులు చెప్పిన బయలు అని మిత్రులు, తెలుగుభాషా సమితి విజ్ఞాన సర్వస్వ సంపాదకులు చీమకుర్తి శేషగిరిరావుగారు అంటున్నారు. వారిది శంకరుల అద్వైతం కాదు. శూన్యవాద బౌద్ధం నుంచి, ప్రజాసామాన్యం నుంచీ వ్యాపించిన కొన్ని సిద్ధాంతాల పరిణామమే వారిదని, అందువల్ల వారు అద్వైతస్థితిని "బయలు" అన్నారని ఆయన అంటున్నారు.

(డాక్టర్ అర్. సుబ్రహ్మణ్యం స్మారక - సంచిక 1983 నుంచి)

# బౌద్ధ సాహిత్యం: ఆంధ్ర బౌద్ధాచార్యులు

వైదిక భాషకు సమానాంతరంగా ఎదిగిన పాలీ ప్రాకృతంలో బుద్ధునికి పూర్వం సాహిత్యం ఉండనే ఉంటుంది. ప్రజలు ప్రాణంలేని బొమ్మలు కాదు గదా! తమ సుఖదుఃఖాలు, వినోదవిలాసాలు తెలుపడానికి ఏవో మాటలు అనే ఉంటారు; పాటలు పాడే ఉంటారు. అవి ఖిలమై ఉండి ఉంటాయి. మనకు తెలిసినంతలో పాలీ భాషలోను, ఇతర ప్రాకృతాలలోను మనకు లభించే సాహిత్యం బుద్ధుని ఉపదేశాలు, మహావీరుని ఉపదేశాలూను.

బుద్ధుడు పాటలీపుత్ర పరిసరభాష అయిన పాలీభాషలో తన ప్రసంగాలు చేశాడు. పాత సాహిత్యపు ఊసే ఎత్తలేదు. ఆయన ప్రసంగాలు, ఉపదేశాలు అపారసాహిత్యమైంది. బుద్ధుని కాలంలో ఈ సాహిత్యాన్ని పరిరక్షించడానికి ప్రయత్నమేదీ జరుగలేదు. ఇది కేవలం వేదంలాగ ప్రవచన చింతన రూపంలో మాత్రమే ఉండేది. లిఖితరూపం పొందలేదు. బుద్ధుడు తన మాటలకు అపార్థం లాగకుండా జాగ్రత్త పడవలసిందని శిష్యులను హెచ్చరించాడు. కాని అపార్థంలాగడమే జరిగింది, బుద్ధుని నిర్యాణానంతరం.

సుభద్దుడనే వృద్ధభిక్షువు బుద్ధుని నిర్యాణానంతరం క్రమశిక్షణ విషయంలో తనను నిర్బంధించేవారు ఎవరూ లేరుగదా అని సంతోషించి, బుద్ధుని మాటలను తన సౌకర్యం ప్రకారం వ్యాఖ్యానించడం ప్రారంభించాడు. "అథ ఖో సుబద్దో బుద్ధ పబ్బజితో తే భిఖ్ఖూ ఏతద్ అవోచ. అలం ఆవుసో. మాసోచిత్థ, మాపరిదేవిత్థ. సుముత్తామయం తేన మహాసమణేన, ఉపద్దూతాచ హెరామ, ఇదం వో కప్పటీ, ఇదంవో న కప్పటీతి. ఇదానీ పనమయం యం ఇచ్ఛిస్సామ తం కరిస్సామ, యం న ఇచ్ఛిస్సామ, తం న కరిస్సామతి."

బుద్ధుని నుంచి ప్రవ్రజ్య పొందిన సుభద్దుడనే వృద్ధభిక్షువు తక్కిన భిక్షువులతో ఇలా అన్నాడు- "భిక్షువుల్లార శోకించడం చాలు. ఏడవకండి. మహాశ్రమణుని పీడవిరుగడ అయింది. ఇది మీభిక్షపాత్ర ఇదికాదు అని చెప్పేవాడెవడూ లేడు. మనమిప్పుడు మన ఇష్టం వచ్చింది చేయవచ్చు. ఇష్టంలేంది మానవచ్చు."

సుభద్దుని మాటలకు కినిసిన థేరులు కొందరు మహాకాస్యపథేరుని నాయకత్వంలో ప్రథమ సంగీతి-మహాసభ, రాజగృహంలో జరిపారు. ఈ సంగీతి



బుద్ధుని ఉపదేశాలన్నింటిని సంపూర్ణంగా సేకరించి, ధర్మ (సిద్ధాంతం), వినయ (నియమ నిబంధనలు) అనే రెండు విషయాలను నిర్ణయించింది. తర్వాత వందసంవత్సరాలకు జరిగిన రెండవ సంగీతిలో వినయ నియమ నిబంధనలను ఉల్లఘించిన వారిపై చర్య గురించి చర్చ జరిగింది. ఇది వైశాలీ నగరంలో జరిగింది. అశోకుని ఆధిపత్యంలో జరిగిన మూడవసంగీతిలో బుద్ధుని ఉపదేశాలు మొదలయినవి, మూడు పిటకాలుగా-సుత్త, వినయ, అభిధమ్మ అని నిర్ణీతమయ్యాయి. పిటకమంటే గంప. ఈ సభలో బుద్ధని బోధనలపై తప్పు అభిప్రాయాలు తొలగించబడినాయి. విదేశాలకు బౌద్ధ ప్రచారకులను పంపాలనే తీర్మానం కూడా జరిగింది. తదనుగుణంగానే అశోకుడు తన కుమారుడయిన మహిందుని బౌద్ధధర్మ ప్రచారం కోసం సింహళానికి పంపాడు.

## వినయ పిటకం :

వినయపిటకం బౌద్ధ సద్యాసుల నియమ నిబంధనలకు సంబంధించినది. బౌద్ధమతంలో కొత్త వానిని చేర్చుకునే విధానం, ఆయా కాలాలలో చేసిన పాపాలను ఒప్పుకోవడం, వైద్యచికిత్సా పద్ధతులు, పరస్పర వివాదం, వైషమ్యం కలిగినవుడు ఆచరించవలసిన రీతులు మొదలయినవి ఈ పిటకంలో నిర్దేశించబడినాయి.

## సుత్త పిటకం :

బుద్ధుని ఉపదేశాలు, సిద్ధాంతాలు తెలిపే భాగమిది. దీనిలో దీఘనికాయ, మఝ్ఝమనికాయ, ఖుద్దకనికాయ, సంయుత్తనికాయ, అంగుత్తనికాయ అనే ఐదుభాగాలున్నాయి. నికాయ అనడానికి మారు ఆగమ అని కూడ వ్యవహరిస్తారు.

మొదటి నాలుగు భాగాలలో బుద్ధప్రవచనాలు, శిష్యుల అభియోగాలు, వాదాలు ఉన్నాయి. ఇది చాలవరకు వచనమే. అక్కడక్కడ పద్యాలూ ఉన్నవి. దీఘనికాయంలోని 16వ మహాపరినిర్వాణ సుత్తంలో బుద్ధుని అంత్యదినాలలో జరిగిన విషయాల వర్ణన ఉంది. సంయుత్తనికాయంలో ముఖ్యమైంది ధర్మచక్ర పరివర్తన సూత్రం.

ఖుద్దకనికాయంలో ఖుద్దకవాదం, దమ్మపదం, ఉదాన గ్రంథం, ఇతివుత్తుక, సుత్తపాత, విమానవత్థు, పేతవత్థు, థేరగాథలు, థేరీగాథలు, జాతకకథలు ముఖ్యమైనవి.

## అభిదమ్మ పిటకం :

దీనిలో ధర్మవివరణ, నీతి, మనస్తత్త్వం, జ్ఞానస్వరూపం మొదలయిన వివిధ విషయాల చర్చ ఉంది. రచన శాస్త్రీయంగా కొనసాగింది. ఈ అభిదమ్మ పిటకానికి బర్మాదేశంలో గౌరవ ప్రచారాలు ఎక్కువగా ఉన్నాయి.

## మిళింద పన్హ :

పిటకాల తర్వాత గొప్ప పాళీగ్రంథం మిళింద పన్హ. దీని రచనా కాలం క్రీస్తు పూర్వం రెండవ శతాబ్దంలో మెనాందర్ అనే రాజు కాలంలో. ఇతడు ఇండో-బాక్ట్రియన్‌రాజు. స్వేచ్ఛగా బౌద్ధమతం స్వీకరించి మిళిందుడని విఖ్యాతుడయ్యాడు. మిళిందపన్హలో మిళిందునికి, నాగసేనుడనే అప్పటి గొప్ప బౌద్ధాచార్యునికి బౌద్ధధర్మం గురించి జరిగిన చర్చ సంభాషణ రూపంలో ఉంది. పిటకాల తర్వాత ఇదే ప్రమాణ గ్రంథం.

ఈ గ్రంథం మొదట సంస్కృతంలోను, వాయవ్య సరిహద్దు ప్రాంతపు ప్రాకృతంలోను రచితమైంది. తర్వాత సింహళంలో దీనిని పాలీభాషలో అనువదించారు.

## నెత్తి పకరణ :

నెత్తిపకరణ మిళింద పన్హకు సమకాలికమైన రచన. దీనిని బుద్ధుని ప్రముఖ శిష్యుడైన మహాకచ్చాయన రచించాడని అంటారు. ఇది పిటికాల విషయాలపై వ్యాఖ్యాన రూపమైన రచన. బుద్ధుని ఉపదేశాలను సమన్వయ పరిచే ప్రథమ గ్రంథమిది.

దీనిని 5 వ శతాబ్ది వాడయిన ధమ్మపాల వ్యాఖ్యానించాడు.

## పెటకోపదేశ:

మిళింద పన్హకు సమకాలికమైన మరొక రచన యిది. ఇది కూడ మహా కచ్చాయనే రచించాడంటారు ఇది నెత్తివకరణకు అనుబంధంగా కనిపిస్తుంది. నెత్తిపకరణలోని మూడు అధ్యాయాలు దీనిలో ఉన్నాయి. త్రిపిటకాలలోని అంశాలు చాల ఉల్లేఖింపబడ్డాయి దీనిలో. కొన్ని విషయాలలో ఇది నెత్తివకరణలో స్పష్టంగాలేని విషయాలను వివరిస్తుంది.

పాలీ సాహిత్యం క్రీస్తుశకం ప్రారంభంలోను, తర్వాతను సింహళంలో బాగా అభివృద్ధి చెందింది. అశోకుని కుమారుడు మహేంద్రుడు సింహళానికి



వెళ్ళినప్పుడు త్రిపిటికాలతో పాటు అట్ట కథ అనే త్రిపిటిక వ్యాఖ్యలనూ వెంట తీసుకు వెళ్ళాడు. ఈ వ్యాఖ్యలన్నీ పాళీ భాషలోనే ఉన్నాయి. వీటిలో అంధ కాట్ట కథ అనేది ఒకటి. దీనిని బుద్ధఘోషుడు సీమంతసారిక అనే వ్యాఖ్యలో "యం పన అందకాట్ట కథాయం అవరిక్ఖిత్తే పముఖే అనాపత్తి భూమియం వినా జగతియా సహితం సంధ్యా య కథితం, తోపట్టం తం అంధకరట్ఠే పాచేక్కం ఏకచ్ఛద నాగ ఛపాతేయ సంధాయ పట్టం" అని ఉల్లేఖించాడు.[1]

## విసుద్ధిమగ్గ :

బుద్ధఘోషుడు క్రీస్తుశకం 5 వ శతాబ్దంలో జీవించిన బౌద్ధపండితుడు. ఇతడు రచించిన విసుద్ధి మగ్గ అనే గ్రంథం హీనయాన బౌద్ధ సంప్రదాయంలో ఒక ప్రస్థాన గ్రంథం. ఇతడు ధమ్మసంగని అనే బౌద్ధ గ్రంథానికి అమూల్యమైన వ్యాఖ్య వ్రాశాడు.

ఇతడు బుద్ధగయ సమీపంలో ఒక బ్రాహ్మణ వంశంలో పుట్టాడు. క్రీస్తుశకం 413 ప్రాంతంలో సింహళం పాలించిన మహానామ అనే రాజు కాలంలో సింహళానికి వచ్చి, బౌద్ధమతం స్వీకరించి అనురాధపుర సంఘారామంలో నివసించి పెక్కు గ్రంథాలు రచించాడని అంటారు. కాని, ఇతడు ఆంధ్రుడు కావచ్చు. ఆంధ్రదేశంలోనే చాల కాలం జీవితం గడిపాడు. మోరం డఖేటక గుహావాసి.

ఇతని సమకాలికులు బుద్ధదత్త, ఆనంద, ధర్మ పాలులు.

## పాలీ లక్షణ గ్రంథాలు :

పాలీ లక్షణ గ్రంథాల చరిత్ర బుద్ధుని ప్రముఖ శిష్యుడైన మహాకచ్చాయనుని కాలంనుంచే ప్రారంభమవుతుంది. మహాకచ్చాయనుడే ప్రథమ వ్యాకర్త.

పాలీ వ్యాకరణలలో మూడు శాఖలున్నాయి- కచ్చాయన, మొగ్గలాన, సద్దనీతి. మొదటి శాఖ భారతదేశంలో పుట్టి, సింహళంలో వర్ధిల్లింది. ఇది కాతంత్ర సంప్రదాయానుసారి. రెండవ శాఖ పాణిని, చంద్ర, కాత్యాయనుల సంప్రదాయానుసారి. మూడవది బర్మా[2]దేశంలో వర్ధిల్లింది. వీటిలో కచ్చాయన శాఖ ప్రాచీనం. ఈ మూడు శాఖల్లోనూ వ్యాకరణ ఛ్చందోలంకార గ్రంథాలు చాలు ఉన్నాయి.

---

1. పరిశోధన బుద్ధ జయంతి సంచిక – 1956 నవం.

సుబోధాలంకార అనే అలంకార శాస్త్ర గ్రంథాన్ని దండి కావ్యాదర్శం ఒరవడిలో సింహళాచార్యుడు సంఘరక్షితుడు రచించాడు. ఇదే చెప్పుకోదగిన అలంకార శాస్త్ర గ్రంథం. దీనిలోని ప్రతి అలంకారానికి బుద్ధుని జీవితం నుంచి ఉదాహరణలు ఇవ్వబడ్డాయి.

ఇతడే వృత్తోదయ అనే ఛందోగ్రంథాన్ని రచించాడు.[1]

## హీనయాన సంస్కృత గ్రంథాలు :

హీనయాన బౌద్ధులు పాలీపిటకాలను సంస్కృతీకరించారు. వీటిపేరు. ఆగమ, వినయ, అభిధర్మ. సర్వాస్తివాదబౌద్ధులు సంస్కృతంలో రచించిన పిటకాల భాగాలు కొన్ని గిల్గిత్ (ఇపుడు పాకిస్తాన్)లో దొరికాయి. మధ్య ప్రాచ్యంలోని హారోములో మరికొన్ని దొరికాయి.

## మహావస్తు :

హీనయాన సాహిత్యంలో మహావస్తు చాల ముఖ్యమైనది. ఇది బౌద్ధ సిద్ధాంతాల, గాథల సర్వస్వమనదగినది. ఇది మహా సాంఘికులలో ఒకశాఖ అయిన లోకోత్తర వాదుల వినయ పిటకంలో మొదటి అధ్యాయమని అంటారు. దీనిలో బుద్ధుని జీవితకథ మూడు ప్రకరణాలలో వర్ణితం. దీనిలోని కథలు, సిద్ధాంతాలు పురాణధోరణిలో ఉండడం వల్ల వైదిక ధర్మప్రభావం కనిపిస్తుంది. భాష సలక్షణమైన సంస్కృతం కాదు. విషయాల పునరుక్తి చాల ఉంది. కానీ ఇది పాలీ సంప్రదాయంలోని బుద్ధునికి సంబంధించిన గాథలను యథాతథంగా ఇచ్చింది.

దీని భాషనుబట్టి చూడగా ఇది క్రీస్తుకు పూర్వం 2వ శతాబ్దంలో రచితమైనట్టు తోస్తుంది. తర్వాత కాలక్రమాన విపులీకరించబడినది.

ఇవికాక జాతకమాల, అవదాన శతక, దివ్యావదాన, అవదాన కల్పలత మొదలయినవి సంస్కృత రచనలు.

## మహాయాన సాహిత్యం :

ప్రాచీన పాలీ బౌద్ధ గ్రంథాలలో హీనయాన అనే మాటే కనిపించదు. ఈ పదం ప్రాచీన సంస్కృత బౌద్ధ గ్రంథాలలో కానవస్తుంది. కాని ఈ పదానికి మహాయాన గ్రంథాలలో ఉన్నట్టు అవమానకరమైన అర్థమేదీ లేదు.

పూర్వ గ్రంథాలలో ఈ రెండు శాఖలలో ఒకదానికి బుద్ధయాన, తథాగతయాన, మహాయాన, బోధిసత్త్వయాన అనే పేర్లు కనిపిస్తాయి. రెండవ దానికి శ్రావకయాన, ప్రత్యేక బుద్ధయాన అనే పేర్లు కనిపిస్తాయి.

1. పరిశోధన బుద్ధ జయంతి సంచిక — 1956.



బుద్ధత్వం, తథాగతత్వం పొందడం గొప్పలక్ష్యం. ఈ మహాలక్ష్యంతో సాధన చేసేవారి యానం - మార్గం - మహాయానం-గొప్పయానం అని తదను యాయులు వివరించారు.

అంతకన్నా తక్కువ లక్ష్యంతోనే తృప్తిపడేయానం - మార్గం హీనయానం. అంటే ఈ మార్గానుయాయుల లక్ష్యం పై దానికన్నా తక్కువయింది. అర్హత్ స్థాయి వరకు వెళ్ళేమార్గం హీనయాన మయింది. ఈ రెండు పదాలకు తర్వాత ప్రచారంలోకి వచ్చిన అర్థాలు లేవు. హీనయానం సామాన్య మానవులకు, శ్రావకులకు ఉద్దేశింపబడినది. మహాయానం సాధారణ ప్రజలకన్న మేధావులకు ఉద్దేశించబడినది. అసంగుడు తన సూత్రాలంకార అనే గ్రంథంలో ఈ మాటలకు మరొక అర్థమిచ్చాడు. మహాయానులు ఇతరుల నిర్వాణం తరువాతనే తమ నిర్వాణం కోరుతారని, శ్రావకయానులు లేక ప్రత్యేక బుద్ధయానులు మొదట తమ నిర్వాణం కోరుకునేవారని అసంగుడు వ్యాఖ్యానించాడు.[1]

ఈ రెండు యానాలకు సంబంధించి మహాయానులు చెప్పే తాత్త్వికమయిన వివరణ ఇది: సత్యదర్శనానికి రెండు ఆవరణలు (Covers of Impurities) - క్లేశావరణం, జ్ఞేయావరణం అనేవి ఉన్నాయి. క్లేశావరణాన్ని నైతిక జీవితంతోను, వివిధ ధ్యానాదులతోను తొలగించుకొనవచ్చు. హీనయానులు తమ నైతిక పద్ధతులలో ఈ క్లేశావరణాన్ని తొలగించుకుని అర్హతులు అవుతున్నారు. కాని జ్ఞేయావరణాన్ని తొలగించుకోజాలరు. కనుక వారు పుద్గలశూన్యతను - వ్యక్తిత్వ శూన్యతను దర్శించుకొనగలరు గాని ధర్మశూన్యతను, ప్రాపంచిక శూన్యతను అనుభూతి పొందలేదు. మహాయానులు ఈ రెండు క్లేశాలు తొలగించుకొని బుద్ధులు అవుతారు. అందువల్లనే తమయానానికి - మార్గానికి మహాయానమని పేరు అన్నారు.

## లలిత విస్తరం :

మహాయాన బౌద్ధ సాహిత్యానికి లలిత విస్తరాన్ని ఒక విధంగా మార్గదర్శక మనవచ్చు. బుద్ధుని నిర్యాణానంతరం మూడు శతాబ్దాలకే ఆయా ప్రాంతీయ భాషలలో బౌద్ధప్రచారం సాగింది. సంస్కృతంలోను సాగింది. వైదికుల వాదాలను, అవతార సిద్ధాంతాలను, స్వర్గాది పరలోకాలను ఎదుర్కొనడానికి ప్రయత్నాలు జరిగాయి. వాటి ఫలితమే లలిత విస్తరం. దీనిని లలిత విస్తర మహాపురాణమనికూడ అన్నారు.

1. Cultural Heritage of India Vol. I PP 503.

లలిత విస్తరం క్రీస్తుకు పూర్వం 3 వ శతాబ్దంలో అశోకుని కాలంలో రూపొందినట్లు విమర్శకులు చెబుతున్నారు. బుద్ధుని అవతార పురుషునిగా రూపొందించింది ఈ గ్రంథం. దీనిలో 27 పరివర్తనాలు ఉన్నాయి. పరివర్తన మంటే భాగం. బుద్ధుని జన్మకారణం మొదలు ధర్మచక్ర ప్రవర్తనం వరకు గల చరిత్రను ఇది తెలిపింది పూర్తిగా పరమాత్ముడైన బుద్ధుని ఈ చరిత్రలో అప్పటి సాంఘిక పరిస్థితులు, ఆచార వ్యవహారాలు మొదలయినవి కూడ దొర్లు కొని వచ్చాయి.

లలిత విస్తరం నిజానికి హీనయానంలో ఒక శాఖ అయిన సర్వాస్తి వాదులది. కాని తర్వాత దానిని మహాయానులు తమ సంప్రదాయానికి అను గుణంగా దిద్దుకున్నారు.

ఒక విధంగా బౌద్ధ శాఖలలోని మహాసాంఘికులు అనే శాఖె మహాయాన శాఖా సిద్ధాంతానికి మూలం. మహాసాంఘికుల ఆవాసం నాగార్జునకొండ, ఆసిద్ధాం తాలు ఆధారంగా నాగార్జునుడు మహాయాన సిద్ధాంతాన్ని రూపొందించాడు. అపారమైన సాహిత్యాన్ని సృష్టించి, బుద్ధుని అవతారమూర్తిగా చేసి, నూతన మతాన్ని దేశమంతటా ప్రచారం చేశాడు.

## నాగార్జునాచార్యుడు :

నాగార్జునుని జన్మ గురించి పెక్కు వాదాలు ఉన్నాయి. ఇతడు విదర్భలో జన్మించాడని కొందరన్నారు. గుంటూరు జిల్లాలోని పల్నాడు తాలూకాలోని వేదల అనే గ్రామంలో జన్మించాడని టిబెట్ చరిత్ర చెబుతున్నది. ఇతడు క్రీస్తు పూర్వం మొదటి శతాబ్దంలో (25) పుట్టి క్రీస్తు శకం మొదటి శతాబ్దంలో జీవించాడు. ఇతడు బ్రాహ్మణ వంశంలో జనించాడు. సింహభద్రుదనే గురువు వద్ద ఎనమిదవ ఏటనే సర్వాస్తివాదమనే బౌద్ధమతశాఖా గ్రంథాలు పఠిం చాడు. పిదవ శ్రావకుడుగా మారి, శ్రీ ప్రజ్ఞాకరుడనే పేరు పొందాడు. బౌద్ధా చార్యుడయిన పిదప నాగార్జునుడని విఖ్యాతి చెందాడు. నాగార్జున శిష్యుడైన శాతవాహన చక్రవర్తి దక్షిణ కోసలంలో ఇతని కొక విహారం కట్టించాడు. ఇతడు శ్రీపర్వతం – నాగార్జునకొండలోను నివసించాడు. ఇతడు గౌతమి పుత్ర శాతకర్ణి (క్రీస్తుశకం 71–95) కాలం వరకు జీవించాడు. నూతన మతం – శూన్యమతం స్థాపించి దాని వివరణకు పెక్కు గ్రంథాలు రచిం చాడు.

ప్రజ్ఞా పారమిత సూత్ర, శతసాహస్రిక, సద్ధర్మ పుండరీక, అవతంసక సూత్ర, గండవ్యూహ, అక్షయమతి నిర్దేశ సూత్ర, మాధ్యమిక కారిక,



విగ్రహ వ్యావర్తని, ఉపాయ హృదయ, ప్రమాణ విశేటన, అకుతోభయం, మధ్యాంతానుగమశాస్త్ర, దశభూమి విభాషాశాస్త్ర మొదలయినవి నాగార్జునుని గ్రంథాలు.

వీటిలో మాధ్యమిక కారిక 27 అధ్యాయాల గ్రంథం. దీనిలో నాగార్జునుని నూతన మతం వివరింపబడినది. బుద్ధుని అనాత్మసిద్ధాంతానికి ఇతడు శూన్య దర్శనమని పేరు పెట్టాడు. శూన్యతాజ్ఞానం లభించినవారికి సర్వవిషయాలు కరతలామలకం. మాధ్యమిక కారికలోని ప్రథమాధ్యాయం ప్రత్యయ పరీక్ష. దానిలోని ఒక కారిక (శ్లోకం) ఉదాహరిస్తాను.

భావానాం నిస్స్వభావానాం
న సత్తా విద్యతే యతః,
సతీద మస్మిన్ భవ తీ
త్యే తన్నైవోపపద్యతే.

నాగార్జునుడు అవసంతక సూత్రంలో బోధిసత్త్వ సమంత భద్రుని సృష్టించాడు. సద్ధర్మ పుండరీకం భక్తిమార్గానికి మార్గదర్శకమైంది.

కొంతకాలానికి పాలీ భాష కూడ గ్రాంథిక భాష అయింది. నాగార్జునుడు పాలీని వదలి సంస్కృత భాషలోనే తన గ్రంథాలు రచించాడు. అప్పటి సంస్కృత పండితులను ఆకర్షించడం కూడ అతని ఉద్దేశం కావచ్చు. మహాయానవాదులు పిటకాలను కూడ సంస్కృతీకరించారు. దీనివల్ల ప్రాకృతా లకు ఆదరణ తగ్గింది.

నాగార్జుని గ్రంథాలు దాదాపు అతని కాలంలోను, అతని అనంతరం క్రీస్తు శకం (2, 3) శతాబ్దాలలోను చైనా, టిబెట్ భాషలలో అనువదితా లయ్యాయి. తన సిద్ధాంతాలపై వాత్స్యాయనుడు మొదలయినవారు చేసిన విమర్శలకు నాగార్జునుడే విగ్రహవ్యావర్తనిలో సమాధానం చెప్పాడు. బహుశా ఇదే అతని చివరి గ్రంథం కావచ్చు. దీనికి అతడే స్వోపజ్ఞవృత్తి అనే వ్యాఖ్య వ్రాశాడు. నాగార్జునుని మాధ్యమిక కారికలలోని కారికలు తర్వాతి శాస్త్రకారు లందరికి ఒరవడి అయాయి. నాగార్జునుని గ్రంథాలలోని తర్కమే చాలా వరకు గౌడపాద, శంకర, శ్రీహర్ష, చిత్సుఖ, మధుసూదనులు స్వీకరించారు.

నాగార్జునుని గ్రంథాలపై తర్వాతి వారు పలువురు వ్యాఖ్యలు రచించారు అతని శిష్యులు, ఇతరులు. వారిలో మొదటివాడు ఆర్యదేవుడు.

## అశ్వఘోషుడు :

ఇతడు క్రీస్తుకు ఒకటవ శతాబ్దంలో ఉన్నవాడు. మహాయాన

శ్రద్ధోత్పాదనం అనే గొప్ప దర్శన గ్రంథం రచించాడు. ఇతని మరొక ధర్మగ్రంథం పరమార్థబోధిచిత్త భావన.

## ఆర్యదేవుడు:

ఇతడు క్రీస్తుపూర్వం 20 సంవత్సరం నుంచి క్రీస్తుశకం 100 వరకు ఉన్నవాడు. బౌద్ధధర్మ ప్రవర్తకులలో పద్నాలుగవ వాడయిన శ్రీఫలుడు ఇతని తండ్రి. ఆర్యదేవునికి దేవుడు, స్థవిరదేవుడు, కాణదేవుడు అనే పేర్లు ఉన్నాయి. ఇతడు ఎక్కడ జన్మించాడో స్పష్టంగా తెలియదు. బౌద్ధ గ్రంథాలలో ఇతని జన్మస్థలం సింగల అని ఉంది. ఇతడు ధాన్యకటక సమీపంవాడని, గుంటూరువాడని, బందరు సమీపంలోని సింగలమే ఇతని జన్మస్థలమని వివిధ మతాలున్నాయి. ఇతడు ధర్మప్రచారంకోసం సింహళానికి వెళ్ళినాడని చెప్పవచ్చు.

ఇతడు ఆచార్యనాగార్జునుని శిష్యుడు. ఆర్యదేవుడు నాగార్జునుని శిష్యుడని కుమారజీవుడు, చైనా దార్శనికుడు యువాన్‌చ్వాంగ్ చెప్పారు. ఇతడు నాగార్జునుని వద్ద మాధ్యమిక సిద్ధాంతం అధ్యయనం చేస్తున్న కాలంలో నలందా విశ్వవిద్యాలయాలలో ఉన్న పండితులను జయించడానికి వైదిక దార్శనికులు బయలుదేరారు. నలందా పండితులు వైదికులను అరికట్టడానికి రమ్మని నాగార్జునుని వేడినారు. అపుడు ఆర్యదేవుడు తాను వైదికులను వాదంలో జయించడానికి వెళ్ళుతాననగా, నాగార్జునుడు తన శిష్యుని సత్తాను తెలుసుకొనడానికి అతనితో వాదించాడట. ఆ వాదనలో ఆర్యదేవుడు అసమాన ప్రతిభ చూపడంవల్ల నాగార్జుడు మెచ్చి అతనిని నలందాకు పంపాడు. ఆర్యదేవుడు అక్కడ విజయం సాధించి, మాధ్యమిక సిద్ధాంతాన్ని స్థాపించాడు.

ఇతని బోధిసత్వ యోగాచార చతుశ్శతకం,శతశాస్త్రం, భ్రమప్రమంథాన హేతుసిద్ధి, హస్తబలం (నాగార్జునుని మాధ్యమిక కారికా వ్యాఖ్య) - ఇవన్నీ పాలీ భాషలో ఉన్నవి. యోగాచార చతుశ్శతకంలోని చివరి తొమ్మిది అధ్యాయాలూ సంస్కృతీకరించబడినాయి.

జగత్తులో భాసించే వస్తువులన్నీ స్వభావ శూన్యాలని, ప్రత్యక్షాది ప్రమాణాలకు స్వతః ప్రామాణ్యంగాని, పరతః ప్రామాణ్యంగాని కుదరజాలదని ప్రవచించే న్యాయ వైశేషిక సాంఖ్య దర్శనాలను శతశ్శాస్త్రం తీవ్రంగా విమర్శిస్తుంది. వైదిక దర్శనాలలోగల మోక్షవాదం, హీనయానుల నిర్వాణం సరైనవి కావని భ్రమప్రమంథాన హేతుసిద్ధి వివరిస్తుంది.[1]

1. తెలుగుభాషా సమితి విజ్ఞాన సర్వస్వం 4 వ సం - పుట 925-6.



ఆర్యదేవునికి మాతృచేట, రాహులభద్రులనే వారు శిష్యులు. అశ్వఘోషుడు కూడ ఇతని శిష్యుడని కొందరన్నారు.

ఆర్యదేవుడు తెలుగువాడనే నేడు నమ్ముతున్నాను. తెలుగునాట అయ్యదేవరవారనే ఇంటిపేరు గల బ్రాహ్మణశాఖ ఉంది. బౌద్ధులు పలువురు బౌద్ధమత పతనానంతరం మరల వైదికమతం స్వీకరించారు. వీరు మతం స్వీకరించినా ఇంటిపేర్లు మారలేదు. అలాటి పేర్లలో అయ్యదేవర, సర్వదేవరభట్ల మున్నగునవి కొన్ని.

## బుద్ధపాలితుడు:

నాగార్జునుని మధ్యమకారికలపై వ్యాఖ్య రచించిన రెండవవాడు బుద్ధపాలితుడు. ఇతని గురువు సంఘరక్షితుడు. ఇతడు దంతపుర విహారంలో అధ్యాపకుడుగా ఉన్నాడు. రెండవవాడు భావవివేకుడు.

## భావ వివేకుడు:

భావవివేకుడు బహుశాస్త్ర పండితుడు. ఇతని మతంలో కపిల నాగార్జున మతాలు మేళనం పొందాయి.

ఇతడు కృష్ణాజిల్లా అవనిగడ్డ తాలూకా భావదేవరపల్లిలో జన్మించినట్లు పండితులు చెబుతారు. భావవివేకునికి భావదేవుడనే వ్యవహారమూ ఉంది గనుక, భావదేవరపల్లె అతని జన్మస్థానమో, బహుకాల నివాసస్థానమో కావచ్చును ఇతడు నాగార్జునుని మాధ్యమిక కారికలపై గొప్ప వ్యాఖ్య రచించాడు.

## చంద్రకీర్తి :

బుద్ధ పాలితుని ప్రథమశిష్యుడు. ఇతడు మూలక దేశంలోని సమతల నగరవాసి. నాగార్జునుని మాధ్యమిక కారికలకు వృత్తి అనే పేరుతో వ్యాఖ్యానం వ్రాశాడు. ఇతడు క్రీస్తుశకం రెండవ శతాబ్దంలో ఉన్నవాడు.

## వసుబంధువు :

బౌద్ధ దార్శనికులలో వసుబంధువు స్థానం అత్యుత్తమమైనది. కొన్ని విషయాలలో ఇతడు తన అగ్రజుడైన అసంగునికన్న మించిపోయాడు. క్రీస్తుశకం నాల్గవశతాబ్దంలో గాంధారదేశ రాజధాని అయిన పురుషపురంలో (పెషావర్‌లో) జన్మించాడు.

ఇతడు త్రిపిటకసారాన్ని అభిధర్మకోశ అనే పేరుతో రచించాడు. దీనికి భాష్యం కూడ తనే వ్రాశాడు. ఇది తర్వాతి వారికి మార్గదర్శకమైనది.

నేటికి కూడ అభిధమ్మకోశం జపాన్, చైనా, టిబెట్టు, మంగోలియాలలో పాఠ్య గ్రంథం. థేరవాదబౌద్ధులు కూడ దీనిలోని వాక్యాలను ప్రమాణంగా తీసుకోడంవల్ల ఇది చాలా వ్యాప్తి చెందినది. ఇతడు వైభాషిక, యోగాచార సంప్రదాయాలను గురించిన అనేక గ్రంథాలు వ్రాశాడు. అభిధర్మకోశం భాష్యంలో ఇతడు తన స్వతంత్ర భావాలను ప్రకటించాడు.

విజ్ఞాన వాదాన్ని గురించి "విజ్ఞప్తి మాత్రతాసిద్ధి" అనే పేర కారికాత్రింశతిని, కారికావింశతిని రచించాడు. విజ్ఞానవాద గ్రంథాలలో ఇది అత్యుత్తమమైంది. ఇది చీనాభాషలోకి అనూదితమైంది.

భారతీయ గ్రంథాలను చీనాభాషలోకి అనువదించి కీర్తి పొందిన కుమారజీవుడు (క్రీ.శ. 402) వసుబంధుని చరిత్ర రచించాడు. కాని అది నశించింది. చైనా అనువాదంలో పేరు పొందిన మరొక రచయిత పరమార్థుడు, ఇతని జీవిత చరిత్ర రచించాడు. ఇది చీనా సారస్వతంలో నిలిచి ఉంది.

వసుబంధుడు చంద్రగుప్త విక్రమాదిత్యుని కాలంలో (375-435) అయోధ్యలో బుద్ధమిత్రుడనే ఆచార్యుని వద్ద విద్యాభ్యాసం చేశాడు. అపుడు అయోధ్య రాణి, రాజకుమారుడు ఇతని శిష్యులయారు. తర్వాత అసంగుని పిలుపుపై గాంధారానికి వెళ్ళి 61వ ఏట స్వస్థానంలో నిర్యాణం చెందాడు.

## దిఙ్నాగాచార్యుడు:

ఇతడు గొప్ప తర్క విద్వాంసుడు. క్రీస్తుశకం 480-569 లలో ఉన్నవాడు. బౌద్ధమతలలో తర్కశాస్త్ర రచనలను ప్రవేశపెట్టిన వారిలో ప్రథముడు. ఇతనికి భదంతధీరనాగుడని కూడ వ్యవహారం. ఇతడు కాళిదాస మహాకవికి సమకాలిడని ప్రతీతి. మేఘసందేశంలో దిఙ్నాగుని ప్రస్తావన ఉంది.

దిఙ్నాగుని జన్మస్థానం కాంచీనగర సమీపంలోని సింహవక్త్ర నగరమని కొందరన్నారు. అదేదో తెలియలేదు. ఇది తమిళ పేరయిన సింగవాయి అనే దానికి అనువాదమేమో! నేటి నెల్లూరుకి విక్రమసింహపురమని పేరుంది. బహుశా ఈ విక్రమ సింహపురమే ఆనాటి సింహవక్త్రపురమేమో! ఇతడు చాలకాలం ఆంధ్రదేశంలో గడిపాడని, మహామహోపాధ్యాయ సతీష్‌చంద్ర విద్యాభూషణ్ "హిస్టరీ ఆఫ్ ది ఇండియన్ లాజిక్" అనే గ్రంథంలో వ్రాశారు. ఇతని జన్మస్థలమేదైనా, ఇతడు ఆంధ్రదేశంలోని వేగి ప్రాంతంలోని విహారంలో నివసించినట్లు టిబెట్ గాథలు తెలుపుతున్నాయి. కనుక దిఙ్నాగుడాంధ్రుడే అని భావించవచ్చును.



దిఙ్నాగుడు బ్రాహ్మవంశంలో జన్మించాడు. వాత్సీపుత్రీయ బౌద్ధ సంప్రదాయానికి చెందిన నాగదత్తుడనే భిక్షువు వద్ద శిష్యుడై హీనయాన బౌద్ధం స్వీకరించాడు. పిదప పుద్గల సిద్ధాంతం విషయమై, నిర్వాణంలో అనువృత్తమయ్యే వస్తువు విషయమై గురువుగారితో కలిగిన భేదాభిప్రాయంతో ఉత్తరాపథం వెళ్ళి ఆచార్య సుబంధుని శిష్యుడై హీనయాన, మహాయానాలను కూలంకషంగా అధ్యయనం చేశాడు. నలందాకు వెళ్ళి అచట దుర్జయుడు మున్నగు బ్రాహ్మణ పండితులను వాదంలో జయించి బౌద్ధాధిక్యం స్థాపించాడు. పిదప దేశమంతటా తిరిగి శాస్త్రార్థాలలో ఇతర పండితులను జయిస్తూ గొప్ప వాద కోలాహలుడుగా, మహా తార్కికుడుగా పేరు పొందాడు.

ఇతని ప్రధాన రచనలు ప్రమాణ సముచ్చయం, ప్రమాణ సముచ్చయ వృత్తి, న్యాయముఖం, హేతుచక్ర డమరుకం, ఆలంబన పరీక్ష, ఆలంబన పరీక్షావృత్తి, త్రికాల పరీక్ష, న్యాయావయవం – ఇవన్నీ తర్క గ్రంథాలు, సంస్కృత భాషా రచనలు. ఇతని కుందమాల నాటకం చాల గొప్పది. దీనిని సుగ్రహీత నామధేయులు మానవల్లి రామకృష్ణ కవిగారు తొలిసారిగా చక్కని పీఠికతో ప్రచురించారు.

ఇతడు అక్షపాద కణాదాది తర్కశాస్త్ర పండితులు అవలంబించిన పంచావయవ వాక్యాన్ని మూడవయవాలకు కుదించి, ఉపమాన శబ్దాలకు ప్రామాణ్యాన్ని నిరాకరించి, ప్రత్యక్షానుమానాలను మాత్రమే స్వీకరించి, వాటికి నూతన లక్షణాలు నిర్వచించాడు.

ప్రమాణశాస్త్ర ప్రవేశం, న్యాయముఖం, అభిధర్మకోశ వ్యాఖ్యానం ఇతర రచనలు. ప్రమాణ సముచ్చయాన్ని వేంగి సమీపంలోని కొండగుహలో ఏకాంతంగా వసిస్తూ రచించాడట.

ఇతనిది మహిషపురమనే వాదం కూడ వుంది. మన రాజధాని శివారులోని కొండాపురంలో ఇటీవల జరిగిన త్రవ్వకాలవల్ల మహిష రాజవంశానికి చెందిన 4000 నాణేలు దొరికాయి. కనుక ఆ మహిషపురం కొండాపురం కావచ్చు; ఇతడు కొండాపురంవాడు కావచ్చు. దిఙ్నాగుడు తెలుగు వాడవడానికి మరొక నిదర్శనం వేంగీ సమీపంలోని కొండగుహలో ఏకాంతవాసం చేస్తూ, ప్రమాణ సముచ్చయాన్ని రచించడం. దీనిలో ప్రత్యక్షం, స్వార్థానువాదం, పరార్థానువాదం, త్రిరూప హేతువు, ఉపమాన శబ్దప్రమాణాల ఖండనం, న్యాయావయవాలు-అని ఆరధ్యాయాలున్నాయి.

దిజ్ఞాగుని తర్కం ప్రకారం సత్తకు ప్రయోజనం అనగా క్రియను పుట్టించడం – అర్థక్రియాకారిత్వం. బాహ్య వస్తువులు సత్యాలుకావు. శాశ్వత వస్తువు క్రియతో సంబంధంలేని అధిక ర్తది. ఇతడు యోగాచార సిద్ధాంతాన్ని, జ్ఞానసిద్ధాంతాన్ని కలిపాడు.

## అసంగుడు :

నాగార్జునుని తర్వాత అసంగుడు గొప్ప బౌద్ధ దార్శనికుడు. ఇతని అద్వైత విజ్ఞాన వాదాన్ని కాశ్మీర శైవులు, శంకరాచార్యులు తమతమ సిద్ధాంత కల్పనలకు స్వీకరించారు. శంకరుల పరమ గురువు అయిన గౌడ పాదాచార్యులు తమ మాండూక్య కారికలలో అలాతశాంతి ప్రకరణంలో బౌద్ధ దర్శన పరిభాషను, పరికల్పనలను విరివిగా వాడాను. పలుచోట్ల బుద్ధుని పేరును, మహాయానమనే పేరును గ్రహించారు.

అసంగుడు క్రీస్తుశకం నాల్గవ శతాబ్దిలో గాంధారదేశ రాజధాని అయిన పురుషపురంలో (పెషావర్‌లో) కౌశిక గోత్ర బ్రాహ్మణ వంశంలో జన్మించాడు. ఇతని తమ్ములు వసుబంధుడు, విరించి. వసుబంధుడు కూడ గొప్ప బౌద్ధ దార్శనికుడుగా పేరు పొందాడు. పురుషపురం మొదట సర్వాస్తివాద, వైభాషిక సంప్రదాయాలకు పెట్టనికోట. కాని అసంగుడు దానిని మహాయాన విజ్ఞాన కేంద్రంగా చేశాడు.

ఇతడు 31 గ్రంథాలు రచించాడు. వీటి చైనా, టిబెట్టు భాషల అనువాదాలు సురక్షితంగా ఉన్నాయి. వీటిలో అతి ముఖ్యమైనవి యోగాచార భూమి అనే గ్రంథం.

## ధర్మకీర్తి :

ధర్మకీర్తి బౌద్ధమత పరిధిలోనేకాక యావద్భారతదేశ దార్శనికుడుగాను ప్రసిద్ధి పొందినట్టివాడు. నేటికికూడ ఇతని గ్రంథాలు నిత్యనూతనంగా కనిపిస్తాయి. పాశ్చాత్యులు ఇతనికి భారతదేశపు క్యాంట్ అని ప్రశంసించారు.

ధర్మకీర్తి క్రీస్తుశకం 600 ప్రాంతంలో ఉన్నట్టు ఆధారాలున్నాయి. ఇతడు తిరుమలలో జన్మించాడు. బ్రాహ్మణుడు కావడంవల్ల వేద వేదాంగాలను అభ్యసించాడు. పిదప నాడు ప్రచారంలో ఉన్న బౌద్ధ దర్శనంపట్ల ఇతనికి ఆసక్తి కలిగింది. నలందాకు వెళ్ళి అక్కడ ధర్మపాలుని వద్ద బౌద్ధ దర్శనాలు అధ్యయనం చేశాడు భిక్షువయ్యాడు. దిజ్ఞాగుని తర్కం, బౌద్ధ విజ్ఞానవాదం ఇతని సిద్ధాంతాన్ని రూపొందించాయి.



ఇతడు కేవలం ప్రమాణ సంబంధ బౌద్ధ దర్శనాలను గురించి, ప్రమాణశాస్త్రం గురించి గ్రంథాలు రచించాడు. ఇతనివి మొత్తం తొమ్మిది గ్రంథాలు. వీటిలో రెండు తన గ్రంథాలకు తానే వ్రాసుకొన్న టీకలు. అవి ఇవి : ప్రమాణ వార్తికం, ప్రమాణ వినిశ్చయం, న్యాయ బిందు, హేతుబిందు, సంబంధ పరీక్ష, వాదన్యాయం, సంవాదాంతర సిద్ధి, ప్రమాణ వార్తికటీక, సంబంధ పరీక్షా టీక. ఇతని గ్రంథాలపై మహా విద్వాంసులెందరో టీకలు వ్రాశారు.

ధర్మకీర్తి తన గ్రంథాలలో ఎక్కువగా ప్రమాణాలను గూర్చే చర్చించాడు. కార్యకారణ సంబంధం గురించి, క్షణిక వాద విజ్ఞాన వాదాలను గురించి కూడా చర్చించాడు.

## ధర్మోత్తరుడు :

ఇతడు ధర్మకీర్తి రచించిన న్యాయబిందుకు న్యాయబిందుటీక అనే పేర టీక వ్రాశాడు. ధర్మోత్తర వృత్తి, లఘు ధర్మోత్తర సూత్ర అనే గ్రంథాలు రచించాడు. పద్దెనిమిది బౌద్ధ శాఖలకు సంబంధించిన 'సమాజ భేద ప్రచ్ఛన్న చక్ర' అనేది ఈయన గొప్ప గ్రంథం.

## యోగాచార సాహిత్యం :

అసంగుని ద్వారా మహాయాన శాఖలో యోగాచార శాఖ చిగిర్చింది; క్రమంగా వజ్రయానానికి దారితీసింది. యోగాచార శాఖలో అసంగసుబంధులు కాక జినదేవుడు మొదలయినవారు గ్రంథాలు రచించారు. మైత్రేయుడు యోగాచార భూమిశాస్త్రం, అలంబన ప్రత్యయ ధ్యాన శాస్త్రం అనే గ్రంథాలు రచించారు.

మైత్రేయుడు అభిసమయాలంకార అనే గ్రంథం రచించాడు. విజ్ఞానాతిరిక్తంగా ఏ సత్తాలేదు, విజ్ఞానమే సత్యం-అనేది ఇతని సిద్ధాంతం.

భారతదేశమంతటా మాధ్యమిక వాదం వ్యాపించి, సంస్కృత రచనలు అపారంగా వెలువడినా, శ్రీలంకలో మాత్రం పాలీలోనే రచనలు సాగాయి. దానికి కారణం శ్రీలంక భాష సింహళీ ప్రాకృత భాష కావడమే.

## అనిబద్ధ సాహిత్యం :

ఒకవైపు ప్రాకృతంలోను, సంస్కృతంలోను మత సాహిత్యం. ధర్మ సాహిత్యం విస్తరిస్తున్నా, ఏ మతానికి, ధర్మానికి కట్టుబడని సాహిత్యం, కేవలం

కావ్య సౌందర్య దృష్టిలో రచితమైన సాహిత్యం కూడ వెలువడడం జరుగకపోలేదు.

## అశ్వఘోషుడు :

ఇతడు మహాయానానుయాయి అయిన బౌద్ధుడే అయినా, బౌద్ధ దర్శన గ్రంథాలు రచించినా కావ్యదృష్టితో రెండు మహాకావ్యాలు రచించాడు. అవి బుద్ధ చరితం, సౌందరనందనం అనేవి. ఇతడొక నాటకం కూడ రచించాడు. దీని లిఖిత ప్రతులు మధ్య ఆసియాలో లభించాయి. ఇతని నాటకం పేరు సారిపుత్ర-ప్రకరణం. ఇది తొమ్మిదంకాల నాటకం. భారతీయ సాహిత్యంలో తొలి నాటకం.

ఇతడు సాకేతవాసి. క్రీస్తుకు ముందు మొదటి శతాబ్దంలో ఉన్నవాడు. బుద్ధ చరితంలో బుద్ధుని జననం మొదలు వారణాసిలో ఉపదేశించే వరకు 13 సర్గలు ఇతడు రచించాడు. కాని 5వ శతాబ్దంలో చైనా, టిబెట్ భాషలలోకి అనువదింపబడిన బుద్ధచరితంలో 25 సర్గలు-బుద్ధుని మహాపరి నిర్వాణం వరకు ఉన్నాయి.

అశ్వఘోషుడు రచించిన మరో కావ్యం సౌందరనందం. ఇది బుద్ధుని సవతి తమ్ముడయిన నందుని, అతని సతీమణి, లోకోత్తర సుందరి సుందరీదేవి ప్రేమ, విరహ, వైరాగ్య గాథ వర్ణితమయినవి.

అశ్వఘోషుడు తన కావ్యాలలో ఉపమా, రూపక, ఉత్ప్రేక్షా, అప్రస్తుత ప్రశంసాది అలంకారాలను వాడాడు. కనుక అప్పటికే ఒక విధమయిన అలంకార శాస్త్రం ఏర్పడిందనవచ్చు. అతి ప్రాచీనమైన ఉద్గతా వృత్తమూ వాడాడు. సౌందరనందం చివర ఇది కావ్యం, మోక్షం కోసం, ఉపశాంతికోసం వ్రాశానని చెప్పుకున్నాడు. కాని ఈ రెండు కావ్యాలలోను ధర్మోపదేశ భాగం తక్కువే. కనుక అనిబద్ధ కావ్యాలుగానే గ్రహించవచ్చును.

ఇతడు తన నాటకాలలో కొన్ని పాత్రలకు ప్రాకృతం వాడాడు.

ఇతని బుద్ధ చరితం అరబ్బీలో కొంత మార్పులో వెయ్యేళ్ళ క్రితమే అనువదింపబడినది.

## సుహృల్లేఖ, రత్నావళి :

నాగార్జునుడు శాతవాహన రాజుకు మిత్రుడు. అతడు తనకు పరమాప్తుడైన గౌతమీపుత్ర యజ్ఞశ్రీ పేరున ఒక లేఖ వ్రాశాడు. దీనిపేరు సుహృల్లేఖ. ఇది చీనా, టిబెట్టు భాషలలో అనువదింపబడినది. కాని మూలం లుప్తమైనది.



దీనిలో నాగార్జునుడు తన మిత్రునికి ప్రజలందరి యెడల నిష్పక్షపాతంతో ప్రవర్తించాలని ఉపదేశించాడు.

రత్నావళిలో రాజుకు చేసిన ధర్మోపదేశం ఉంది. బౌద్ధమత విరోధులు కొందరు చేరి రాజును ధర్మమార్గం నుండి విడదీస్తారని, అట్టి ముఖ స్తుతులకు లొంగరాదని, ధర్మ పరిజ్ఞానం లేకపోవడం దుర్గతికి హేతువని, హితం చెప్పే వారు కొద్దిమంది మాత్రమేనని పరి పరి విధాల బోధన దీనిలో ఉంది. కాని గౌతమీ పుత్ర శాతకర్ణి తన తల్లి రాజశ్రీ ఆజ్ఞమేరకు నాగార్జునుని మాటవినక వైదిక మతాన్ని ఉద్ధరించాడని చరిత్ర.

## బృహత్కథ:

బృహత్కథ పైశాచీభాషలో రచితమైన గొప్ప ఇతిహాసం. రామాయణ భారతాలకు దీటయినదని పలువురు పొగిడారు. కాని, ఇది లభించలేదు. దీని సంస్కృతానువాదాలు చాలా వచ్చాయి. ఇది పెంరుగదై అనే తమిళ పదానికి సంస్కృతీకరణమేమోనని శ్రీ వేదం వెంకట రామశాస్త్రి (ఎం.ఎ.)గారి అభిప్రాయం.

## గాథాసప్తశతి :

ఏ మతానికీ, ధర్మానికీ సంబంధంలేని కవిత్వపుముద్ద గాథాసప్తశతి. ఇది ప్రాకృత ముక్తకాల (దాటువుల) సంకలనం. దీనిని క్రీ.శ. మొదటి శతాబ్దంలో ఉన్న హాలశాతవాహన చక్రవర్తి సంకలనం చేశాడు. ఈకవి దృష్టి రసరాజమయిన శృంగారరసమే అయినా, ఈ శృంగార రసధుని నుంచి తొంగిచూచే సామాన్య మానవుని జీవితం అపారంగా కనిపిస్తుంది. ఇంతటి సామాన్య విషయం, ఇలాటి ఇంటి ముచ్చట్లు కవితాస్థాయికి ఎలా ఎక్కగలిగాయా అని మనం ఆశ్చర్యపడతాము. సామాన్య మానవుడంటే సామాన్య కర్షక గృహస్థు మొదలు రాజసేవకుడు, నాపితుని వరకూ— ప్రజల దైనందిన జీవితం, దారిద్ర్యం, కరువు కాటకాలు, వానలు వరదలు, వానకాలపు బురద వీథులు, ఎండకాలపు మృగతృష్ణలు, దప్పిగొన్న బాటసారులు, చలివెందర చవలాక్షులు, చలికాలపు నెగళ్ళు, నెగళ్ళు గొంగళ్ళు అక్కరలేని నెరజాణల మొగుళ్ళు, వసంతోత్సవాలు, మొయిళ్ళను చూచి నిట్టూర్పు విడిచే ముదితలు, ఫాల్గుణోత్సవాలు— హోలీలు, పెళ్ళిళ్ళు పేరంటాలు, సతులు అసతులు, విధవలు వేశ్యలు, జారులు పూజారులు, వంటలు పంటలు, శిథిల దేవాలయాలు, ప్రశిథిలవలయాలు, నగలూ నాణేలు- ఒక్కటేమిటి గ్రామాలలోని ప్రతిదీ కావ్యవస్తువైంది. ఈ రమణీయ జీవితానికి దిఙ్మాత్రంగా రెండు ఉదాహరణలు:

పాలేహి అచ్ఛభల్లం
వ ఉఅహ కుగ్గామ దేఉలద్దారే,
హేమంతఆల పహిఓ
విజ్ఞాయంతం పలాలగ్గిం. (2.4)

చలికాలం. పల్లెటూరి దేవాలయం ముందు ఒక బాటసారి చలికాచుకో డానికి గడ్డినెగడు వేసుకున్నాడు. గడ్డినెగడు ఎంతసేపు ఉంటుంది? త్వరలో మండి ఆరిపోతుంది. కాని లోపల నిప్పు ఉంటుంది. కనుక నెగడును కర్రతో కెలుకుతున్నాడు బాటసారి. అది ఎలా ఉందంటే, ఎలుగుబంటిని చీలుస్తున్నట్లు ఉందట. కాలిన గడ్డిమంట ఆరిపోగానే నల్లగా పెద్దగా రాశివలె, గుమ్మటం వలె కనిపిస్తుంది. కర్రతో కెలికితే లోపల నిప్పు కణకణలాడుతుంది. కవి దీనిని పొట్ట చీల్చుతున్న ఎలుగుబంటితో పోల్చాడు.

గెహ్ణహ పలోఅహ ఇమం
పహసిఅ వఅణా పఇస్స అప్పేఇ,
జాఆ సుఅ పఢముబ్భిణ్ణ
దంతజుఅలంకిఅం బోరం. (2.100)

ఏ తల్లి అయినా తన పిల్లడు చేసిన చేష్టలు గొప్పగా కనిపిస్తాయి. ఒక పిల్లడికి అప్పుడే పాలపండ్లు వచ్చాయి. ఆ పాలపండ్లతో రేగుపండు కొరికాడు. రేగుపండుపై పడిన రెండుగాట్లూ ఆ పిల్లడి తల్లికి ఏమనిపించాయో! మహా నందంతో భర్తవద్దకు వచ్చింది. ఇదిగో చూడండి. తీసుకోండి దీనిని- అంటూ నవ్వుతూ పిల్లడి పండ్లగాట్లున్న రేగుపండును భర్తకు అందించింది.

ఇలాటి సుందరమైన గ్రామీణ దృశ్యాలు గాథాసప్తశతి నిండా ఉన్నాయి.

చతుర్భాణికూడ అనిబద్ధ సాహిత్యమే.

**సేతుబంధం :**

సేతుబంధ కావ్యాన్ని కాళిదాసు శిష్యుడైన వాకాటరాజు ప్రవరసేనుడు రచించాడు. క్రీ.శ. 5వ శతాబ్దంవాడు. దీనిని దండి మొదలయిన వారు చాల పొగిడారు. హనుమంతుడు సీతనుంచి చూడామణిని తెచ్చి ఇచ్చినప్పటి నుంచి రావణవధానంతరం రాముడు అయోధ్యకు వెళ్ళేవరకు గల కథ దీని ఇతి వృత్తం. భాష ప్రాకృతం.

ఇది రామకథే అయినా కేవలం కావ్యదృష్టితో రచితమైన మహాకావ్యం. వానర సేన ప్రస్థానం, వానరులు సేతువును కట్టడం, యుద్ధ వ్యూహాలు అపూర్వంగా వర్ణించాడు కవి. వంతెన కట్టేటప్పుడు వానరులు కొండలను



గుండ్లను అందుకోడం, గండ్లు పూడ్చడం, బరువు ఎత్తేటప్పటి భంగిమలు మొదలయిన కార్మికుల పనులను వివరించడంలో ప్రవరసేనుడు ప్రవరు డనిపించుకున్నాడు.

**లీలావఈ :**

కోఊహల కవి రచించిన లీలావఈ కావ్యంలో ఇతివృత్తం శాతవాహన సార్వభౌమునికి సింహళ రాజపుత్రి లీలావతియందు కలిగిన ప్రేమగాథ. దీనిలో ఆశ్వాసవిభాగ మేమీలేదు. ఇతడు తన ప్రియురాలి కోర్కెతో ఈ కావ్యం రచించాడు. సింహళద్వీప రాజకన్య ఓడలో బయలుదేరుతుంది తుఫాను తాకిడికి ఓడ కొట్టుకొని సప్తగోదావరి తీరానికి వస్తుంది. అక్కడ ఒక ముని ఆమెను రక్షించడం, శాతవాహనుడు చూడడం- ఇదీకథ. కొన్ని దృశ్యాలు మనోహ తంగా వర్ణితాలు. ఇది 5వ శతాబ్దిదని ఆచార్య డాక్టర్ బి. ఎస్. ఎల్. హనుమంతరావుగారు అంటున్నారు.

**ధూర్తాఖ్యాన :**

ధూర్తాఖ్యానం ప్రాకృత వ్యంగ్య రచన; 8వ శతాబ్దంలో ఉన్న హరిభద్రుడు రచించాడు. నలుగురు పురుషులు, ఒక స్త్రీ-ఐదుగురూ ధూర్తులు- తమ తమ విచిత్రమైన అనుభవాలను చెబుతూ, వాటిని సమర్థించుకొనడానికి పురాణ గాథలను ఉట్టంకిస్తారు. భారతీయ ప్రాచీన సాహిత్యంలో ఇది అపూర్వ మైన వ్యంగ్య రచన.

ఈ సందర్భంలో పల్లవ మహేంద్రవర్మ రచించిన నీతి ద్విషష్టిక అనే సంస్కృత ఆర్యాముక్తక కావ్యాన్ని కూడ అనిబద్ధ సాహిత్యంగా పేర్కొన వచ్చును.

**చరిత్రలు :**

పాలీ సాహిత్యంలోని చరిత్ర గ్రంథాలు అనిబద్ధ సాహిత్యంలోనే చేరుతాయి. దీపవంశ, మహావంశ శ్రీలంకలో వెలసిన గొప్ప పాలీ చరిత్ర గ్రంథాలు. ఇవి పాలీ అట్ట కథలు ఆధారంగా రచించ బడినవి. దీపవంశరచయిత ఎవరో తెలియదు. మహావంశరచయిత క్రీస్తుశకం 5వ శతాబ్దం చివర జీవించిన మహానామా. వీటిలో గౌతమబుద్ధుని జీవితంతోపాటు భారత శ్రీలంకల రాజవంశాల చరిత్ర విపులంగా ఉంది. మొదటి మూడు బౌద్ధసంగీతుల వివరాలు ఉన్నాయి. అశోకుని సంతానమైన మహేంద్ర సంఘ మిత్రలు శ్రీలంకలో జరిపిన బౌద్ధధర్మ ప్రచారచరిత్ర ఉంది.[1]

1. The Cutural History of India - Vol V PP 198

ఇది ధమ్మపదంలో బాల వగ్గోలోని 9 వ గాథ. ఇది కొద్దిగా సంస్కరణం పొందితే ఎలా సంస్కృత మవుతుందో చూస్తే ఆశ్చర్య మవుతుంది.

"తచ్చ కర్మ కృతం సాధు యత్కృత్వా నానుతప్యతే,
యస్య ప్రతీతః సుమనా విపాకం ప్రతిసేవతే."

2. ధమ్మోచ వినయోచ అపిచ యద్ఏవ మయా భగవతో సమ్ముఖా సుతం సమ్ముఖా పటిగ్గహితం తద్ ఏవాహం ధారేస్సామితి. (వినయ పిటకం.)

"ధర్మశ్చ వినయశ్చ అపిచ యదేవ మయా భగవత్ సమ్ముఖాత్ శ్రుతం సమ్ముఖాత్ ప్రతి గ్రహీతం తదేవాహం ధారయిష్యామీతి."

క్రమంగా ఈ పాలీ భాషకు పవిత్రత ఏర్పడింది. బుద్ధుని అనుయాయులు, తర్వాతివారు పాలీ అనే పదాన్ని బుద్ధుని ఉపదేశాలకేకాక, వాటి వ్యాఖ్యానాలకు కూడ వాడినారు. పాలీ అంటే పంక్తి, పద్ధతి, సంప్రదాయం అని వ్యాఖ్యానించారు— పంక్తి పాఠో ఇతిపి పాలీ. అయం హి పాఠో. మూల గ్రంథం, మూల వచనం, బుద్ధుడు చెప్పిన తొలి మూలవిషయం అనే ఖ్యాఖ్యానాలూ బయలుదేరాయి. కాని, పవిత్ర భాష, పవిత్ర గ్రంథం అనే అర్థాలు రూఢమయాయి. సిద్ధాంతం పాతీతి పాలీ – సిద్ధాంతాన్ని రక్షిస్తుంది గనుక పాలీ అని అన్నారు. ప్రాచీనులూ, నవీనులూ కూడ పాలీని మాగధీ ప్రాకృత మన్నారు. కాని బుద్ధుడు పాటలీపుత్ర పరిసర భాషలో తాను సహజంగా ప్రజలతో వ్యవహరిస్తున్న భాషలో ఉపదేశించాడు. అ భాష పాటలీపుత్ర భాష గనుక – పాటలీ పుత్రీ – పాటలీ – పాలీ అయిందని నేను భావిస్తున్నారు.

బుద్ధుడు తననాటి పాలీ భాషలో ఉపదేశించినా, తాను కనుగొన్న నూతన సత్యాన్ని ప్రచారం చేయడానికి ఆయా ప్రాంతాల భాషలను కూడ వాడవచ్చునని శిష్యులకు అనుమతి యిచ్చాడు. అందువలన వివిధ ప్రాంతాల ప్రజల అవసరాన్నిబట్టి ఆయా ప్రాంతాల భాషలలో ప్రచారం చేయడంవల్ల బుద్ధుని ఉపదేశాలు వ్యాప్తి చెందాయి. భారతదేశ వాయవ్య ప్రాంతంవారికి సంస్కృతం ఎక్కువగా పరిచితం కాబట్టి తర్వాత సర్వాస్తి వాదులుగా మారిన బుద్ధానుయాయులు సంస్కృతంలోనే ప్రచారం చేశారు. బౌద్ధ సంఘంలో అత్యధిక సంఖ్యాకులయిన మహాసాఘింకులు భారతదేశ పూర్వప్రాంతాలయిన మగధ అంగప్రాంతాలలో తమ భాష అయిన ప్రాకృత భాషలోనే ప్రచారం చేశారు; అక్కడి వారికి ఆ భాషలు బాగా తెలుసు గనుక. సర్వాస్తి వాదుల్లు

# జినవల్లభుని మహావీరస్వామి స్తోత్రమ్

సిద్ధార్థ గౌతముడు తథాగతుడై[1] ఆర్య సత్యాలను సాక్షాత్కరించుకొని బుద్ధుడయినాడు. వారాణసి సమీపంలోని మృగదావంలో తాను దర్శించిన బోధిని ఇతరులకు చాటినాడు. దీనినే ధర్మచక్ర ప్రవర్తనమని బౌద్ధులన్నారు. ఈ ధర్మచక్ర ప్రవర్తన వార్త దేశం నలుమూలకూ పాకినట్టే ఆంధ్ర ప్రాంతానికీ పాకింది. ఆ బోధిని – ఆర్య సత్యాలను సొంతం చేసుకొనడానికి కొందరు తెలుగువారు బుద్ధుని కడకు బయలుదేరినారు. వారిలో ఒకరిద్దరు చిత్రకారులూ ఉన్నారు. వారంతా పాటలీపుత్ర ప్రాంతంలో విహరిస్తున్న తథాగతుని దర్శించినారు. అతని వాగమృతాన్ని క్రోలినారు; చిత్రకారులు ఆయనను ఆసీనభంగిమలో చిత్రించుకొన్నారు; ఆంధ్రదేశానికి మరలినారు. బుద్ధుని సమకాలీన చిత్రాలతో, ఉపదేశ సంచయంతో ఈ విధంగా తెలుగువారికి బౌద్ధంతో సంబంధం బుద్ధుని సమకాలంలోనే కలిగింది.

బుద్ధుడు తాను సాక్షాత్కరించుకొన్న సత్యాన్ని పాటలీపుత్ర పరిసర భాషలో ఉపదేశించాడు. ఆ భాషను పాలీ అని అన్నారు. పాలీ భాష ప్రాకృతాలలో ఒకటి. ప్రాకృతాలే పరిష్కృతాలై – సంస్కారం పొంది సంస్కృత భాషగా రూపాంతరం చెందాయి. పాలీ, ఇతర ప్రాకృతాలూ సంస్కృతమూ సమానాంతరంగా అభివృద్ధి చెందాయి. మొదటిది సామాన్య ప్రజల భాషగా, రెండవది సంఘంలోని పైవర్గాల భాషగా స్థిరపడ్డాయి. బుద్ధుని ఉద్దేశం ప్రజాసామాన్యాన్ని తన ఉపదేశాలతో ప్రబోధించి జ్ఞావంతులను చేయడమే గనుక అతడు పాటలీపుత్ర పరిసర ప్రాంతాలలోని ప్రజాసామాన్య వ్యవహార భాషలో ఉపదేశాలు చేశాడు.

ఈ పాలీ ప్రాకృత భాష సంస్కృతానికి ఎంత సన్నిహితంగా ఉందో తెలుపడానికి రెండు ఉదాహరణలు ఇస్తాను:

1. "తంచ కమ్మం కతం సాధు యం కత్వా నానుతప్పతి,
యస్స పతీతో సుమనో విపాకం పటిసేవతి."

1. తథాగతుడు సత్యమార్గంలో నడిచినవాడు.

సంస్కృత భాషను ప్రచార సాధనంగా వినియోగించుకోడం ఇతరులనూ ప్రభావితం చేసి ఉంటుంది. దానినే మహాయానులు పూర్తిగా అవలంబించి వృద్ధి పరచారు. క్రమంగా పాలీ మొదలయిన ప్రాకృతాలు వెనుకబడి పోయాయి.[1]

బౌద్ధుల ప్రచార సంస్కృతం ప్రాకృత మిశ్రమమైన సంకర సంస్కృతమనే అనవలసి ఉంటుంది. అప్పుడు పై వర్గాలలో ప్రచారంలో ఉన్న వైదిక–ఔపనిషద – మహాభారతాది సంస్కృతం కన్నా బౌద్ధ జైన సంస్కృతాలు విలక్షణంగా ఉండేవి. బౌద్ధులు తిఙ్ సుబంతాలను అప్పటి సంస్కృత వ్యాకరణాలకు అనుగుణంగా వాడలేదు. ప్రాకృత వ్యవహార రూపాలనుకూడ కలిపి కలగాపులగపు సంస్కృతం వ్యవహరించారు. దీనికి లలిత విస్తరంలో కావలసినన్ని ఉదాహరణలు :

"సురూపరూపా యథ దేవకన్యా
సువిభక్తగాత్రా శుభనిర్మలాంగీ,
న సోస్తి దేవో నచ మానుషో వా
యో మాయ దృష్ట్వాథ లభేత తృప్తి."

ఇది మాయాదేవి వర్ణన. మాయాదేవి దేవకన్యలాగ సురూపరూప, తీర్చిదిద్దిన అంగాలుగలది, శుభకరమైన నిర్మలమైన శరీరం గలది. ఆమెను చూచి తృప్తి పొందని దేవలోకవాసిగాని, మనుష్యుడుగాని ఎవడూ లేడు. ఈ శ్లోకంలోని మొదటిపాదంలో యథ అనేపదానికి సరైన రూపం యథా. ఇది అవ్యయం. వలె అని దీని అర్థం. యథా అని దీర్ఘాంతంగా వాడితే ఛందో భంగం. నాల్గవ పాదంలో మాయాం అని ఉండాలి. మాయాం అని ప్రయోగిస్తే ఛందో భంగం. కనుక మాయ అని విభక్తి రహితంగా ప్రయుక్తమైంది. తృప్తిం అని ఉండాలి. తృప్తి అని విభక్తి రహితంగా ప్రయుక్తం. ఈ సంకర సంస్కృతంలో రచయితలు శబ్దస్వరూపాలను తమ ఇచ్చ వచ్చినట్టు మార్చేవారు, విభక్తులను వివక్ష లేకుండా వాడేవారు.

"యత్ర స్థిత్వా సుమతే
దర్శేష్యసి బోధిసత్త్వ చరితమ్."

దర్శిష్యసికి మారు దర్శేష్యసి అని ప్రయోగించాడు సంకర సంస్కృత కవి.

బుద్ధునికి వరిష్ఠ సమకాలీనుడైన మహావీరుడు కూడ తన సిద్ధాంతాలను ప్రజా వ్యవహారభాషలోనే ప్రచారం చేశాడు. కాని అతని అనుయాయులు

1. The Cutural History of India - Vol I P.P 461.



బౌద్ధులలాగే సంకర సంస్కృతంలోను రచనలు కావించారు. దీనిని వారు సమసంస్కృత ప్రాకృతభాష అన్నారు. జైనుల సంస్కృతం కూడ బౌద్ధ సంస్కృతంలాగే విలక్షణమైంది. సమ సంస్కృతమంటే సంస్కృత ప్రాకృతాలు సమానంగా ప్రయుక్తమైన రచన. జైనతుంగ, సిద్ధసేన, వాదిరాజ, ధనంజయ, భూపాల, దేవనంది, సోమప్రభాచార్య, జంబూగురు, పద్మానంద, జినప్రభసూరి, జినవల్లభసూరి. హేమచంద్రాచార్య, జినప్రభాచార్య, విమలాచార్య, ధనపాల, శోభనమున్యాదులు జైనస్తోత్రాలు రచించారు. వీరిలో కొందరు సమ సంస్కృత ప్రాకృతంలోను స్తోత్రాలు చెప్పారు.[1] వీటిలో మన వివక్ష జినవల్లభసూరి రచించిన మహావీరస్వామి స్తోత్రం.

ఈ జినవల్లభసూరి వేంగీ ప్రాంతం నుంచి వేములవాడకు వలస వచ్చి కన్నడ సామంతుడైన అరికేసరిని ఆశ్రయించిన పంప మహాకవి అనుజుడు. ఇతని గంగాధర శాసనాన్ని బట్టి పంప మహాకవి తెలుగునాటి తూర్పుభాగం నుంచి పడమటి భాగానికి వలస వచ్చాడని నిర్ద్వంద్వంగా డాక్టర్ నేలటూరి వెంకట రమణయ్యగారు నిరూపించడంతో కన్నడ, తెలుగు సాహిత్యాల చరిత్రే మారిపోయింది.[2] ఆ శాసనం కన్నడ, తెలుగు సంస్కృతాలలో ఉంది. సంస్కృతవృత్తాలు, చివరన తెలుగుపద్యాలు ఉన్నాయి. ఇతడు సంస్కృతంలోను కవి గనుక, జైనాచార్యుడు గనుక సంస్కృతంలో మహావీరస్వామిస్తోత్రం మొదలయినవి రచించాడు. ఇతని రచన ఇదొకటే లభించింది. దీనిని తెలుగు విద్వాంసులకు తెలియజేయడం ఈ వ్యాసం ఉద్దేశ్యం.

## మహావీర స్వామి స్తోత్రమ్

భావారివారణ నివారణ దారుణోరు
కణ్ఠీరవం మలయ మందర సారధీరమ్,
వీరం నమామి కలికాల కలఙ్క పఙ్క
సంభార సంహరణ తుఙ్గ తరఙ్గతోయమ్, 1

1. కావ్యమాల, 7వ సంపుటి, పుట 97-101 నిర్ణయ సాగర ప్రెస్, బొంబాయి, 1896.
2. జినవల్లభుని గంగాధర శిలాశాసనము, –పల్లవులు - చాళుక్యులు, పుట 257–283.

బాఢం విసారి గరిమా మహిమా తవేహ
బుద్ధో న దేవగురుణా న పురన్దరేణ,
తం కోఽవగన్తు మఖిలం జడిమాలయోఽహ
మిచ్ఛామి కిన్తు తవ దేవ గుణాణుమేవ. 2

సన్తో గుణా గుణిగురో తవ హాస హంస
నీహార హార ధవలా బహులీభవన్తి,
తే సోమ సూర హరిహర విరిఞ్చి బుద్ధ
మాయావి దేవ నివహేన మలీమసా వా. 3

దేవం భవన్త మవహాయ దురన్తమోహ
సంచ్ఛన్న బుద్ధి మిహిరా ఇహ భూరికాలమ్,
సంసార నీల నిలయే బహు సంసరన్తో
విన్దన్తి జన్తు నివహా నహి సిద్ధభావమ్. 4

యుగ్మమ్ .

సాసూయ సంగమ సురోరు సమూఢ దమ్భ
సంరమ్భ సంతమస సంచయ చణ్డభాసమ్,
హింసా సరోరుహ తమీరమణం చికోడా
హంకార కన్దల దలీకరణాసిదణ్డమ్. 5

వన్దేఽహమిన్దుదలభాల మమన్త భద (ద్ర?)
సందోహ మన్దిరవరం దరకన్దకోలమ్,
గమ్భీర సమ్భవ జరామరణోరు నీర
సంసార సాగర తరీకరణిం చ వీరమ్. 6

విశేషకమ్ :

ఉద్దామ కామభర భఙ్గు రమఙ్గ భఙ్గ
సంసఙ్గ,బన్ధుర మురోరుహ భారభిన్నమ్,
దేహం సలీల పరిరిఞ్జణ మఞ్జు శిఞ్జి
మఞ్జీర చారుచరణం సరసం వహన్తి. 7

సంగేయ తాలలయ చఞ్చ రచార చారీ
సఞ్చారిణీ కరణబన్ధ కలాసు సజ్జా,
ఉన్నాల నీరరుహ కోమల బాహువల్లీ
భల్లీవ విద బహుకామి కురఙ్గసంఘా. 8



హేలావిలోల మణికుణ్డల లీఢగల్లా
కఙ్కేల్లి పల్లవకరా వరకమ్బుకణ్ఠీ,
కేలీలలామరమణీ రమణీయహావా
నాలం నిహన్తు మిహ తే విమలాభిసంధిమ్. 9

సఞ్చారి కిన్నరగణారవ వేణు వీణా
సంరావ భిన్న కలగేయ రవాభిరామా,
ఆకాలభూమి కుగురూహ కుధీ కుదేవ
సంబద్ధ బుద్ధ(ద్ధి?)హరణీ తవదేవవాణీ. 10

సందేహ దావ జలవాహ మజీవ జీవ
భావావభాస తరణిం భవసింధునావమ్,
ఆగామి కేవల రమా తరుణీ వివాహ
దేవాగమం తవ నరా విమలా మహన్తి. 11

దేవా మహాపరిమలం తరలాలి జాల
ఝుంకారహారి తవవీర సభాసు భూరి,
పుల్లారవిన్ద నవ సున్దర సిన్దువార
మన్దార కున్దక వరం కుసుమం కిరన్తి. 12

నిఃసీమభీమ భవ సంభవ రూఢ గూఢ
సంమోహ భూవలయ దారణ సారసీరమ్,
వీరం కువాస మలహారి సువారిపూర
ముత్తుఙ్గ మార కరికేసరిణం నమామి. 13

భిన్దన్త మన్తరణ కారణ మన్తరాయం
సంరుద్ధరోగ సమవాయ మలోభమాయమ్,
ఉచ్ఛిన్న మోహ తిమిరావరణావసాయమ్
వీరం నమామి నవహేమ సమిద్ధకాయమ్. 14

వన్దారు వాసవ సురాసుర భాసురాలం
కారామలచ్ఛవి వరాగ సముద్ధురాణి,
సేవామి తే చరణ వారిరుహాణి భూరి
సందేహ రేణుహరణోరు సమీర వీర. 15

అజ్స్రమి తే చరణతామరసాలి లీలా
సంధాయి పఞ్చను మహాగణధారి వాణీ (?),
సంబన్ధ బుద్ధి కరుణాలయు లిజ్గసిద్ధ
సజ్జావలీ దమిగణం చరణం చర న్తమ్ (?) 16

యుగ్మమ్ :

ఉచ్చణ్డధార కరవాల కరారి వార
విచ్ఛిన్న కుమ్భ గల నాల కరాల నాగే.
కున్తాసితోమర విభిన్న పరాసుదే హే
కజ్కాల సఙ్కుల భయావహ భూమిభాగే. 17

సావేగ హుంకురణ డామర ముణ్డరుణ్డ
కీలాలలాలస విహఙ్గ కులావరుద్ధే,
ఆబద్ధబాణ విసరే సహసా నువన్తో
వీరం నరా రణభరేఽరిబలం జయన్తి. 18

ఆసన్న సిద్ధి కమలా పరిరమ్భరమ్భ
దమ్భోళి పాణిమివ మోహగిరిం కిరన్తమ్,
సంపత్తి కారణ మమఙ్గల మూలకీలం
సేవన్తి కేన భగవన్త మఘం హరన్తమ్. 19

ఆయాస భఙ్గ దమరామయ సంపరాయ
చోరారి మారి విరహేణ చిరాయ దేవ,
భూమణ్డలే సునగరా నిగమా (?) విహార
చారేణ తే పరమ ముద్ధత మామనన్తి. 20

నిఃసఙ్గ నిఃసమర నిఃసమ నిఃసహాయ
నీరాగ నీరమణ నీరస నీరరంస,
హే వీర ధీరిమ నివాస నిరుద్ధ ఘోర
సంసారచార జయ జీవసమూహబన్ధో. 21

ఉల్లాసితార తరలామల హారిహారా
నారీ గణా బహువిలాస రసాలసా మే,
సంసార సంసరణ సంభవభీ నిమిత్తం
చిత్తం హరన్తి భణ కిం కరవాణి దేవ? 22



ఇచ్ఛా మహానలిల కామ గుణాలవాలం
చిన్తాదలం సమల చిత్త మహీసముత్థమ్,
సంభోగ పుల్ల మివ మోహతరుం లసన్తం
హే వీర సిన్ధుర సముద్ధర మే సమూలమ్. 23

సంపన్న సిద్ధిపుర సంగమ మఙ్గలాయ
మాయోరు వారిరుహిణీ వర కుఞ్జరాయ,
వీరాయ తే చరమకేవల పుఙ్గవాయ
కామం నమోఽసముదయాదమసత్తమాయ. 24

హే దేవ కింకర మిమం పరిభావయే హ
మజ్జన్త ముద్ధర జలే భవసిన్ధుపూరే,
ఉత్తారణాయ కురు వీర కరావలమ్బం
భూయోఽసమఞ్జస నిరన్తర చారిణో మే. 25

కుసమయ రుతమాలాభఙ్గ సంహారవాయో
కునయ కువలయాలీ చూరణే (చూర్ణనే) మత్తనాగ,
తవ గుణకణ గుమ్ఫే మే పరీణామ మిత్థం
విమల మపరిహీణం హే మహావీర పాహి. 26

అనయ నిబిడే పీడాగాఢే భయావహదుస్సహే
విరహ విరసే లజ్జాపుఞ్జే రమే భవపఞ్జరే,
నిరయకుహరంగామీ హాహం న సిద్ధి మహాపురీ
సరల సరణిం సేవే మూఢో గిరం తవ వీర హే. 27

నిరీహం గన్తారం పరమభువి మన్తార మఖిలం
నిహన్తారం హేలా కలికలహ....,
భవన్తం నన్తారో నహి ఖలు నిమజ్జన్తి భవభీ
మహాపారావారే మరణభయ కల్లోలకలిలే. 28

ఏవం సేవా పరిహరహయా(?) లోలచూలామణీద్ధ
చ్ఛాయాలీఢం ఖరకిరణభా భిన్నమమ్భోరుహం వా,
చిత్తాగారే చరణకమలం తే చిరం ధారిణో మే
సిద్ధావాసం బహుభవ భయారమ్భరీణాయు దేహి. 29

ఇత్థం తే సమసంస్కృత స్తవ మహం ప్రస్తావయా మాసివా
నాశంసే జినవీర నేన్ద్రిపదవీం న ప్రాజ్యరాజ్యశ్రియమ్,
లీలాభాజ్జి న వల్లభప్రణయినీ బృన్దాని కిం త్వర్థయే
నాథేదం ప్రథయ ప్రసాద విశదాం దృష్టిం దయాలో మయి. 30

ఇతి శ్రీ జినవల్లభసూరి ప్రణీతం సమసంస్కృత
ప్రాకృతం శ్రీ మహావీరస్వామి స్తోత్రమ్.

1. మనోవికారాలనే ఏనుగులను అరికట్టడంలో భయంకర మహా కంఠీరవుడు, మలయ మందర పర్వతాల వలె ధీరుడు. కలికాల పాపపంక సమూహాన్ని తొలగించడంలో ఉవ్వెత్తుగా లేచిన జలతరంగం వంటివాడు అయిన మహావీరుణ్ని నమస్కరిస్తున్నాను.

2. ఓ దేవ! నీ మహిమ ఎంతో గొప్పగా ఈ లోకమంతటా వ్యాపిస్తున్నది. దీనిని దేవగురువయిన బృహస్పతిగాని, దేవరాజయిన పురందరుడుగాని తెలియలేకపోయారు. ఇది నిజం. అలాటి మహిమా గరిమను తెలుసుకొనడానికి జడత్వానికి తావలమైన నేను ఎవర్ని? నీ గుణాలలో అణువైనా అనుగ్రహించుమని మాత్రమే నేను కోరుతున్నాను.

3. గుణవంతులలో శ్రేష్ఠమయినవాడా! నీగుణాలు, నవ్వు, హంస, మంచు, ముత్యాలదండలలాగ తెల్లనివి. అవి ఎప్పటికప్పుడు ఇనుమడిస్తుంటాయి. వాటిని చంద్రుడు, సూర్యుడు, విష్ణువు, శివుడు, బ్రహ్మ, బుద్ధుడు మాయావులయిన దేవతలసమూహం మలినపరుచగలదా?

4. దురంతమైన మోహాంధకారంతో కప్పపడిపోయిన బుద్ధి అనే సూర్యుడు గలవారై బహుకాలం సంసార సాగరంలో కొట్టుకొంటున్న జీవ రాసులకు నిన్ను వదలితే సిద్ధిభావం — మోక్షం లభించదు.

5. యుగ్మమ్ — అసూయా సంబంధం పెచ్చుపెరిగిన దేవతల ముదిరిపోయిన గర్వసంరంభమనే పెనుచీకటికి చండభానుని వంటివాడు, హింస అనే కమలానికి శత్రువయన చంద్రుని వంటివాడు, చిరకాలంగా పేరుకొన్న అహంకారపు దుంపను ముక్కలు ముక్కలుగా నరికివేయడంలో ఖడ్గదండం వంటి వాడు,

6. చంద్రరేఖాలంకృతమైన ఫాలం గలవాడు, (చంద్రునివంటి ఫాలం గలవాడు), అత్యధికమైన కల్యాణ సమూహానికి నిలయమైనవాడు, భయమనే



దుంపను పెకలించి వేయడంలో వరాహం వంటివాడు, గంభీరమయిన జనన జరామరణాలనే మహా ప్రవాహం గల సంసార సాగరాన్ని తరించడానికి నావ వంటివాడు అయిన మహావీరుణ్ణి నమస్కరిస్తున్నాను.

7. విశేషకమ్ — పోతరించిన కామభరంతో నశించిపోయేది, అంగాల విలాసాలతో బంధురమైనది, స్తనభారంతో అలసిపోయినట్టిది, సవిలాస గమనంతో మనోహరంగా రవళిస్తున్న అందెల పాదాలు గలది అయిన సుందర శరీరంతో బప్పేది;.

8. గీతతాళ లయ చారచారీ చతురత గలది, కామశాస్త్ర బంధాలలో కుశలురాలు, తామర తూడులవంటి కోమలమయిన బాహువులు గలది, అనేక కాముకులనే జింకలను పొడిచిన భల్లం వంటిది;

9. కపోలాలపై విలాసంగా కదలాడే మణికుండలాలు గలది, అశోకపు చివుళ్ళవంటి చేతులు గలది, శంఖంవంటి మెడ గలది, రతిక్రీడలలో ఆరితేరినట్టిది, రమణీయ హావభావాలు గలది అయిన రమణి కూడ నీ పవిత్ర సంకల్పాన్ని పాడు చేయజాలదు.

10. ఓ దేవా! నీవాణి సంచరిస్తున్న కిన్నరుల పలుకులు, వేణు వీణా రావాలు కలిసిన గేయ ధ్వనివలె రమ్యమైనది, ఆకాలంలో కలిగే చెడు ఊహలను, చెడు బుద్ధులను, చెడు దేవతల సంబంధమయిన బుద్ధిని పోగొట్టేటట్టిది.

11. దేవా! నీ ఆగమం (ఉపదేశం) సందేహాలనే దావానలాన్ని చల్లార్చే మేఘాల వంటిది, చేతనా చేతన భావాలను ప్రకాశింపజేసే సూర్యుని వంటిది. ఆ ఉపదేశాన్ని విన్న నరులు పవిత్రులై భావి కైవల్యలక్ష్మి వివాహంతో సుఖానందాలు పొందుతారు.

12. ఓ వీరా! దేవతలు నీ సభలలో మహాపరిమళ భరితాలు, తిరుగుతున్న తుమ్మెదల ఝుంకారాలతో హృదయాన్ని హరించేవి అయిన వికసించిన పద్మాలు, అప్పుడే విచ్చి సుందరంగా ఉండే వావిలి పూవులు, మందారాలు, మొల్లలు మొదలయిన పూవులను కలగలుపుగా వెదజల్లుతున్నారు.

13. ఎల్లలులేని భయంకరమైన సంసారంలో పేరుకొన్న, కంటికి కానరాని మోహమనే మృదావరణాన్ని ఛేదించడంలో బలమైన నాగలి వంటివాడు, దుష్టమైన సంసార నివాసంలో అంటుకున్న మలాన్ని పోగొట్టగల పవిత్ర జలప్రవాహం వంటివాడు, మారుడనే మహామతంగజానికి సింహం వంటి వాడు అయిన మహావీరుణ్ణి ప్రణమిల్లుతున్నాను.

14. అంతరంగంలోని కలహ కారణాలను ఛేదించేవాడు, సంసారానికి

అంతరాయం వంటివాడు, రోగ సముదాయాన్ని నిరోధించినవాడు, లోభం మాయ లేనివాడు, మోహాంధకారా వరణాల కోటలను ఛిన్నాభిన్నం చేసినవాడు, మెరుగుపెట్టిన బంగారు కాంతిగల దేహం కలవాడు అయిన మహావీరుణ్ని ప్రణమిల్లుతున్నాను.

15. ఓ మహావీరా! ఇంద్రాది దేవతలు, అసురులు నీ పాదాలకు నమస్కరిస్తున్నారు. అప్పుడు వారి కిరీటాది అలంకారాల కాంతులు నీపాదాలపై పొరాడుతాయి. అలాటి నీ చరణ సరోరుహాలకు నమస్కారం చేస్తున్నాను. నీవు మహా సందేహాలనే రేణువులను ఎగురగొట్టగల ఝంఝూవాతం వంటివాడివి.

16. నీ చరణ కమలాలలో భృంగాయమానమయినది, పంచమ మహాగణాల వాణితో సంసార సంబంధమైన బుద్ధితొలగి, కరుణా సముద్ర మన దగిన సిద్ధ సంఘాలుగల దమి (ముని) గణం కొలిచేది, నిరంతరం సంచరించేది అయిన నీ చరణయుగాన్ని పూజిస్తున్నాను. (ఈ శ్లోకం అర్థం సరిగా తెలీలేదు.)

17. యుగలమ్ — ఓ వీరా! యుద్ధాలు జరుగుతున్నాయి. వాటిలో శత్రువులు పదునైన అంచులుగల ఖడ్గాలు ధరించి ఏనుగు కుంభస్థలాలను నరికివేస్తున్నారు. ఆ నరికిన కుంభస్థలాల నుంచి రక్తనాళాలు వెలుపలికి వచ్చి భయంకలిగిస్తాయి. కుంతం, ఖడ్గం, తోమరం మొదలయిన ఆయుధాలతో శత్రువుల దేహాలు తెగిపడుతున్నాయి. ఎటుచూచినా కంకాళాలతో రణభూమి భయంకరంగా ఉంది.

18. వేగంగా హలంకరిస్తూ భీతిగొలిపే తలతెగిన దేహాల నుంచి చిమ్ముతున్న రక్తాన్ని తాగడానికి ఎగురుతున్న పక్షులగోలతో, బాణాల సమూహాల విసరుతో మహాభయానకంగా ఉన్న రణభూమిలో నిన్ను స్మరించే మానవులు ఎంతటి ఘోర రణాన్నయినా జయిస్తున్నారు.

19. సమీపించిన సిద్ధిలక్ష్మి గాఢాలింగనం కలిగించేవాడు, మోహపర్వతాన్ని వజ్రపాణివలె నుగ్గునూచగా చేసేవాడు, సంపత్తికి కారణమయినవాడు, అమంగలాలను సమూలంగా నాశనంచేసే దావానలం వంటివాడు, పాపాలను హరించేవాడు అయిన మహావీరభగవానుని ఎవరు సేవించరు?

20. ఓ దేవా! ఈ భూమండలంలో నీవు విహరించడంవల్ల బాధ, వరాజయం, ఉత్పాతం, రోగాలు, యుద్ధాలు, చోరభయం, శత్రుభయం, మృత్యుభయం మొదలయినవి లేక నగరాలు, నిగమాలు (వర్తకుల సంఘాలు) గొప్ప ఉత్సవాలు చేసుకొంటున్నాయి.



21. నీవు సంగరహితుడిని, ఎవరితోను ద్వేషకలహాలు లేనివాడివి. సాటిలేనివాడివి. అసహాయశూరుడివి. రాగరహితుడివి. దేనిమీద ప్రత్యేకమైన మమకారం లేనివాడివి. కామేచ్ఛలేనివాడివి. లాలసలేనివాడివి. ఓ దేవా! జీవ సమూహబంధో! ధీరతతో నిరుద్ధమూ, ఘోరమూ అయిన ఈ సంసారంలో చరిస్తూ నివసిస్తూ సకలజీవులను ఉద్ధరిస్తున్నావు.

22. ఓ దేవా! ఉల్లాసం కలిగిస్తూ, మెరిసిపోతున్న స్వచ్ఛమయిన ముత్యాలదండలు ధరించి బహువిలాసాలతో మత్తుగా ఉండే నారీగణం మళ్ళీ ఈ సంసారంలో జననమరణాల భయం కోసం నా మనస్సును లాగుతున్నాయి. ఏమి చేయమన్నావు? చెప్పు.

23. ఓ మహావీరమహాగజమా! మలినమైన చిత్తమనే భూమిలో, కామగుణమనే పాదులో ఇచ్ఛ అనే నీటితో పెరిగి, చింతలనే ఆకులువేసి, సంభోగమనే పూవులుపూచి వెలిగిపోతున్న నామోహ తరువును కూకటివేళ్ళతో పాటు పెకలించివేయి.

24. ఓ మహావీరా! నీవు సిద్ధించిన సిద్ధి అనే పురంతో సంబంధమనే మంగళం పొందిన వాడివి, మాయ అనే మహా కమలపుతీగకు మహాగజం వంటివాడివి. మాయను సమూలంగా ఏనుగులాగ పెకలించి వేసేవాడివి. చిట్టచివర (చరమ) కైవల్యాన్ని పొందిన పురుషపుంగవుడివి. సాటిలేని దయా దమాది గుణాలు కలవాడివి. అలాటి నీకు మళ్ళీ మళ్ళీ నమస్కారం.

25. ఓదేవా! నేను మహావేగంతోపారే భవసింధు ప్రవాహంలో మునిగిపోతున్నవాడిని. నిరంతరం అసమంజసమైన పనులు చేస్తున్నవాడిని. అలాటి వీ ఈ కింకరుణ్ని ఉద్ధరించడానికి చేయిఊత-కరావలంబం-ఇవ్వు. (ఇంతవరకు వసంత తిలకావృత్తం.)

26. కుసమయమనే- అశుభసమయమనే- వృక్షపంక్తిని విరుగగొట్టడంలోను, ధ్వంసం చేయడంలోను మహామారుతం వంటివాడా, దుష్టనీతి అనే కలుపపిండును నుగ్గుచేసే మత్తగజం వంటివాడా, మహావీరుడా నీ గుణలేశసంబంధంవల్లనే నేను శుద్ధుడుగాను, గొప్పవాడుగాను పరిణమించాను. నన్నుకాపాడు. (మాలినీవృత్తం.)

27. ఈ సంసార పంజరం అనయంతో నిండి నిబిడీకృతమైనట్టిది; అట్టడుగు వరకు బాధలతో ఉండేది; వియోగాలతో విరసమై నట్టిది; సిగ్గుల ముద్ర; ఎప్పుడూ భయాలతో దుస్సహమైనట్టిది. దీనిలో నేను కొట్టుమిట్టాడుతున్నాను. నరక కుహరంవైపు వెళ్ళుతున్న నేను ఎంత మూర్ఖుణ్ని? సిద్ధి

మహానగరానికి సరళ మార్గమైన నీ వాణిని హా! సేవించకుండా ఉన్నాను! (పృథ్వీవృత్తం)

28. దేవా! నీవు ఏలాటి ఆశలూ లేనివాడివి. పరమ భూమిలో సంచరిస్తున్న వాడివి. అన్నీ ఎరిగిన వాడివి. అవలీలగా కలి కలహాలను నశింప జేసేవాడివి. ఇలాటి నిన్ను నమస్కరించేవారు మరణభయ కల్లోల కలితమైన భవభయ మహాసాగరంలో మునుగరు సుమా! (శిఖరిణీవృత్తం)

29. నమస్కరిస్తున్న సేవానిరతుల చూడామణుల కాంతులతో వెలుగుతున్నట్టిది, (ఇక్కడ సరిగా అర్థం కాలేదు.) సూర్యకిరణాలతో అప్పుడే వికసించిన కమలం వంటిది అయిన నీ చరణ కమలాన్ని నా చిత్త మందిరంలో చిరకాలంగా భద్రపరచుకొన్న నాకు, అనేక భవభయాలను తొలగించుకొనడం కోసం సిద్ధావాసాన్ని అనుగ్రహించు. (మందాక్రాంతా వృత్తం)

30. ఓ నాథా! నేను ఈ విధంగా సమ సంస్కృత స్తవాన్ని నీ సన్నిధిలో ప్రస్తావిస్తున్నాను. కాని, నేను, ఓ జినవీరా! ఇంద్ర పదవినిగాని, విశాల రాజ్యలక్షినిగాని కోరడంలేదు. విలాసవతులయిన ప్రియప్రణయినులనూ కోరడంలేదు. ఓ దయాళో! ప్రసాద విశదమయిన తొలిచూపును నా మీద ప్రసరింప జేయమని మాత్రమే అర్థిస్తున్నాను. (శార్దూల విక్రీడిత్)

—(౦)—

# దేశినామమాలలోని మరికొన్ని తెలుగు పదాలు

"నిన్ను చూస్తే తందా మనిపిస్తుందోయ్!" అన్నాడు డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు ఒకనాడు మద్రాసు సెంట్రల్ స్టేషనులో బండెక్కుతూ నన్ను చూచి. "అంతటి అపరాధం ఏమి చేశానండి!" అని ప్రశ్నించాను విధేయతతో. "అపరాధమా? మహాపరాధమే చేశావు. సంస్కృత ప్రాకృత సాహిత్యాలకే ద్రోహం తలపెట్టావు. గాథా సప్త శతితో తెలుగు పదాలు చేరాయని వ్రాశావు. ఈ ప్రతిలోమాన్ని ఎవరు సహిస్తారు?" అన్నారు ఉద్రేకంతో.

"భాషల విషయంలో అనులోమం ఎంత సహజమో ప్రతిలోమం కూడా అంతే సహజమండి. రాజకీయ ప్రాబల్యం, సాహిత్య ప్రాచుర్యం, మత ప్రాభవం — ఈ కారణాలతో వ్యాపించిన సంస్కృత భాష విభిన్న సంఘాలతోను, జాతులతోను సంబంధం ఏర్పడిన కొద్దీ, వాటి భావాలను, వాటి భాషల పదాలను గ్రహించుకొంది. అన్యభాషా పదాలనూ, సంప్రదాయాలనూ సంతరించుకొనక పోయిఉంటే సంస్కృత సాహిత్యం ఇంత విస్తరించి ఉండేదేకాదని విమర్శకులు అంటున్నారు. సంస్కృత ప్రత్యయాలతోను, ఉపసర్గలతోను ఇతర భాషాపదాలు వేషం మార్చుకొని సంస్కృతంలో లీనమైన వనడానికి తంత్రవార్తిక కారుడైన కుమారిల భట్టు వాక్యాలే మనకు నిదర్శనం. జైన బౌద్ధ మతాలద్వారా దక్షిణ భారతదేశంలో వ్యాపించిన ప్రాకృతభాష కూడా సంస్కృతం వలెనే ఆ దేశభాషల సంప్రదాయాలనూ, శబ్ద సముదాయాన్ని తనవిగా చేసుకొనకపోలేదు. కాని ... ..." అని గుక్క తిప్పుకోకుండా అంటున్నాను.

"ఉండవయ్యా, నన్నూ మాట్లాడని. బండి ఎక్కు. కూచోని మాట్లాడదాం. బండి కదిలేసరికి దిగుదువు కానీ." అన్నారు ఆయన.

బండి ఎక్కాను. ఆయన ద్రావిడభాషా శాస్త్రజ్ఞులపై ఒక్క ఊపుగా విరుచుకుపడి "ఎవరయ్యా వాటిని అన్యభాషాపదా లన్నవారు? ఏమిటి విని

గమనం?" అన్నారు. "ఇదేమిటండీ? ప్రాకృత కావ్య వ్యాఖ్యాతలందరూ అలాటి పదాలను 'ఇతి దేశీ' అని నిర్దేశిస్తూనే ఉన్నారు కదా? వారు దేశ్యాలను ప్రాకృత ముద్ర వేద్దామనే వ్యామోహం లేనందున 'దేశీ' అని ప్రత్యేకంగా పేర్కొన్నారు. రోలంబ, రించోళి, తాలూరాది దేశిపదాలు ప్రాకృతంలో చేరి పోగా, వాటిని సంస్కృత పదభ్రాంతిలో సంస్కృత మహాకవులుకూడా గతాను గతికంగా ప్రయోగించగా, 'మేదినీ' మున్నగు సంస్కృత నిఘంటువులు స్వీక రించి సంస్కృతముద్ర వేశాయి. "రోలంబశబ్దం సంస్కృతేపి కేచిద్గతాను గతికతయా ప్రయుంజంతే" అని ఆచార్య హేమచంద్రుడు దేశీ పదకోశమైన 'దేశీ నామ మాల'లో (7.2) చర్చించాడు" అన్నాను.

"పదకొండో శతాబ్దంలో పుట్టిన ఆచార్య హేమచంద్రుడా నీకు ప్రమాణం? దేశీ నామమాల అనే తన దేశినిఘంటువులో హేమచంద్రుడు తద్భవా లనదగిన అమియణిగ్గమో, పురిల్లదేవో వంటి పదాలనూ దేశిపదా లన్నాడని దానిని రెండవసారి సంస్కరించిన శ్రీ పరవస్తు వేంకట రామానుజ స్వామిగారు పీఠికలో తెలిపారు చూచావుకదూ?" అన్నారు ఆయన వెటకారంగా.

"చూడకేమండీ? ఆచార్య హేమచంద్రుడు తన కాలంలో సంస్కృత ప్రాకృత సాహిత్యాలలో యుగపురుషుడు. 1088లో జన్మించి జీవించిన 84 సంవత్సరాలూ తర్క, వ్యాకరణ, జైనవేదాంత శాస్త్రాలలోను, అలంకార సాహిత్యాలలోను ప్రామాణికమైన ఉద్గ్రంథాలు రచించిన వాగనుశాసనుడు. అలాటివాడు ప్రమాణం కాకపోతే మరెవరు ప్రమాణమండీ? హేమచంద్రుడు ప్రాకృత సాహిత్యంలో కనిపించిన దేశిపదాలను ఎంతో వివేచన చేసి కాని తన దేశీ నామాలలో చేర్చుకోలేదు. తన ఈ నిఘంటువులలో తనకు ముందున్న దేశి పదకోశకారులు అభిమానచిహ్న, గోపాల, దేవరాజ, ద్రోణ, ధనపాల, పాదలిప్తా చార్య, రాహులక, శీలాంకాదులను ఉదాహరించి కొందరి మతాలు ఖండించి, మరికొందరి మతాలు సమర్థించాడు.

'దేశీ దుస్సందర్భా
ప్రాయ స్సందర్భితాపి దుర్బోధా,
ఆచార్య హేమచంద్రః
తత్తాం సంద్రృభతి విభజతి చ.'

(దేశీ పదాలను అన్వయించడం కష్టం. అన్వయించినా అర్థం చేసికొనడం కష్టం. అలాటివాటిని హేమచంద్రుడు అన్వయించి సుబోధం చేస్తాడు.) అని గ్రంథా దిలో చేసిన ప్రతిజ్ఞను నిర్వహించుకున్నాడు. 'ఇప్పటి దేశీ నిఘంటుకారులనీ,



వాటి వ్యాఖ్యాతలనీ ఎన్ని తప్పులని ఎన్నను? (అదునాతన దేశీ కారాణాం, తద్వ్యాఖ్యాతౄణాంచ కియంతః సమ్మోహాః పరిగణ్యంతే. 8.12)' అని విసుక్కున్నాడు కొన్ని చోట్ల. తను సారతర దేశీ దర్శనంతో వ్రాస్తున్నానని, తన నిఘంటువులో పొరపాట్లుండవని 'తిణిస' శబ్ద వ్యాఖ్యాన సందర్భంలో స్పష్టపరిచాడు. (తిణిసం చ వృక్షవిశేష మాచక్షతే. అస్మాభిస్తు సారతర దేశీ దర్శనేన తిణిస శబ్దో మధుపటలార్థో వ్యాఖ్యాతః. తత్ర యుక్తాయుక్తస్య బహు దృశ్వానః ప్రమాణం 3 12 తిణిస-తేనెతెట్టు.) అంతేకాక దేశీ నామమాలలో పదా లన్నిటినీ అకారాదిగా–మొదటివర్గంలో అజాది పదాలు, అనేకార్థాలు; ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ వర్గాలలో కచటతప వర్గాది పదాలు, వాటి అనేకార్థపదాలు, సప్తమ వర్గలో రలవకారాది పదాలు, వాటి అనేకార్థాలు; అష్టమవర్గలో సహాదిపదాలు క్రమబద్ధంగా ఇచ్చాడు. ఇలాటివాడు కాక మరెవరండీ ప్రమాణం?" అన్నాను.

"సరేకాని, హేమచంద్రుడు చెప్పిన దేశీ పద నిర్వచనం అతివ్యాప్తం కాదూ?" అన్నారు ఆయన.

"అతివ్యాప్తం ఎందు కవుతుందండీ? అతడు స్పష్టంగానే చెప్పాడు.

'దేస విసేస పసిద్ధీఇ
భణ్ణమాణా అనంతయా హుంతి,
తమ్హా అణాఇ పాఇఅ
పయట్ట భాసావిసేసట దేసీ.'

(దేశవిశేష ప్రసిద్ధమైనవి అనంతంగా ఉంటాయి పదాలు. వాటి నుంచి అనాది ప్రాకృత ప్రవృత్త భాసావిశేషమే దేశీ) అని అన్నాడు కదా. అయినా,

'వాచస్పతే రపి మతిః
న ప్రభవతి దివ్యయుగ సహస్రేణ,
దేశేషు యే ప్రసిద్ధా
తాఞ్ శబ్దాన్ సర్వతః సముచ్చేతుమ్.'

(దివ్యయుగ సహస్రం శ్రమించినా వాచస్పతి అంతవాడు గూడా ఆయా ప్రాంతాల్లో ప్రసిద్ధమైన ప్రాకృతంలో చేరిపోయిన దేశిపదాలను ఏర్చి కూర్చడం కష్టం) అని ఎంతో వినయంతో స్పష్టీకరించాడు. దీనిని బట్టి తెనుగు, తమిళ, కన్నడాది దేశభాషా పదాలను ఎంతో శ్రమపడి, వాటి పుట్టు పూర్వోత్తరాదు తెలుసుకొని క్రోడీకరించా డనడం విస్పష్టం" అన్నాను.

"అక్కడేనయ్యా కలిగింది అపోహ. హేమచంద్రుడూ అపోహపడ్డాడు. దానినిబట్టి శ్రీ రామానుజస్వామిగారూ అపోహపడ్డారు. 'దేశీ నామమాల'గ్లాసరీలో కొన్ని దేశీపదాలకు మూలమంటూ తెలుగు, తమిళ, కర్ణాటకపదాలు ఇచ్చారు. ద్రావిడ భాషా కుటుంబం అన్నదే లేదు. అంతా సంస్కృతం నుంచీ వచ్చిందే" అన్నారు ఆయన. "శ్రీ రామానుజస్వామిగారు తెలిపినవి కాక మరి కొన్ని తెలుగు తమిళ పదాలు కనుక్కున్నానండీ నేను దేశీ నామాలలో" అన్నాను. ఆయన వినీ వినిపించుకోకుండానే, "ఏవీ? చెప్పు. ఇద్దరినీ ఖండిస్తాను," అన్నారు. "వినండి!" అంటూ మొదలుపెట్టాను.

అణ్ణీ=దేవర భార్యా, పతిభగినీ, పితృష్వసా అని మూడర్థాలిచ్చాడు. ఇది పూర్తిగా తమిళ పదం. నేడిది అన్నభార్య—వదినె—అనే అర్థంలో తమిళదేశంలో వ్యవహారంలో ఉంది. తర్వాత వదినగారు (పతిభగినీ) అనే అర్థంలోను వ్యవహృతమైంది.

ఉడూ=తృణపరివారణం—తృణావరణాచ్ఛాదనం అన్నాడు. ఆవరణంలో ఆశ్రయం ప్రధానంగా ధ్వనిస్తుంది గనుక ఇది వీడు అనే తెనుగు పదం నుంచి కాని, ఉడు ధరించు అనే ద్రావిడ ధాతువునుంచి కాని విష్పన్నమై ఉంటుంది. ఉడుపు. ఉడుగర తెలుగు.

ఊసలం=పీనం అన్నాడు. ఇది ఉసులుకొను అనే తెలుగు క్రియనుంచే పుట్టి ఉంటుంది,

ఓఆవలో=బాలాతపః—ఉదయపు ఎండ, ఇది బాలాతప శబ్దభవం కావచ్చు కాని, దేశీ పదమన్నాడు గనుక వెయ్యల్ అనే తమిళపద భవమా అన్న అనుమానం కలుగుతుంది. ఓలఇణీ=దయితీభూతా. ఇది వలచు అనే తెనుగు ధాతువునుంచి వచ్చిందమకుంటాను. ఓలుంకీ=ఛన్నరమణం—అంటే బాగుడుమూతలు. ఒళిందుక్కొళ్ అనే తమిళధాతువు దీనికి మూలమై ఉంటుంది. ఓసిఓ=అబలః. ఇది ఓసిలోడునుంచి వచ్చిందేమో! ఓసి—తమిళ పదం.

కలింజం, కిలించం (కిలించిఅం)=లఘుదారు. చిన్నకర్ర, పుడక. కిలించిఅ శబ్దానికి కిలిచ్చిఅం అనే రూపాంతరమూ ఉంది. హేమచంద్రుడు కలింజం, కిలించం అనే పదాలకు లఘుదారువు అన్న అర్థం చెప్పాడు కాని గాథా సప్తశతిలో (1.80) కిలించిఅ కంటకేణ అని ప్రయోగం కనిపిస్తుంది. కిలించిఅ కంటఅం చిన్నముల్లు. ఈ కిలించిఅం క్రమంగా కిలింజం, కిలించం అని మారి చిన్నపుడక అనే అర్థంలో రూఢమై ఉంటుంది. మనకు సన్నని, నీచమైన అనే అర్థాలలో క్రించు కించు శబ్దాలున్నాయి. తమిళ కన్నడ భాషలలో కిళి, కిలింజల్, కిలిచ్చల్, కీళ్ శబ్దాలకు సన్నని, సన్నగాచేయు, చించు అనే అర్థాలున్నాయి. కొంచెం, కెల, శిల, పదాలు అల్పార్థకాలు. కలింజ,



కిలించ పదాలకు పైన ఉదాహరించిన ద్రావిడ పదాలకూ గల సామ్యాన్ని బట్టి అవి వీటికి మూలమై ఉంటాయి. వీటిని గతానుగతికంగా సంస్కృత పండితులూ ప్రయోగించగా, త్రికాండ శేషకారుడు కిలింజకం, కిలింజం అని సంస్కృత ముద్ర వేసి సూక్ష్మదారుః అని వ్యాఖ్యానించాడు. కీలం=స్తోకం. ఈ పదం ముందు చెప్పిన ద్రావిడ పదవర్గంలోనిదే.

కుమ్మణం=మానః. కుములు అనే తెలుగు పదానికిది దగ్గరగా లేదూ? కుందఓ=కృశః, దీనికి కుందు, కందు అనే తెనుగు, కన్నడ పదాలు మూలమనుకుంటాను.

చట్టూ=దారుహస్తః. కర్రగరిటె, తెడ్డు. చటుఅం — అని గాథాసప్తశతిలో (2.62) ప్రయుక్తమైంది. చట్టువం అనేపదం గరిటె, తెడ్డు అనే అర్థాలలో తెనుగు తమిళాలలో ఉంది. "చట్టువం బొకచేత బట్టి ఖడ్గము సంకదగిలించి" (భార. విరా. 1.211). "ప్రక్షాళితంబైన పసిడి చట్టువమున సన్నంబు నునిచి నెయ్యభిఘరించి" (కాశీ. 7.147). చిన్న ముట్టి, కర్రపాత్రలను కన్నడంలో చటుకి అంటారు. దారుహస్తం అని హేమచంద్రుడు అర్థం చెప్పాడు గనుక దీనికి చెట్టుపదంతో ఏదైనా సంబంధం ఉందేమో! మొదట కర్ర గరిటెకు వ్యవహారంలో ఉన్న ఈ పదం తర్వాత గరిటె సామాన్యానికి వ్యవహారమై ఉంటుంది.

చారో=ప్రియాలవృక్షః. సారచెట్టు. ఇది (సార-చార) తెనుగని వేరుగా చెప్పనక్కర లేదు. చుడులీ=ఉల్కా. కొరివి. చుడు (కాల్చు) అనే ద్రవిడ పదం దీనికి మూలం.

జంబువో, జంబులో=వేతసః. జంబుగడ్డి. ఇది కన్నడంలోను, కన్నడ పరిసర ప్రాంతాలలోను ఒకరకం తుంగకు వ్యవహారంలో ఉంది.

తణ్ణాయం=ఆర్ద్రం. తడిసినది. చల్లనిది. తనియు. తనువు, తంపు తెనుగులోను, తణ్ణన, తంపు కన్నడంలోను ఉన్నాయి. ఇది తన్మూల జన్య పదం.

తాలూరో=ఆవర్తః. సుడి. తలయతి తలం దర్శయతీతి తాలూరః— అని శబ్దకల్పద్రుమం వ్యుత్పత్తి. తాలూరశబ్దం గాథాసప్తశతిలో (1.37) ప్రయుక్తమైంది. ఈ శబ్దం దేశి అని వ్యాఖ్యాతలందరూ అన్నారు. తిర్, త్రిప్పు, తిరుగు, తలారు అనేవి తెలుగులో భ్రమి వాచకాలు. తలారు శబ్దానికి మరలు తిరుగు అనే అర్థాలున్నాయి. "క్షేపులం దలచి తలారింపక" (భాగ 10 స్కం) అని ప్రయోగం. తలారుకు తాలూరకు పోలిక ఉంది. తాలు శబ్దానికి

తిరుగు, తాలింపు. తాలబోయి అనే అర్థా లున్నాయి. కనుక తలార. శబ్దమే తాలూర శబ్దానికి మూలమై ఉంటుంది.

తిణిసం = మధువటలం. తేనెచెట్టు. తిణిసపదం దేశి పదమని హేమ చంద్రుడు చేసిన చర్చను ఇదివరకే తెలిపాను. తేన్, తేనె, జేన్, జున్ను ద్రావిడపదాలు; తిణిసం ఈ తేనె నుంచి వచ్చి ఉంటుంది.

పడుజూఅఈ=తరుణీ. ఇది పడుచు, యువతి అనే తెలుగు సంస్కృత పదాల కలయికతో ఏర్పడిందను కుంటాను. పలం, పలసం=స్వేదః. ఇది పొలసు అనే తెలుగుపదం మారురూప మనుకుంటాను. పిల్లిరీ=గండుత్పంజ్ఞం తృణం. ఇది పులు, పుల్లు, పూరి — అనే తమిళ తెలుగుపదాలనుంచి పుట్టి ఉండదా? పేండటః=షండః. పేడి. దీనికి మూలం పెణ్ అనే పదమై ఉంటుంది. పేండి అని దక్షిణాంధ్రుల వ్యవహారం. కనుక ఇది పెణ్, పేండి నుంచే వచ్చి వుంటుంది. పాణో=శ్వపచః. పాణ శబ్దం గాథాసప్తశతిలో ప్రయుక్తమైంది. "పాణసి పువ్వు బోడులము" (హరిశ్చంద్ర. అ-2.) పాణసి లోని అంత్య సికారం రూపుచెడి పాణ మాత్రం మిగిలి ప్రాకృతంలో చేరింది.

ఫలహీ=కార్పాసవృక్షః, ప్రత్తి, ప్రత్తి చెట్టు. ఈ పదం గాథాసప్త శతిలో నాలుగుసార్లు ప్రయుక్తమైంది. "ఫలహీ కార్పాసవృక్షే దేశీ" అని కుల బాలదేవుని వ్యాఖ్య. హేమచంద్రుడు దీనికి వలహి, పవణీ అనే పర్యాయాలు కూడా ఇచ్చాడు. తెనుగు ప్రత్తే ఫలహీగా మారిందని నానమ్మకం. ప్రత్తికి పూర్వరూపమైన పఱుత్తి పలుత్తి అయి అంత్య ద్విత్వాక్షరం ఊదివలకడంలో కలిగిన ప్రయత్నంలో మొదటి పకారం మహాప్రాణమై ఉంటుంది. పంది భోండి అయినట్టు. పలుత్థీ, ఫలహీ అయింది. పత్త్రికా శబ్దంనుంచి పత్తి అయివుంటుందని, ప్రపత్రికా శబ్దం నుంచి ప్రత్తి పుట్టివుంటుందని మీరు (శ్రీనారాయణ రావుగారు) చేసిన వాదం సహేతుకంగా కనిపిచదండి. పత్రికాశబ్దం నుంచే పత్తియ-పత్తి కావడానికి వీలున్నా అర్థంకోసం లాక్షణికంగా నానాబాధలూ పడవలసి వుంటుంది. ప్రపత్రికా శబ్దంనుంచి ప్రత్తి అనేరూపం అసలేకాదు. తెనుగు సంప్రదాయానికి ఉపసర్గ విధానమే విరుద్ధం. పత్రికానుంచి పత్తిఅ కావచ్చుకాని "ఫలహీ"ని ఏ విధంగానూ సాధించలేము. ఛిద్ర వాచక ఛిల్ల-ఉచ్ఛిల్ల శబ్దాలు రెండూ వేర్వేరనీ, ఉచ్ఛిల్లశబ్దం ఉత్పూర్వక ఛిల్లశబ్దం కాదనీ; దేశీ శబ్దాలకు ఉపసర్గ సంబంధం వుండదనీ హేమచంద్రుడు ఉచ్ఛిల్ల పద వ్యాఖ్యతో (1.95) చర్చించాడు. (నహి దేశీశబ్దానాం ఉపసర్గ సంబంధో భవతి) ఫలంనుంచి ఫలఅయినా ఫలీఅయినా, ఫలహీ అని అంత్యహీకారం ఎక్కడ నుంచి సాధించగలం?



బోదరం — పృథు. పెద్దది. ఇది బోద, బొద్దు అనే పీనార్థక శబ్దాలకు దగ్గరగా లేదూ?

భుండీరో=సూకరః పంది. దీనికి భుండో, బుండో అనేవి రూపాంతరాలు. గాథాశప్తశతిలో భోండి (5.2) అని ప్రయోగం. ఈ మాటలు వినీ వినగానే మనకు పంది అనే తెనుగుమాట మనసుకు తట్టడం లేదూ? ప్రాకృతంలో ఇ-ఏ-లకు, ఉ-ఒలకు పరస్పర వినిమయం సహజం గనుక భోండ శబ్దాన్ని గ్రహించినట్టే. తెలుగు వ్యవహారంలో పదాది అకారం ఏకార ఒకారాలుగా మారుతుంది. గద్ద-గెద్ద, గరిట-గెరిట, మగడు—మొగడు. "మొగడొచ్చి పిలిచెను పోయివచ్చెద సామి." పప్పులు-పొప్పులు. కన్నడంలోను ఇలా మారడం కద్దు. ఇలాగే పంది పొంది అయి, తవర్గం టవర్గంగా మారి పొండి అని ఊదివలకడంలో చేయవలసిన ప్రయత్నాన్ని బట్టి ఆదివర్ణం మహాప్రాణంగా పరిణమించి భోండి అయి ఉంటుంది. ఇది ఈకారాంతం కావడంవల్ల స్త్రీలింగమని భ్రమపడినందున భోండ, భుండ శబ్దాలు కల్పించబడ్డాయి. భుండీరో పదంలో పంది ప్రాచీనరూపం తొంగి చూస్తున్నది చూడండి. పందికి పూర్వరూపం పంఢ్రి. ప్రస్తుతం తమిళంలో పన్ఱి. రేఫసహిత నకారాన్ని ఉచ్చరించడంలో న్ద్రి ఉచ్చారణ ఏర్పడుతుంది. న్ద్రి గూడా అవుతుంది. పన్—రెండు=పంన్రెండు మళయాళరూపం పన్నెండు తెనుగు వ్యవహారరూపం. పన్ద్రి పంది అయింది తెనుగులో. పన్ని అనేరూపం వ్యవహార చ్యుతమైంది. పన్ని నేడు తమిళ వ్యవహారంలో ఉంది. కనుక పంఢ్రి పదం ప్రాకృతంలో బుందో, భుండో, భుండీరో, భోండీ అనే పెక్కురూపాలతో చేరిందని ఊహించడం అసమంజసం కాదు.

మండిల్లో=అపూపః భక్ష్యవిశేషం. ఇది తెలుగు కన్నడాల మండిగలు కాదూ? మలట్టో=గర్వః. ఇది మొరటు, మోటు, మోడు శబ్దాల వికృతి అనుకుంటాను. మాకందో=అమ్రః. మామిడి దీని పుట్టు పూర్వోత్తరాలు చాల ఉన్నాయి, మరొకమారు చర్చిద్దాము.

హల్లీసో=రాసకః. మండలేన స్త్రీణాం నృత్యం. మనకు, కన్నడం వారికి హళ్ళి అనేపదం ఉంది. ఇది సున్నకు పర్యాయం. చిన్న వర్తులానికి అల్లి అంటారు కొన్ని ప్రాంతాలలో. గోలీలనుకూడా అల్లి కాయ అంటారు. అల్లికాయలంటే గుండ్రని గుళ్ళు. బొంగరాలాటలో నేలమీద గుండ్రని గీటు గీచి దాని మధ్యన ఒక బొంగరాన్ని ఉంచుతారు చూచారా? అలా గీచే గుండ్రటి గిరిని అల్లి అంటారు. అలాగే పిల్లలు ఒకరిచేయి ఒకరుపట్టుకుని గుండ్రంగా

పందెం కట్టి నిలవడాన్ని అల్లి కట్టడం అంటారు. కనుక ఈ అల్లే హల్లీసో అయిందేమో? హల్లీసం నుంచే అల్లీకాకూడదూ అని ఎదురు ప్రశ్న వేస్తారు కదూ? కావచ్చు. కాని హేమచంద్రుడు దీన్ని దేశిపదంగా పరిగణించాడు కనుకనే ఈ శ్రమంతా.

హుడ్డా=పణః. పందెం. ఇది ఒడ్డు అనే తెలుగు పదం వికృతే అయి ఉంటుంది.

హేరంభో=మహిషః. దున్నపోతు ఇది ఎరుమై (ఎమ్మె-క-ఎనుము-తె,) నుంచి వచ్చి సంస్కృతంలో చేరి అన్వార్థ వాచకమైందని కిట్టల్ తన కన్నడ నిఘంటువులో వ్రాశాడు. హేమచంద్రుడు దీనిని దేశి అంటున్నాడు గనుక ఎరుమైనుంచి ఇది ప్రాకృతంలో చేరి ఉండవచ్చు.

హోరణం=వస్త్రం. ఇది పోరువై, పోరణం-అనే ద్రవిడపదాల నుంచి వచ్చి ఉంటుంది. పోరువై అంటే కప్పుకొనే వస్త్రం. ఇంకా ఎన్నో ఉన్నాయి ద్రవిడ పదాలు - ఇలా చెబుతూ పోయాను.

బండి అరక్కోణంలో ఆగినప్పుడుగాని తేలీలేదు ఎంత సేపు అయిందని. మరొక సమస్య వచ్చింది; టిక్కెట్టు లేకనే బండి ఎక్కాను.

"చూచావా? నీ కిదే శిక్ష, తెల్లవారుజాము బండి ఎక్కి మద్రాసు చేరుకో. మరొకమారు హోరాహోరీగా పోట్లాడుకుందాం. ద్రావిడ భాషావాద సన్నిపాతం ముంచుకొచ్చింది మీ కందరికీ. స్వాస్థ్యం కలుగాలంటే కొంత కాలం పడుతుంది" అన్నారు ఆవేదనతో ఆయన.

నేను బండి దిగాను. బండి కదిలింది. సాహిత్యంలో అభిప్రాయ భేదాలను వ్యక్తిగత దోషంగా భావించుకొని పగపట్టే ఈ కాలం ఎక్కడ? అభిప్రాయ భేదాలు వేరు, అభిమానాలు వేరు; అభిమానాదరాలకు, మానవత్వానికి సాహిత్యంలోని మతభేదాలు అడ్డురావనే ఆ సహృదయ విమర్శక పరిశోధకాగ్రణి ఎక్కడ? అలాటి ఉదాత్త హృదయుడు మరొకడు నాకు కనిపించలేదు.

# ఈ వ్యాససంపుటిని గురించి

ప్రజలే ప్రకృతులు. వారి భాష ప్రాకృతం. ఈ ప్రాకృతం అప్పటి మేధావులు చేసిన మార్పుతో - సంస్కారంతో సంస్కృత మయింది. ఈ సంస్కారం వేదాల ఆవిర్భావానికి ముందే జరిగింది. సంస్కృత ప్రాకృతాలు రెండూ సమానాంతరంగా అభివృద్ధి చెందాయి.

ఈ ప్రాకృతంతో మనకు గల సంబంధం దాదాపు మూడు సహస్రాబ్దాలనాటిది. మనకు బౌద్ధ జైనాలతో కలిగిన ఘనిష్ఠ సంబంధంతో తెలుగు ప్రాకృతాల మధ్య పరస్పరం ఆదానప్రదానాలు జరిగాయి. ఈ భాషలు రెండూ జన్యజనక సంబంధం కలవా అన్నంతగా కలిసిపోయాయి.

ఈ విషయాలు తెలుపడం ఈ వ్యాససంపుటి ఉద్దేశం. ఈ ఉద్దేశ ప్రతిపాదనలో నా లక్ష్యం సత్యం. సత్యం సహస్ర చండ కిరణ తీక్ష్ణం. కనుక దుర్నిరీక్ష్యం. సత్యం సహస్ర చంద్ర శీతలం. కనుక సహనదూరం. కాని, సత్యం జిజ్ఞాసుయోగులకు స్వయంగా సాక్షాత్కరిస్తుంది, కనుక సహజ నిరీక్ష్యమవుతుంది; చల్లబరచి స్తబ్ధం చేయదు. సత్యదర్శనంలో అహంకారానికి తావులేదు. అహంకారం సత్యానికి బహుదూరం.

కనుక సత్యమేవ జయతే.

**Cover Printed at Nandini, Hyd.**